# చతుర

డిసెంబర్ 2002

రూ: 7/-





## ఆరోజెప్పుడు ?

కల్లూరి శైలబాల

# చతుర ప్రపంచం

## ప్రపంచ రికార్డ్

ఈ రోజుల్లో 40, 50 ఏళ్ళకే వృద్ధాప్యంలో వచ్చే రోగాలన్నీ వచ్చేస్తున్నాయి. కీళ్ళనొప్పులు, షుగర్ జబ్బులు, పక్షవాతం... ఒకటేమిటీ వయసుతో సంబంధం లేకుండా వచ్చిపడుతున్నాయి మాయదారి జబ్బులు. అయినా ఏ జబ్బులూ లేకుండా శతాధిక సంవత్సరాలు బతికే అద్భుత వ్యక్తులు కూడా అక్కడక్కడ దొరక్కపోరు వెతికితే. అతని పేరు బాంతాసింగ్. వయసు 115 సంవత్సరాలు. డెహ్రాడూన్‌లో ఈ మధ్య ప్రముఖ సర్జన్లు కొందరు అతని కాలుకి ఆపరేషన్ చేసి ఓ రికార్డు సృష్టించారు. అంత వయసులో ఆపరేషన్ చేయడం అత్యంత ప్రమాదకరమయిన విషయం. కొద్దికాలంగా కాలికి సంబంధించిన ఓ జబ్బు వలన బాంతాసింగ్ నడవలేకపోతున్నాడు. ఆపరేషన్ చేసిన డాక్టర్ కోహ్లీ ఇలా అన్నాడు. "నాకు తెలిసినంతవరకూ ప్రపంచంలోనే ఇంతవయసుగల వృద్ధునికి శస్త్రచికిత్స జరగలేదు. ఇది ఓ ప్రపంచ రికార్డ్".

ఆ ఆపరేషన్‌ని గిన్నిస్ బుక్‌లోకి ఎక్కించడానికి ఆ సర్జన్ ప్రయత్నిస్తున్నాడు. బాంతాసింగ్ ఆరోగ్యం చూసి ఆ వైద్యులు విస్తుపోయారు. ఆపరేషన్ జరిగిన వారంరోజులకే అతను లేచి వాకర్ సహాయంతో నడవగలుగుతున్నాడు. ఈ వయసులో సహితం కంటికి జోడు ధరించడు. నోట్లో పళ్ళన్నీ చెక్కు చెదరకుండావున్నాయి. అవలీలగా చెరుకు ముక్కను పళ్ళతో కొరికి హాయిగా తినగలడు. బాంతాకు షుగర్ లేదు. ఇ.సి.జి., రక్త పరీక్షలన్నీ నార్మల్ కండిషన్‌ను సూచిస్తున్నాయి. ఆ వయసులో ఆ స్థితిలో ఉండడం చూసి వైద్యులు ఆశ్చర్యపోతున్నారు. బాంతా రెండు పెళ్ళిళ్ళు చేసుకున్నాడు. ఆయనకు ఐదుగురు కుమారులు, నలుగురు కుమార్తెలు వున్నారు.






# సామూహిక వివాహ వేడుక

భారీ కట్నకానుకలివ్వడమేకాకుండా, పై ఖర్చులన్నీ కూడా భరించి ఆడపిల్లల వివాహాలు చేస్తున్న తల్లితండ్రుల పాట్లు ఇన్నీ అన్నీ కావు. డబ్బు పోయినా అటుపైన వారి దాంపత్యం అన్యోన్యంగా వుంటుందా లేక అస్తవ్యస్తమవుతుందా అన్నది కూడా ఈ రోజుల్లో భయపెట్టే సమస్య. ఒకప్పుడు కన్యాశుల్కంవుంటే, ఇప్పుడు వరకట్నం. ఎప్పుడైనా, ఏ పద్ధతిలో అయినా పవిత్రమైన వివాహబంధం డబ్బుతోనే ముడిపడివుంటుందన్నది మాత్రం నిజం.

పెళ్ళిళ్లకు అయ్యే భారీ ఖర్చులు ఏమీ లేకుండానే, అతి నిరాడంబరంగా ఆ వివాహాలు జరిగాయి. ఆ మఠం అధిపతి శివరాత్రేశ్వర దేశికేంద్ర స్వామివారి ఆధ్వర్యంలో ఆ పెళ్ళిళ్లు జరిగాయి. .

సిద్ధరాజు ఓ కారు డ్రైవరు. చాలాకాలం నుంచి ఒక యువతిని ప్రేమిస్తున్నాడు. తగినంత డబ్బు సమకూరకపోవడంవలన ఆమెతో పెళ్లిని వాయిదా వేస్తూ వచ్చాడు. చివరికి మఠంలో జరిగిన వివాహంవలన అతని కల సాకారమైంది.

అంబాలాలో వుంటున్న రాజమ్మ అనే యువతి తన పెళ్లివలన తల్లితండ్రులకు




కొంతమంది ప్రేమజంటలు ఆదర్శవివాహాలు చేసుకుందామన్నా తల్లితండ్రుల ఒప్పందం లేకనో లేకపోతే పెళ్ళంటే కొంతయినా ఖర్చు తప్పదుకదా అనో, సమాజానికి వెరచో భారీ ఖర్చుతోనే పెళ్ళిళ్ళు చేసుకుంటున్నారు. అయితే ఇటువంటివారికి బాసటగా నిల్చింది సుత్తూర్‌మఠం. ఈ మధ్య ఈ మఠంవారు అయిదురోజులపాటు సామూహిక వివాహాలను నిర్వహించారు. యాభై మూడు జంటలు పెళ్ళాడి గృహస్థులయ్యారు. పైసా కట్నం తీసుకోమని పెళ్ళికొడుకులు మఠంవారికి వాగ్దానం చేశారు. సాధారణంగా

అప్పులబాధ తప్పినందుకు ఎంతో ఆనందిస్తున్నానంది. "ఎవరెవరో ఏదేదో అనుకుంటారని మేమెందుకు భయపడాలి, ఆ అనుకునే వాళ్లు మాకు ఏ విధమైన సహకారం అందించనప్పుడు" అన్నది రాజమ్మ.

ఎంతోకాలంగా ఖర్చుకు వెనకాడి తాము తమ కుమార్తెల పెళ్లిళ్లు చెయ్యలేక సతమతమవుతున్నామని , మఠంవారి పుణ్యమా అని, తాము అప్పుల ఊబిలో చిక్కుకోకుండా బయటపడ్డామని పెళ్లికుమార్తెల తల్లితండ్రులు అన్నారు.



# ఏరినముత్యాలు

- మనం న్యాయమైనది అని నమ్మిన దాన్ని సమర్థించే మన పోరాటంలో ఓడిపోయే అవకాశం ఉన్నదని మనం నమ్మిన సత్యాన్ని ఒదులుకోకూడదు.

  – అబ్రహాం లింకన్

- అడ్డంకుల పై ఫిర్యాదులు చేయకుండా ధైర్యంగా వాటిపై దాడి చేయండి.

  – విన్సెంట్ పీలే

- చిరునవ్వుతో కూడిన వైఖరి ప్రతికూల పరిస్థితులను కూడా అవకాశాలుగా మారుస్తుంది.

  – డి.ఆర్.గుప్తా

- జీవితంలో బాగా అలసట పొందిన వాడిని కొంచెం పొగడ్త ఉత్సాహపరుస్తుంది.

  – జేమ్స్ మోన్‌రో

- మీ కళ్లద్దాలు సరిగా తుడుచుకోక ఈ ప్రపంచం మురికిగా ఉందని అనకండి.

  – హబ్బర్ట్

- ఆత్మవిశ్వాసంతో అడుగు వేయలేని మనిషి దేనినీ నమ్మడు.

  – జార్జ్

- మనలో తప్పులు లేకపోతే ఇతరుల తప్పులు ఎత్తి చూపడానికి అంత ఉత్సాహపడము.

  – స్మిత్

- అజ్ఞానులు గతాన్ని గురించి, బుద్ధిమంతులు వర్తమానాన్ని గురించి, మూర్ఖులు భవిష్యత్తు గురించీ మాట్లాడుతారు.

  – వర్డ్స్ వర్త్

- నవ్వండి, మీతో ప్రపంచం కూడా నవ్వుతుంది. ఏడవండి, మీరు మాత్రమే ఏడవాలి.

  – జాన్సన్

- మంచివాళ్లతో మాట్లాడడం వల్ల మనకు సజ్జన సాంగత్యం ఏర్పడుతుంది.

  – కాటోది ఎల్డర్

- కోపపు క్షణంలో సహనం కలిగి ఉంటే నూరు దుఃఖపూరిత రోజులనుంచి తప్పించుకోగలము.

  – హెలెన్ కెల్లర్

- ఏ వస్తువు చేతకూడా మలిన పడకుండా ప్రతి వస్తువు యొక్క ప్రతిబింబాన్నీ ఉన్నదున్నట్లు చూపే అద్దాన్ని పోలిన వివేకం ఉండాలి.

  – కన్‌ఫ్యూషియస్

సేకరణ: **వి.వి. రమణకుమార్**

# చతుర

సంపుటి: 25 సంచిక: 11 డిసెంబర్ 2002

299 వ సంచిక

పెళ్ళికిముందు ఆశీర్వచనం తీసుకోడానికి అమ్మవారి గుడికి బయలుదేరింది పెళ్ళికూతురు.
సరిగ్గా కారు ఎక్కబోతుంటే ఎదురుదెబ్బ తగిలి బొటనవేలు చిట్లి రక్తం చిమ్మింది. ఒక్కసారిగా ఆమె కళ్ళల్లో నీళ్ళు చిమ్మాయి.
అదో అపశకునంలా భావించిందా అమ్మాయి. తిరిగి వచ్చే సమయంలో అందరూ కారులో కూర్చున్నా... ఆమె... ముష్టివాళ్ళకి దానం చెయ్యాలన్న ఉద్దేశంతో వెనక్కి తిరిగి గుడి మెట్లవద్దకు వచ్చింది. అంతే... అంతలో... ఓ భయంకరమైన శబ్దం. కాళ్ళకింద భూమి కంపించి పోయింది.
ఆమెకి స్పృహ తప్పింది. అటుపైన ఆమె కథ ఎలాంటి మలుపులు తిరిగింది?
ప్రకృతి... భూకంపంగా విలయతాండవం చేసినప్పుడు... వేలాది కుటుంబాలు నిరాశ్రయులైనప్పుడు... ఏర్పడిన కొత్త అనుబంధాలు... చిత్రవిచిత్ర సంఘటనలకు అక్షరరూపం కల్లూరి శైలబాల రచన 'ఆరోజెప్పుడు?' ఈనెల 'చతుర' సమగ్ర నవల.



"కౌసల్యా సుప్రజారామా
పూర్వా సంధ్యా ప్రవర్తతే..."

సుప్రభాతం శ్రావ్యంగా విన్పిస్తోంది.

మరి కాసేపటికి ఆ ఇంట్లోంచి నమాజ్, బైబిల్ పఠనం కూడా విన్పించాయి. పాత వాళ్ళకి అలవాటుగా మారిన ఆ దృశ్యం కొత్తవాళ్లకి అబ్బురంగా అన్పిస్తుంటుంది. ఎవరేమనుకున్నా సర్వమానవ సమానత్వానికి ప్రతీక ఆ గృహం. మంచికి, మానవత్వానికి కూడా నిదర్శనమని అంటుంటారు.

గుజరాత్‌లో అంజార్ ప్రాంతం.

సమయం ఉదయం ఏడు గంటలు కావస్తోంది.

పూజ ముగించి మరోసారి భక్తిగా కళ్లు మూసుకుని దేవుడ్ని వేడుకున్నారు శారదమ్మ. ఆవిడ దేవుడ్ని ఎప్పుడూ కోరుకునేది ఒక్కటే... 'డబ్బు వెంట పరుగులు తీసే మనిషి తన ఆశను జయించాలని'

మంచి, మానవత్వం, ప్రేమ, ఆప్యాయతలకు నిలువెత్తురూపం శారదమ్మ. ఆవిడ సన్నిహితులకు కూడా శారదమ్మగారి ఆదరాభిమానాలే తెలుసు తప్ప ఇంతవరకు ఆవిడ కోపాన్ని ఎవ్వరూ చవిచూసి ఎరుగరు.

ప్రసాదం పళ్ళెం తీసుకుని కొడుకు గదిలోకి వెళ్ళారావిడ.

మొదటిగా కొడుకుకి ప్రసాదం పెట్టాకా మిగతావారికి ప్రసాదం ఇవ్వడం ఆవిడకు అలవాటు.

ప్రతిరోజూ ఆ సమయానికి చుట్టూ ఫైళ్లు పరుచుకుని వాటిలో మునిగిపోయే అతను ఈ రోజెందుకో భిన్నంగా కన్పించాడు. రివాల్వింగ్ చైర్లో కొద్దిగా వెనక్కివాలి ఏదో సుదీర్ఘంగా ఆలోచిస్తున్నాడు.

మరీ ముఖ్యంగా తల్లి అందెలరవళి కూడా అతని ఆలోచనలను భగ్నం చేయలేకపోయింది.. అంటే ఏదో తీవ్రంగా ఆలోచిస్తున్నాడన్నమాట.

కొడుకును ఆ స్థితిలో చూసేసరికి శారదమ్మగారి పెదవులమీద నవ్వు కదలాడింది. ఆవిడ కళ్ళకు కొడుకు ఎప్పుడూ మూడేళ్ళ పసిపిల్లాడిలానే కన్పిస్తాడు.

నలభైఏళ్ళు వచ్చినా టెన్షన్ ఫ్రీగా పనులు చేసుకోవడం అలవడనందుకు ఆశ్చర్యంగా ఉంటుంది ఆవిడకు. కించిత్ బాధ కూడా కలుగుతుంటుంది. ముఖ్యంగా కొడుకు ఆ విధంగా డబ్బువెంట పరుగులు పెట్టడం శారదమ్మగారికి ఎంతమాత్రం నచ్చడంలేదు. ఎందుకంటే మనిషి కూడబెట్టాల్సింది ఆస్తులు, ఐశ్వర్యాలు కాదని, మంచీ, మానవత్వమే మన వెంట వస్తాయన్నది ఆవిడ స్వీయానుభవం. ఏళ్ళతరబడి కూడబెట్టింది మొత్తం... ఒక్కసారి స్వల్పంగా భూమి కంపిస్తే నాశనమైపోతుందని ఆవిడకు తెలుసు. అప్పుడిక మిగిలేవి చెదిరిపోయిన ఆశలు... మోడువారిన బతుకులేనని ఆవిడ అనుభవం చెప్పింది.

శారదమ్మ తన అనుభవాలనే పిల్లలకి పాఠాలుగా చెప్పారు. కానీ ఎందువల్లనో ఆవిడ పెద్దకొడుకు విజేష్‌కు ఈమధ్య నోట్ల కట్టలు తప్పితే మరోటి కనబడటంలేదు. తనంతవాడైన కొడుకుకు ఇక చెప్పడం అనవసరం అనుకున్నారో లేక చెప్పినా కొడుకు వినడని అనిపించిందో తెలీదుగాని శారదమ్మగారు కొడుకు చర్యలు మౌనంగా గమనిస్తూ ఉండిపోయారే తప్ప పెదవి విప్పడంలేదు.

అంతలో ఫోన్ రింగయ్యింది.

తపస్సు చెదిరినవాడిలా కళ్ళు తెరిచాడు విజేష్.

ఒక్క ఉదుటున ఫోన్ అందుకున్నాడు.

అవతలివైపు స్వరం వినగానే కొంచెం ముందుకు వంగాడు. "హల్లో! అవును! విజేష్‌నే మాట్లాడుతున్నాను. మీరు వెళ్ళిన పని ఏమైంది?" ఆత్రుతగా అడిగాడు.

అటువైపు మాట్లాడుతున్న వ్యక్తి ఏం చెప్పాడోగాని విజేష్ ముఖంలో ఆగ్రహం బుస్సుమని పొంగింది. కళ్ళు నిప్పు కణికల్లా ఎర్రబడ్డాయి.

"రాస్కెల్... లేదు, కాదు! అనే మాటలు నాకు నచ్చవని మీకు తెలీదూ. అసలు పని పూర్తి కాకుండా నాకు ఫోన్ చేయడానికీ మీకెంత ధైర్యం? ఏడీ... ఆ రాంభాయ్ గాడు ఎక్కడున్నాడో పిలు... అరగంటలో వాడు ఆఫీసు దగ్గరుండాలి. తేడా వచ్చిందో మీ శాల్తీలు గల్లంతైపోతాయి..." అని హెచ్చరించి ఠపీమని ఫోన్ పెట్టేశాడు.

ఏ పనీ అనుకున్నది అనుకున్నట్టుగా జరగకపోవడం అతనికి చాలా చికాకు కల్గిస్తోంది.

విజేష్ అరిచిన అరుపులకి గదుల్లో వున్న వారంతా ఖంగారుగా బయటకు వచ్చి అతని రూమ్ ముందు గుమిగూడారు.

ప్రసాదం పళ్ళెంతో ఎంతో స్వచ్ఛంగా నిలబడ్డ తల్లిని చూసి గతుక్కుమన్నాడు. క్షణం క్రితం తను ఫోన్‌లో మాట్లాడిన మాటలు గుర్తుకు వచ్చి కాబోలు ఒక్కసారి సందిగ్ధంగా అటూ ఇటూ కదిలాడు. అదీ క్షణంసేపే... తిరిగి మామూలు మనిషైపోయాడు.

"నేనమ్మా! విజేష్‌ని! ఏంటలా ఎవరో కొత్త వ్యక్తిని చూస్తున్నట్టుగా చూస్తున్నావ్?' ప్రసాదంకోసం చేతులు చాపుతూ నవ్వాడు విజేష్.

శారదమ్మగారు కొడుకు ప్రశ్నకు సమాధానం ఇవ్వలేదు.

క్షణంక్రితం కొడుకు ఫోన్‌లో మాట్లాడిన మాటలే ఆవిడకు గుర్తుకు వస్తున్నాయి.

ముందుకు వెళ్ళినవాడే ఏమనుకున్నాడో ఏమో మళ్ళీ వెనక్కి తిరిగాడు. తల్లి దగ్గరకు వెళ్ళి ఆవిడ భుజాల చుట్టూ చెయ్యి వేసి దగ్గరకు తీసుకున్నాడు. తల్లి నుదురు ముద్దాడాడు.

ఆ దగ్గరికి తీసుకోవడంలో ఆప్యాయత, ఆ ముద్దులో 'నేను నీవు కని, పెంచిన బిడ్డనమ్మా. నీ మనసుకు బాధ కల్గించే పనులెన్నటికీ చేయను' అన్న భావం స్ఫురించడంతో శారదమ్మగారు కొద్దిగా తేరుకున్నారు. వెడుతున్న కొడుకుని "బాబూ!" అని పిలిచారు.

తల్లి పిలుపు విని గుమ్మం దాటబోతున్న విజేష్ ఆగాడు.

వెనకనుంచి తల్లి అన్న మాటలు అతనికి విన్పించాయి. "నాన్నా! విజేష్! ఏ మనిషికైనా ఈ ప్రపంచంలో అత్యంత విలువైనది అతని ప్రాణమేరా!"

ఆ మాటలకు మరోసారి అతనికి వెనక్కి తిరగక తప్పలేదు. తల్లి ఎందుకలా మాట్లాడిందో అర్థం చేసుకోలేని పసివాడు కాదు అతను. 'ఆవిడ భయం అర్థం లేనిదని' చెప్పాలనుకున్నాడు. కానీ ఎందువల్లనో చెప్పలేకపోయాడు. ఈలోగా శారదమ్మగారే అన్నారు. "నీ ఆవేశం చూస్తుంటే భయం వేసింది. నా మనసులో మాట చెప్పాలన్పించింది. నా కొడుకు మనుషుల ప్రాణాలు తీసే దుర్మార్గుడు కాదని నాకు తెలుసు. అయినాసరే తల్లిని కదా! మనసు ఆగలేదు. ఆవేశంలో నా బిడ్డ ఎక్కడ పొరపాటుపని చేస్తాడోనని భయం... అలాంటి పరిస్థితిలో తల్లి మాటలు గుర్తుకువచ్చి అవి ముందు కాళ్ళకి బంధాలై నీ ఆవేశానికి పగ్గంవేస్తాయని చిన్న ఆశ... అంతే... క్షేమంగా వెళ్ళిరా..." అని చెప్పి ఆవిడ లోపలికి వెళ్ళిపోయారు. రెండు నిమిషాల తర్వాత శారదమ్మగారికి విజేష్ కారు స్టార్ట్ చేసిన శబ్దం విన్పించింది. కిటికీలోంచి చూస్తున్న శారదమ్మగారికి ఆ దృశ్యం కన్పించింది. కానీ ఆవిడ మనసు మనసులో లేదు.

ఎందువల్లనో చాలా ఏళ్ళ తర్వాత ఆవిడ మనసు చాలా అస్థిమితంగా ఉంది. దాన్ని ఎలా నెమ్మదిపరచాలో ఆవిడకు అర్థం కావటంలేదు.

★ ★ ★

"అన్నా! ఆ విజేష్..." అంటూ వచ్చాడు దేశాయ్.

"రా భయ్యా! రా... అరే బిక్కూ, చందూ కూడా వచ్చారే... అంతా కలిసి వచ్చారంటే తప్పకుండా ఏదో విశేషం ఉండే ఉంటుంది.

రండి... కూర్చోండి" నవ్వుతూ ఆహ్వానించాడు షా.

తన దగ్గర పనిచేసేవారిని సొంత తమ్ముళ్ళలా చూసుకుంటాడు షా. అదే అతనిలోని గొప్పతనం.

ముగ్గురూ కూర్చున్నారు.

"అన్నా! విజేష్..." దేశాయ్ ఏదో చెప్పడానికి ప్రయత్నించాడు.

అతని మాటలు విన్పించుకోకుండా "చెప్పండి ఏం తీసుకుంటారు? కాఫీ, టీ, లస్సీ..." అడిగాడు షా.

"అది కాదన్నా..." మరోసారి తన మనసులో మాట చెప్పేందుకు ప్రయత్నించాడు దేశాయ్.

ఈసారి చేత్తో ఆగమని సైగ చేశాడు షా.

షా కావాలనే తన ఆవేశానికి బ్రేక్ వేస్తున్నాడని దేశాయ్‌కి అర్థం అయింది. దాంతో ఠక్కున అతని నోరు మూతపడిపోయింది.

నీరవ్‌షా కూడా బిల్డరే.

గత ముప్ఫైఏళ్ళుగా కన్‌స్ట్రక్షన్ రంగంలో ఉన్నాడు.

బిల్డింగ్ పనులకన్నా దాదాగిరి ఎక్కువగా చెలాయిస్తాడని అంతా అంటుంటారు. కానీ మనిషిని చూస్తే అలా అన్పించడు.

అయితే ఒకటి మాత్రం నిజం.

షా తను చెప్పింది చేస్తాడు. చెయ్యంది చెప్పడు.

అతని కళ్ళు ఏదైనా సైట్ మీద పడ్డాయా... ఇక అది అతని వశం కావాల్సిందే.

అయిదు నిమిషాల తర్వాత.

"అన్నా! నేను చెప్పేదేంటంటే..." తనకి తెలిసిన విషయాన్ని ఎప్పుడెప్పుడు 'షా'కి చెబుదామా అని దేశాయ్ తొందరపడుతున్నాడు.

దేశాయ్ పరిస్థితి తనకి అర్థం అయ్యిందన్నట్టుగా షా చిన్నగా నవ్వాడు.

"భయ్యా! ఎండలో వచ్చావు. పైగా ఆవేశంగా ఉన్నావు. కాస్త సంభాళించుకో. చెప్పు ఏం తీసుకుంటావ్? కాఫీ, టీ, లస్సీ అని" మళ్ళీ తనే "ఇప్పుడు చెప్పు ఏంటి విశేషాలు? అంతా క్షేమమేనా? అమ్మగారు బాగున్నారా? " అడిగాడు షా.

"తను ఎంతో ఆత్రుతగా ముఖ్యమైన విషయం చెప్పాలని వస్తే ఈ కుశల ప్రశ్నలేమిటి? " మనసులో చికాకుపడ్డాడు దేశాయ్. అలాగని ఆ మాట షాతో అనే ధైర్యం లేదు కాబట్టి తన విసుగును మనసులోనే నొక్కిపెట్టాడు. పైకి మాత్రం ఎంతో వినయంగా సమాధానం చెప్పాడు.

"అంతా బాగున్నారన్నా..."

"అమ్మగార్ని చూసి చాలా రోజులవుతోందే...? ఈమధ్య రాలేదు? లేక నామీదేదైనా కోపం వచ్చి నన్ను చూడకుండానే వెళ్ళిపోయారా? "

"అయ్యయ్యో! ఎంత మాటన్నా" నొచ్చుకున్నాడు "అమ్మ ఈ ఊరు వస్తే ముందుగా వచ్చేది నిన్ను చూడటానికే కదన్నా... ఆ విషయం నీకూ తెలుసుగా"

దేశాయ్ మాటలకు షా నోరంతా తెరుచుకుని నవ్వాడు.

"అవునవును. అమ్మకి నేనంటే చాలా అభిమానం"

అమ్మ అన్న మాటను ఉచ్చరించినా, అమ్మ గురించి మాట్లాడాల్సివచ్చినా షా కనులు చెమరుస్తాయి. అతనెంతో ఉద్వేగానికి లోనవుతాడు.

ఆ తర్వాత రెండు మూడు నిమిషాల పాటు ఎవ్వరూ మాట్లాడలేదు. ఎవరి ఆలోచనలలో వారుండిపోయారు.

అంతలో ఓ పదేళ్ళ కుర్రాడు అందరికీ లస్సీ తీసుకొచ్చి ఇచ్చాడు.

నీరవ్‌షాకి ఓ మంచి లక్షణం ఉంది. తినేటప్పుడు, తాగేటప్పుడు ఎవ్వరితోనూ మాట్లాడడు. అందుకే లస్సీ తాగడం పూర్తయ్యేదాకా ఎవరూ మాట్లాడలేదు. ఎవరి ఆలోచనలలో వాళ్ళుండిపోయారు.

మజ్జిగ గ్లాసు కిందపెడుతూ దేశాయ్ పై




పుకి తిరిగి అడిగాడు షా "భయ్యా! మీ ఆవిడ పుట్టింటికి వెళ్ళిందటగా"

"అవునన్నా. పోయినవారం నేనే పోయి దింపి వచ్చినా. నీవు ఊర్లో లేకుంటివి. వది నమ్మకి చెప్పి పోయినా" చెప్పాడు దేశాయ్.

"అవునట... మీ వదినమ్మ నేను ఊర్నించి రాగానే చెప్పింది. ఇంతకీ ప్రసవిం చిందా? " ఆరా తీశాడు షా.

షా భార్యని అతని దగ్గర పనిచేసేవా ళ్ళంతా 'వదినమ్మా' అని పిలుస్తారు. ఆవిడ్ని వదినమ్మా అని పిల్చినా అమ్మలా చూసుకుంటుంది. వాళ్ళ కష్టసుఖాలు విచా రిస్తుంది. కావాల్సిన సాయం చేస్తుంది.

"ఇంకా లేదన్నా. బహుశా ఈ రోజో రేపో..."

దేశాయ్ మాట పూర్తికాకుండానే "లేరా..." అంటూ అరిచాడు షా.

షా కోపం చూసి దేశాయ్ వణికిపో యాడు. తను మాట్లాడినదాంట్లో తప్పేం ఉందో, నీరవ్‌షాకి ఎందుకంత కోపం వచ్చిందో అతనికి అర్థం కాలేదు.

"లేరా" మరోసారి అరిచాడు షా.

షాకి తొందరగా కోపం రాదు. కఠినమైన యోగ సాధన చేసినవారు కూడా షాలాగా భావోద్వేగాలను కంట్రోల్ చేసుకోలేరు. కానీ అతనికి కోపం వచ్చిందో అంతే సంగతులు. శాల్తీలు గల్లంతైపోతాయి. చంపేస్తాడో లేక ఆ ఊరినుంచి దూరంగా పంపేస్తాడో తెలీ దుగానీ వారి ఆచూకీ మాత్రం దొరకదు. అతనేం చేసినా సాక్ష్యాలు దొరకవు. ఆ విషయం దేశాయ్‌కి బాగా తెలుసు.

"పోరా... ముందు పో పెళ్ళాం దగ్గరకి పో. అక్కడ ఆవిడ పురుటి నొప్పులతో బాధపడ్తుంటే దగ్గరుండి ధైర్యం చెప్పా ల్సింది పోయి... ఇక్కడ కులాసాగా కబుర్లు చెప్తున్నావా? ఇన్నాళ్ళుగా నా దగ్గర పనిచేస్తున్నారు. అయినా తల్లి విలువ తెలీలేదట్రా నీకు? ఇంకా ఎప్పుడు తెలుసుకుంటార్రా మీరు? "

షా ఒక్కక్షణం ఆగాడు.

"ఒరేయ్ కాన్పంటే పునర్జన్మలాంటిదిరా. ఈ సమయంలో ఏ స్త్రీ అయినా భర్త తన దగ్గర ఉండాలని కోరుకుంటుంది. తనకు మెలకువ రాగానే బిడ్డ గురించిన సంగ తులు భర్త నోటివెంట వినాలని ఆరాటప డ్తుంది. కానీ నువ్వు..." అని ఏదో ఆవే శంతో అనబోయి మళ్ళీ విరమించుకు న్నాడు. అతని గొంతులో అంతవరకూ ఉన్న కోపం పోయి మృదుత్వం చోటుచేసు కుంది.

"వెళ్ళరా... వెంటనే బయల్దేరి వెళ్ళు. వది నమ్మని డబ్బు అడిగి తీసుకుని వెళ్ళు"

దేశాయ్ మారుమాట్లాడకుండా వెళ్ళడానికి లేచాడు.

షా కూర్చున్న చోటునుంచి లేచి దేశాయ్ భుజంమీద చెయ్యివేసి దగ్గరకు తీసుకు న్నాడు. "అన్నమీద కోపం పెట్టుకోకు... బిడ్డ పుట్టగానే ఫోన్ చేసి తల్లీబిడ్డా క్షేమంగా ఉన్నారని చెప్పు... ఖుషీ చేసు కుంటాం" అన్నాడు.

"ఎంతమాటన్నా. మీమీద కోపం తెచ్చు కుంటామా. నువ్వేం చెప్పినా మా మంచికో సమే చెప్తావని మాకూ ఎరుకనేనన్నా... పోయొస్తనన్నా"

దేశాయ్ వెళ్ళాక అడిగాడు షా "ఇప్పుడు చెప్పండి ఆ సంగతేమిటి? " అని. "ఇందాక మీరు చెప్పబోతుంటే కావాలనే తాత్సారం చేశాను. ఎందుకో తెలుసా? "

చందు, బిక్కూ ఇద్దరూ ముఖముఖాలు చూసుకున్నారు.

"మనం ఏదైనా పనిచేయడానికి తప్ప కుండా ఆవేశం కావాలి. మన ఆవేశం మనకు డ్రైవింగ్ ఫోర్స్‌గా ఉపయోగపడాలి. కానీ ఆలోచించేప్పుడు ఆవేశం పనికిరాదు. చాలా కూల్‌గా ఆలోచించాలి. మీరు రాగానే విషయమేంటని అడిగాననుకోండి మీరు జరిగింది జరిగినట్టు చెప్తారు. అసలు విషయానికి మీ ఊహలు, అభిప్రాయాలూ

కూడా జతచేరుస్తారు. న్యూస్‌లో ఫ్యూస్ కల పడం వలన పిక్చర్‌లో క్లారిటీ ఉండదు. ఫలితంగా నేను సరైన నిర్ణయం తీసుకో లేను" అని షా నవ్వాడు. ఒక్కక్షణం తర్వాత తిరిగి అన్నాడు. "ఇప్పుడు ఆ ఇబ్బందిలేదు. కొంచెం శాంతించారుగా. సరే అసలు విషయం చెప్పండి" అన్నాడు.

"అన్నా,

"విజేష్ కూడా మనం ప్రయత్నిస్తున్న రతీబెన్ గోవిందా స్థలంకోసం ప్రయత్నిస్తు న్నాడంటన్నా" చెప్పాడు చందు.

"ఆహా..." తల పంకించాడు షా.

"మనం ఊరుకుంటే లాభంలేదన్నా. ఏదో ఒకటి చెయ్యాలి" అప్పటిదాకా మౌనంగా ఉన్న బిక్కూ నోరువిప్పాడు.

"తప్పకుండా చేద్దాం. తొందరేముంది? అయినా విజేష్ ఆవిడ స్థలంకోసం ప్రయత్నం చేస్తున్నాడు అంతేగా. చేసుకోనీ. ఇంతలో ఏమైంది? ఆ సైట్ తప్పకుండా మనదే అవుతుంది"

"అన్నా... నిన్నో ప్రశ్న అడిగేదా?" బిక్కూ స్వరం మునుపటిలా లేదు. ఆ గొంతులో ఏదో తెలీని సందిగ్ధం, సంశయం వ్యక్తం అయ్యాయి.

"అడగరా..."

"ఆ విజేష్‌ని... నువ్వెందుకు? ..."

"ఉపేక్షిస్తున్నావ్ అంటావు. అంతేగా?"

షా ప్రశ్నకు బిక్కూ అంతేనన్నట్టుగా తలాడించాడు.

కుర్చీలోంచి లేచి అటూఇటూ పచార్లు చేస్తూ అన్నాడు షా. "అందుకు రెండు కార ణాలున్నాయి తమ్ముడూ. ఈ రంగంలో ఇంతవరకూ మనకు పోటీ అనేదిలేదు. విజేష్ ఈ రంగంలోకి అడుగుపెట్టేవరకు ఏకచ్ఛత్రాధిపత్యంగా ఏలాం. బుర్రకి అంతగా పదును పెట్టాల్సిన అవసరం రాలేదు. ఇప్పుడు విజేష్ వచ్చాడు. మనతో పోటీగా వ్యాపారం చేస్తున్నాడు. మొత్తానికి





అతని రాకతో ఎత్తులు, పై ఎత్తులతో వ్యాపారంలో థ్రిల్ కన్పిస్తోంది. ఆ మేధా వితో సరదాగా ఓ ఆట ఆడుకోవాలన్పి స్తోంది"

"మరి రెండో కారణం?"

చందూ ప్రశ్నకు సమాధానం చెప్పకుండా షా ఆ గదిలో ఉన్న ఓ ఫొటో దగ్గరకు నడి చాడు.

"చెప్పన్నా... ఆ రెండో కారణం ఏమిటి?" తొందరపెట్టాడు బిక్కూ.

"ఆ రెండో కారణం... విజేష్ తల్లి"

చందూ, బిక్కూ ఇద్దరూ ఆశ్చర్యపో యారు.

షా కొనసాగించాడు. "అవున్రా... మీరో సారి అడిగారు గుర్తుందా? ఆ విజేష్ నీకన్నా ఎందులో ఎక్కువన్నా అని. ఇదిగో ఇందులోనేరా... అతనికి తల్లి ఉంది. నాకు లేదు" షా గొంతులో బాధ గూడుకట్టు కుంది.

"రేయ్ ఇలా రండ్రా..." పిలిచాడు షా.

చందూ, బిక్కూ ఇద్దరూ షా దగ్గరకు వెళ్ళారు.

ఫొటో చూపిస్తూ "చదవండ్రా" అన్నాడు షా.

చందు, బిక్కూ ఇద్దరూ ఫోటోకింద రాసిన వాక్యాలు చదవసాగారు.

ఆ ఫొటో షా తల్లిది. ఫొటోకింద ఇలా రాసి ఉంది.

"అమ్మ చూపు చల్లదనం సోకితే చాలు
అగ్నిపర్వతం హిమవన్నగమవుతుంది
అమ్మ చిరునవ్వు చిలికితేచాలు గ్రీష్మంలో వసంతం వస్తుంది.
అమ్మ ప్రేమగా స్పృశిస్తేచాలు, పోయిన శక్తులన్నీ దేహంలో వచ్చి చేరతాయి"

అందులో గొప్ప భాష లేకపోవచ్చు కానీ భావం ఉంది.

"ఇది నేను నా చిన్నప్పుడు రాసి ప్రైజు గెల్చుకున్నానురా. ఆ బహుమతి అమ్మకి చూపించాలనుకునేలోపే విధి నామీద కన్నెర్ర చేసింది. నా తల్లిని నాకు దూరం

చేసింది. అంతవరకూ అమ్మ కొంగు పట్టుకుని తిరిగిన నేను అనాథనైపోయాను. అమ్మ పోయింది. అమ్మ ఫొటో మాత్రమే మిగిలింది. అమ్మ నాకికలేదన్న నిజం భరించలేక కూలిన శిథిలాలకింద "అమ్మా... అమ్మా" అంటూ అమ్మకోసం వెతికి వెతికి పిచ్చివాడినైపోయాను. కూడులేదు, గుడ్డ లేదు, నిలువ నీడలేదు. కానీ నాకు అవేమీ ముఖ్యం అన్పించలేదు. అమ్మ కన్పిస్తే చాలనుకున్నాను. ఆవిడ తిరిగిరాని లోకాలకు వెళ్ళిపోయింది. కనీసం అమ్మ మృతశరీరాన్ని కూడా అధికారులు ఇవ్వలేకపోయారు. గుట్టలు గుట్టలు శవాలు... కాళ్ళు విరిగి, చేతులు విరిగి, తల తెగి... ఓహ్...'

' షా గొంతు దుఃఖంతో పూడుకుపోయింది.

"ఊరుకో అన్నా" ఓదార్పుగా అన్నాడు చందూ.

షా కళ్ళు తుడుచుకున్నాడు. "ఒరేయ్ నేను ఎంత దురదృష్టవంతుడినో తెలుసా. కనీసం కన్నతల్లికి కొరివిపెట్టే అదృష్టానికి కూడా నోచుకోలేకపోయాను. అమ్మని ఓ అనాథ ప్రేతంకి మల్లే..." భోరుమన్నాడు నీరవ్‌షా.

బిక్కూ షా భుజం చుట్టూ చెయ్యివేసి దగ్గరకు తీసుకున్నాడు.

దాదాపు అయిదు నిమిషాలపాటు అక్కడ మౌనం రాజ్యమేలింది.

నెమ్మదిగా తననుతాను సంభాళించుకున్నాడు షా. కళ్ళు తుడుచుకుంటూ అన్నాడు, "రేయ్... ఒక్కమాట గుర్తుంచుకోండిరా. అమ్మలేనివాడు, ఉండీ అమ్మప్రేమకు నోచుకోనివాడు ఎంత సంపాదించినా, ఎన్ని కోట్లు వెనకేసినా నా దృష్టిలో దరిద్రుడేరా. నేనూ అంతే... నా తల్లిని పోగొట్టుకున్నప్పటినుంచీ ఏ మాతృమూర్తిని చూసినా నాకు నా తల్లే జ్ఞాపకం వస్తుంది. ఇంతక్రితం దేశాయ్‌ని కేకలేసి పంపింది కూడా అందుకే. ఈరోజు విజేష్‌ని ఉపేక్షిస్తోంది కూడా ఇందువల్లనే. అతనికేదైనా అయితే అతని తల్లి బాధపడుతుంది. అందుకే విజేష్‌ని ఏమీ చెయ్యలేకపోతున్నాను. వీటన్నింటితోపాటు విజేష్ ఎదురైనప్పుడల్లా ఏదో తెలీని ఆత్మీయతాభావం నన్ను కుదిపేస్తోంది. అందుకే అంత కఠినంగా ప్రవర్తించలేకపోతున్నాను"

"కానీ... అన్నా..." సంశయంగా ఆగిపోయాడు చందు.

"నీ సంశయం నాకు అర్థం అయ్యింది" హఠాత్తుగా షా స్వరం కఠినంగా మారిపోయింది. "ఇక నేను ఊరుకోను... ఇంకా ఉపేక్షిస్తే మన వ్యాపారం పునాదులు కదిలిపోయేలా ఉన్నాయి. మీరంతా అతను ఏం చేస్తున్నాడనేది నాకు ఎప్పటికప్పుడు తెలియచేయండి. మిగతాదంతా నేను చూసుకుంటాను. వెళ్ళిరండి"

బిక్కూ, చందూ ఇద్దరూ లేచారు.

షా తన తల్లి ఫొటోవంక చూస్తుండిపోయాడు.

అతని ఏకాంతానికి భంగం కలిగించకుండా ఇద్దరూ ఆ గదిలోంచి బయటకు వచ్చారు.

ఇక 'ఆ రోజంతా 'షా' తన తల్లి జ్ఞాపకాలతో గడిపేస్తాడని వారికి తెలుసు.

★ ★ ★

"రాంభాయ్ వచ్చాడా?" ఆఫీసులోకి ఎంటర్ అవుతూనే విజేష్ అడిగిన మొట్టమొదటి ప్రశ్న ఇదే.

"వచ్చాడన్నా..." అని వర్ధన్ అంటుండగా రాంభాయ్ లోపలికి వచ్చాడు.

"వెళ్ళినపని ఏమైంది?" సూటిగా అడిగాడు విజేష్.

.రాంభాయ్ తలవంచుకుని నిలబడ్డాడు తప్ప సమాధానం చెప్పలేదు.

"నిన్నేరా! అడుగుతోంది" స్వరం మరికాస్త పెంచాడు. "వెళ్ళినపని ఏమైంది?"

"నేను..." అని తలెత్తి విజేష్ ముఖంలోకి చూసి గుటకలు మింగాడు రాంభాయ్. మళ్ళీ అంతలోనే ధైర్యం తెచ్చుకుని

చెప్పాడు. "నేను, నేనసలు వెళ్ళలేదన్నా"

అప్పుడు కొట్టాడు విజేష్.

ఆ దెబ్బకి అంత లావాటి మనిషి వెళ్ళి అయిదు అడుగుల దూరంలో పడ్డాడు.

ఈ హఠాత్ పరిణామానికి వర్ధన్ నివ్వెర పోయాడు.

వెళ్ళి రాంభాయ్‌కి చెయ్యి అందించాడు. అతన్ని లేపాడు.

"లేదు! కాదు! అనేమాటలు నాకు నచ్చవని మీకు తెలీదూ"

రాంభాయ్ పెదవి చిట్లి రక్తం కారుతోంది. అయినా నోరెత్తకుండా నిలబడ్డాడు.

"అన్నా! అసలేమైందంటే..." వర్ధన్ ఏదో చెప్పబోయాడు.

"ఏంటి? వాడ్ని వెనకేసుకొస్తున్నావు? "

"లేదన్నా" ధైర్యంగా అన్నాడు వర్ధన్.

"జరిగిందేమిటో తెలిస్తే నువ్విలా మాట్లాడవు"

వర్ధన్ ఈమధ్యనే విజేష్ దగ్గర చేరాడు. మనిషి మహాచురుకు. ఒక్కక్షణం కూడా ఖాళీగా కూర్చోలేడు. తన తప్పులేనిదే ఎవరేమన్నా మాటపడడు. తన తప్పు ఏదైనా ఉంటే అవతలి వ్యక్తి ఎన్ని మాటలన్నా నోరెత్తడు. వర్ధన్ అనాథ. రాంభాయ్ అతడిని సొంత తమ్ముడికన్నా ఎక్కువగా చూసుకుంటున్నాడు. రాంభాయ్ పిల్లలు వర్ధన్‌ను 'బాబాయ్' అని ఎంతో ప్రేమ చూపుతారు. ఈరోజు విజేష్ జరిగిందేమిటో తెలుసుకోకుండా రాంభాయ్‌ని కొట్టేసరికి వర్ధన్‌కి కోపం వచ్చింది.

"చెప్పరా..." అన్నాడు విజేష్. వర్ధన్ ఏదో చెప్పబోయి ఆగిపోయాడు.

"నేను మీకో పని అప్పగిస్తే వెంటనే చెయ్యరన్నమాట. ముందు మీ పనులు చూసుకుని, అవన్నీ పూర్తయ్యాక అప్పుడు... టైంవుంటే, చేయాలనే మూడ్ వస్తే చేస్తారన్నమాట. నేను మాత్రం వెళ్ళినపని ఏమైందిరా అని మిమ్మల్ని అడగకూడదు. మీకు పని అప్పచెప్పి మీకెప్పుడు మూడ్ వస్తుందా! మీరెప్పుడు నా పన్లు చేస్తారా అని ఎదురుచూడాలి...అదేగా నువ్వనేది..." విజేష్ గొంతు కటువుగా విన్పించింది.

"లేదన్నా... ఆ షా మనిషి రాంభాయ్‌ని దారుణంగా మోసంచేశాడు"

షా పేరు వినేసరికి విజేష్ ఎలర్టయ్యాడు.

వర్ధన్ కొనసాగించాడు. "రాంభాయ్ ఓ స్థలం కొనుక్కునేందుకు అడ్వాన్స్ ఇచ్చాడని నీకు తెలుసుగా! ఈరోజు అగ్రిమెంట్ చేసుకుందాం రమ్మన్నాడు. తీరా వెడితే ఎదురు తిరిగాడన్నా"

"ఏమంటాడు? " విజేష్ భృకుటి ముడిపడింది.

"ఏముంది? నేను నీకు ఆ సైట్ అమ్మదలచుకోలేదంటాడు. అలాంటప్పుడు మా దగ్గర డబ్బులు తీసుకున్నావు కదా! అవి ఇచ్చెయ్ అంటే... నా దగ్గర ఇప్పుడు లేవు. ఉన్నప్పుడు నీపైసలు నీకిస్తాను వచ్చి తీసుకుపో అన్నాడు" ఉక్రోషంగా అన్నాడు వర్ధన్.

విజేష్ రాంభాయ్ వైపు చూశాడు.

రాంభాయ్ ముఖం వాడిపోయింది.

విషయం తెలుసుకోకుండా అనవసరంగా కొట్టినందుకు విజేష్‌కి బాధగా ఉంది.

"అవునన్నా! ఆ స్థలం కోసం నువ్వు కూడా కొంత డబ్బిచ్చావు. ఇప్పుడేమో అగ్రిమెంట్ మీద సంతకమూ పెట్టడట, డబ్బులూ ఇవ్వడట. ఉన్నప్పుడు ఎప్పుడో ఇస్తాడట" చెప్పాడు రాంభాయ్.

విజేష్ ఇంకేం ఆలోచించలేదు. టేబుల్ మీదనున్న కారు తాళంచెవులు చేతిలోకి తీసుకున్నాడు.

"పదరా" అని రాంభాయ్‌తో అన్నాడు.

విజేష్‌కన్న ముందే కారు దగ్గరకు నడిచి అతనికోసం డోరు తెరిచి పట్టుకున్నాడు వర్ధన్.

విజేష్ కారెక్కాక చెప్పాడు "వసంత్ దగ్గ





రకు పోనీయ్" కారు కదిలింది.



ఇక్కడ మనం వసంత్ గురించి కొంచెం చెప్పుకోవాలి.

అతను కృష్ణాజిల్లావాడు.

గుజరాత్‌లో స్థిరపడ్డాడు.

కట్టుబట్టలతో గుజరాత్‌లో దిగిన వసంత్ కుమార్ నేడు ఓ రెండుమూడు మేడలకి ఓనరయ్యాడు.

రియల్ ఎస్టేట్ బిజినెస్ చేస్తాడని చెప్పుకుంటారుగానీ నిజానికి అదొక్కటే అతని బిజినెస్‌కాదు. ఇంకా చాలా ఉన్నాయి.

మనిషి పొట్టిగా, నల్లగా, లావుగా ఉంటాడు. దానికితోడు బొమ్మల చొక్కాలు, మెరుపుల చొక్కాలు వేస్తుంటాడు. నోట్లో ఎప్పుడూ కిళ్ళీ ఉండాల్సిందే.

అతన్ని చూస్తే ఎదుటివారికి ఎంతమాత్రం మంచి అభిప్రాయం కలగదు. ఇక మాట్లాడటం మొదలుపెట్టాడా అంతేసంగతులు... అతనికి దూరంగా పారిపోవాలన్పిస్తుంది.

వసంత్‌కుమార్ గుజరాత్ వచ్చిన తొలినాళ్ళలో దొంగతనాలు చేసేవాడు. జేబులు కత్తిరించేవాడు. దొరికితే దొంగ, లేకపోతే దొర అన్నట్లు బతికేవాడు. క్రమంగా స్థలాలు తక్కువరేటుకి కొనడం, కబ్జా చేయడంవంటివి నేర్చుకున్నాడు. అన్నింటికన్నా ఈ వ్యాపారమే అతనికి మెరుగన్పించింది. అందుకని దీంట్లో కొంచెం నిలదొక్కుకున్నాక పిక్‌పాకెటింగ్, స్మగ్లింగ్ మానేశాడు. అంటే పూర్తిగా విరమించాడనికాదు... కొంతమంది కుర్రాళ్లను చేరదీసి వారికి తన అనుభవసారాన్నంతా బోధించి వాళ్ళతో ఆయా కార్యక్రమాలు నిర్వహిస్తున్నాడు. లాభంవస్తే వాళ్ళకి కొంత ఇస్తాడు. మిగతాది తన ఖాతాలో జమవేసుకుంటాడు. వాళ్ళెప్పుడైనా అరెస్ట్ అయితే 'మానవతా ధృక్పథం' అనే ముసుగు తొడిగి ఆ కుర్రాళ్ళు తనకేం కాకపోయినా, వారితో తనకెలాంటి సంబంధం లేకపోయినా వాళ్ళని విడిపిస్తున్నట్టు బిల్డప్ ఇస్తాడు. ఏదైనా మరీ పీకలమీదకొస్తే 'షా' అండదండలు తనకెలాగో ఉన్నాయన్న ధీమావల్ల కూడా అతని వ్యాపారం ఒడిదుడుకులు లేకుండా లాభసాటిగా సాగుతోంది.

షా కూడా మొదట్లో వసంత్ తనకేమైనా పనికొస్తాడేమోనని ట్రయల్ వేశాడు. కానీ వసంత్ డబ్బుకాపీనం చూశాక నీరవ్‌షా ఆ ఆలోచన విరమించుకున్నాడు. అసలు ఏ వ్యాపారంలోనైనా కొద్దోగొప్పో నీతి, నిజాయితీ ఉండాలి. కాని వసంత్ నిఘంటువులో ఆ రెంటికీ చోటులేదు.

"ఎలాంటి లంగాకోరుపనులైనా సరే చేసి డబ్బు సంపాదించు బ్రదర్... లేదంటే వీధి కుక్క కూడా నిన్ను చూసి తోకవూపదు" అంటాడు వసంత్.

విజేష్ కారు వసంత్ అడ్డాముందు ఆగింది.

అందుకోసం ప్రత్యేకంగా స్థలం కేటాయించే వెర్రివాడేంకాదతను. ప్రస్తుతం ఏ స్థలమైతే అమ్మకానికి పెట్టాడో అదే అతని అడ్డా. అక్కడినుంచే లావాదేవీలు నడుపుతాడు.

నిజానికి నీరవ్‌షా వసంత్‌ని చాలాదూరంగా ఉంచుతాడు. కానీ అతను మాత్రం

తాను 'షా' మనిషినని చెప్పుకుంటూ అందర్నీ భయపెడుతూ తనపనులు జరిపించుకుంటూ వుంటాడు.

మొదట రాంభాయ్ కారులోంచి దిగాడు.

రాంభాయ్ తల్చుకుంటే ఒక్కచేత్తో వసంత్‌ని ఎత్తి అవతల పడేయగలడు. అలాచేస్తే వసంత్‌కుమార్ 'రక్షించు ప్రభూ' అని ప్రార్థిస్తూ నీలవ్‌షా దగ్గరకు వెడతాడు. షా రంగంలోకి దిగితే విజేష్ కూడా కల్పించుకోవాల్సి వస్తుంది. ఇద్దరిమధ్యా గొడవలు పెరుగుతాయి. తనకు చెప్పకుండా వసంత్‌తో గొడవపడినందుకు విజేష్ కేకలేస్తాడు. కానీ ఇప్పుడు పరిస్థితి వేరు. విజేష్ తనంతటతానుగా రంగంలోకి దిగాడు కాబట్టి రాంభాయ్ ఏంచేసినా విజేష్ చూసుకుంటాడు.

రాంభాయ్‌ని చూడగానే వసంత్ నొసలు చిట్లించాడు.

అవతల వేరేపార్టీతో డీల్ ఫైనలైజ్ కాబోతుండగా రాంభాయ్ సీన్లోకి ఎంటర్ అవడం వసంత్‌కి నచ్చలేదు. అందుకే రాంభాయ్‌ని చూడగానే తనే ఎదురెళ్ళాడు. "మళ్ళీ ఎందుకొచ్చావ్?" కోపంగా అడిగాడు.

"మళ్ళీ రావడం ఏమిటన్నా! ఈరోజు అగ్రిమెంట్ రాసుకుందాం... సైట్ దగ్గరకు రమ్మని చెప్పావు కదా" కూల్‌గా చెప్పాడు రాంభాయ్.

ఒక్కక్షణం తెల్లబోయినా అంతలోనే సర్దుకున్నాడు వసంత్.

"అతి తెలివిగా మాట్లాడకు" గట్టిగా అరిచాడు వసంత్. మళ్ళీ అంతలోనే సర్దుకున్నాడు. ఇప్పుడు రాంభాయ్‌తో అరిచి గొడవపడితే వచ్చిన పార్టీ వెనక్కి తిరిగి వెళ్ళిపోతుందని అతనికి అర్థం అయింది. అందుకే గొంతు బాగా తగ్గించి చెప్పాడు. "ఈ స్థలం నీకు అమ్మడం లేదని ఆల్రెడీ చెప్పానుకదా! మళ్ళీ ఎందుకొచ్చావ్? మర్యాదగా ఇక్కడ్నించి వెళ్ళిపో... నీకు ఇవ్వాల్సిన డబ్బు రెండుమూడు రోజులలో సర్దుబాటుచేస్తాను"

వీలైనంతవరకు గొడవపడకుండా రాంభాయ్‌ని అక్కడ్నించి పంపేయాలన్నది వసంత్ అభిమతం.

"అలా కుదరదన్నా" రాంభాయ్ అంటుండగా వర్ధన్ కారులోంచి దిగాడు.

వర్ధన్‌ను చూసి వసంత్ మరింత ఇరిటేట్ అయ్యాడు. "ఏంటీ? నీతోపాటు ఓ చెంచాగాడిని వెంటపెట్టుకొస్తే నేను భయపడిపోయి నీకాళ్ళు పట్టుకుని 'రాంభాయ్! నన్ను క్షమించు. ఏదో బుద్ధి గడ్డి తిని, డబ్బుకి కక్కుర్తిపడి స్థలం నీకు ఇవ్వనన్నాను. కానీ ఇప్పుడు నాకు బుద్ధివచ్చింది, అన్నమాట ప్రకారం అగ్రిమెంట్ చేసుకుందాం' అని అంటాననుకున్నావా! అలాంటి ఆశలేమీ పెట్టుకోకు. నా సర్వీసులో నీలాంటి వాళ్ళని ఎంతోమందిని చూశాను. ఒక్కఫోను... ఒకే ఒక్కఫోన్ చేస్తే షా మిమ్మల్నందరినీ సున్నంలోకి ఎముక మిగల్చకుండా విరగ్గొడతాడు. అంతవరకు తెచ్చుకోకుండా మర్యాదగా ఇక్కడ్నించి వెళ్ళిపోండి"

వసంత్ మాటలకు వర్ధన్ ఏమాత్రం భయపడలేదు సరికదా ధైర్యంగా మరో అడుగు ముందుకు వేశాడు. "చూడు అన్నా! మనమంతా ఒకేరంగంలో ఉన్నాం. పొద్దున్న లేస్తే ముఖాముఖాలు చూసుకోవలసినవాళ్ళం. మనలో మనకు గొడవలు ఎందుకు చెప్పు?" అంటూ చనువుగా వసంత్ భుజం మీద చెయ్యి వేశాడు. "రా అన్నా! ఇంతక్రితం మనం అనుకున్న విధంగా అగ్రిమెంటు మీద సైన్ చెయ్యి. నువ్వూ హ్యాపీ, మేమూ హ్యాపీ"

వర్ధన్ చెయ్యి విదిలించి కొట్టాడు వసంత్.

"వర్ధన్! ఇది నాకూ, రాంభాయ్‌కీ సంబంధించిన వ్యవహారం. మేమూ మేమూ చూసుకుంటాం. ఇందులో నీ జోక్యం అనవసరం. మర్యాదగా నువ్విక్కడినుంచి వెళ్ళి

పోతే మంచిది. లేదంటే..."

"ఆ... లేదంటే..." మరో అడుగు ముందుకు వేశాడు వర్ధన్. "చెప్పు లేదంటే ఏంచేస్తావ్?"

వసంత్ కళ్లల్లో ఆగ్రహంతో పాటు ఒకవిధమైన కసి కూడా కదలాడింది. తన అనుభవం అంత వయసు లేని కుర్రాడు తన ఇలాకా లోకి వచ్చి తనవాళ్లముందర చేతులు మడిచి 'నేను ఇక్కడ్నించి వెళ్లకపోతే ఏం చేస్తావ్?' అని అడుగుతున్నాడంటే... తనను తక్కువగా అంచనా వేయడమే కదా! అంతే అతను ఒక్కసారిగా దెబ్బతిన్న పులిలా మారిపోయాడు. వెనక్కి తిరిగి "రేయ్! అలా చూస్తూ నిలబడ్డారేంట్రా... ఈ...(బూతు మాట) ని బయటకి ఈడ్చేయండ్రా. ఎవడడ్డ మొస్తాడో నేను చూస్తాను..."

వసంత్ మాటకోసం ఎదురుచూస్తున్న వాళ్ళంతా గ్రీన్‌సిగ్నల్ లభించడంతో ముందుకి ఉరికారు. కానీ అంతలోనే ఎవరో మంత్రించినట్టుగా ఎవరికివాళ్ళు ఉన్నచోటనే నిలబడిపోయారు.

"ఏంట్రా?" అసహనంగా అరిచాడు వసంత్.

వాళ్ళెవ్వరూ మాట్లాడలేదు.

మాట, పలుకు లేకుండా అలా నిలువు గుడ్లేసుకుని చూస్తూ నిలబడేసరికి వసంత్‌కి అనుమానం వచ్చింది. తను కూడా ఆ వైపు చూశాడు.

"ఏం వసంత్‌భయ్యా! క్షేమమా! సౌఖ్యమా?" అంటూ కారులోంచి దిగాడు విజేష్.

విజేష్‌ని చూసేసరికి అప్పటివరకు కల్లు తాగిన కోతిలా గెంతులువేస్తున్న వసంత్ నోటమాట పడిపోయినవాడి మాదిరిగా నిలబడిపోయాడు.

నీరవ్‌షా అయినా కొంచెం వెనుకా ముందూ ఆలోచిస్తాడుగాని విజేష్ ఆవేశానికి మాత్రం హద్దులుండవని వసంత్‌కి తెలుసు. మనుష్యుల్ని చంపడుకానీ వారిని జీవచ్ఛవాల్ని చేస్తాడు.

"ఎందుకు భయ్యా! ఈ గొడవలన్నీ... ఓ మాట అనుకున్నప్పుడు దానికి కట్టుబడి ఉండాలి కదా! దా... వచ్చి అగ్రిమెంట్ మీద సంతకం పెట్టు" అన్నాడు విజేష్.

అంతే వసంత్ విజేష్ కాళ్ళమీద పడినంత పనిచేశాడు.

"అన్నా నన్ను క్షమించు... రాంభాయ్‌ని మోసం చేయాలనే ఉద్దేశ్యం నాకు లేదన్నా! కానీ ఏంచేసేది? వాళ్ళని షా పంపాడన్నా! షా గురించి నీకు తెలీందేముంది? చెప్పినట్టు చెయ్యకపోతే నిర్దాక్షిణ్యంగా నా పీక తెగ్గోస్తాడు. ఈ ఒక్కసారికీ వదిలెయ్యన్నా. రాంభాయ్‌కి తప్పకుండా మరో స్థలం ఇప్పించే పూచి నాది" దాదాపుగా దణ్ణంపెట్టినట్టుగా బతిమాలాడు వసంత్.

"చూడు వసంత్‌భయ్యా! అగ్రిమెంట్ మీద సంతకం చేయకపోతే మేమైనా అంతే" తాపీగా అన్నాడు విజేష్.

వసంత్‌కి అతనన్నదేమిటో వెంటనే అర్థం కాలేదు.

విజేష్ వర్ధన్‌వైపు చూశాడు.

"అన్న ఏమంటున్నాడంటే అగ్రిమెంట్ మీద సైన్ చేస్తే షా చంపేస్తాడు. చెయ్యకపోతే మేమైనా అంతే... అలాంటప్పుడు ఆ చచ్చేదేదో నిజాయితీగా మాటకి నిలబడే మనిషివన్న ఖ్యాతి తెచ్చుకుని చచ్చిపో అంటున్నాడు"

"వర్ధన్! వెళ్ళి కారు స్టార్ట్ చెయ్యి" అని వసంత్ వైపు తిరిగాడు.

"వసంత్‌భయ్యా చాలా మంచోడు. ఏమనుకోకు భయ్యా! కుర్రాళ్ళు కదా! కొంచెం ఆవేశం ఎక్కువ" అన్నాడు.

విజేష్‌ని ఒక్కతోపు తోశాడు వసంత్. "చెప్తుంటే మీకు కాదా నేను సంతకం చెయ్యను. మీరిచ్చిన డబ్బు కూడా వెనక్కి తిరిగి ఇవ్వను. ఏం చేసుకుంటారో చేసుకోండి"

అప్పుడు కొట్టాడతన్ని రాంభాయ్.

సచిత్ర విచిత్రం

# రంగుల వారధి




వర్షా కాలంలో అద్భుతంగా ఆకాశంలో దర్శనమిచ్చే హరివిల్లు నింగినుంచి నేలకు వేసిన రంగుల వారధిలా తోస్తుంది. ప్రాచీన కాలంలో గ్రీకులు తమ దేవత అయిన ఐరిస్ యొక్క వంతెనగా ఇంద్రధనుస్సును భావించేవారు. ఆ వంతెన ద్వారా ఆ దేవత తన రాయబారిని పంపి యుద్ధం రానున్నదనే సంకేతాన్ని అందిస్తున్నట్లు తలచేవారు. ఆఫ్రికన్లు ఒక పెద్ద తుపానుకు సంకేతంగా తలచేవారు ఇంద్రధనుస్సును. ఆ తుపాను పిమ్మట ఓ భయంకరమైన సర్పం వచ్చి కన పడినవాటినన్నిటినీ భక్షిస్తుందని వారు భయపడేవారు. ఐరోపా వారు అదొక సర్ప మనీ, నదుల నీరు తాగి తిరిగి వర్షంగా కురిపిస్తుందనీ నమ్మేవారు. జర్మనులు ఇంద్రధనుస్సు దేముడి రంగులపెట్టె అనీ, ఆ రంగులను ప్రకృతికి అద్ది దానిని అందంగా తీర్చి దిద్దుతాడనీ భావించేవారు. క్రమంగా ఆ భావాలు అంతరించాయి.

అంతే అంతమనిషి నిట్టనిలువునా కూలి పోయాడు.

రాంభాయ్, వర్ధన్‌లు ఇద్దరూ కలిసి వసంత్‌ని కారులో ఎక్కించారు.

వర్ధన్ స్టీరింగ్ చేతిలో తీసుకున్నాడు.

కారు ముందుకి కదిలింది.

వసంత్ మనుష్యులు అచేతనంగా నిలబడిపోయారు.

★ ★ ★

అప్పుడే కాలేజీ వదిలారు.

స్టూడెంట్స్ అంతా కబుర్లు చెప్పుకుంటూ బయటకు వస్తున్నారు. అసలా ప్రాయమే అలాంటిది.

"సుశీలా! ఏంటా పెళ్ళినడక? కొంచెం త్వరగా నడుతల్లీ..." హెచ్చరించింది దివ్య. ఆ మాటలు విన్పించాయో లేక వినబడి కూడా విననట్టు ఉందో తెలీదుగానీ ఆ అమ్మాయి నడక వేగంలో మాత్రం ఎలాంటి మార్పు రాలేదు.

అసలా అమ్మాయి మనసు ఇక్కడుంటే కదా!

ఒకక్షణం నవ్వుతూ, తుళ్లుతూ ఉరకలు వేస్తుంది.

మరుక్షణం ఏదో సుడిగుండంలో పడిపోయినంత బాధతో విలవిల్లాడుతుంది.

ఒకక్షణం గలగలా మాట్లాడేస్తుంది.

మరుక్షణంలో మాటరానిదానిలా మూగదైపోతుంది.

ఒకక్షణం జలపాతంలా ఉరకలువేస్తుంది.

మరుక్షణం ఘనీభవించిన శిలలా గంభీర ముద్ర దాలుస్తుంది. ఇంతకుముందు ఇలా ఉండేది కాదు.

సరిగ్గా సంవత్సరం క్రితంనుంచే ఇలా తయారైంది.

కారణం ప్రేమ.

స్నేహితురాలు ఎంతగా హెచ్చరిస్తున్నా ఆమెకు అడుగు పడటంలేదు. అతను వచ్చాడేమోనని నలువైపులా వెతికింది.

కానీ అతనెక్కడా కన్పించలేదు.

మళ్ళీ నిరీక్షణ మొదలు.

అలాగే ఇంటికొచ్చింది. భరించలేని నిరాశ, నిస్పృహలు ఆమెని ఆవరించాయి. ఏదో తెలీని దిగులు, బాధ. ఎవ్వరితోనూ మాట్లాడబుద్ధికాలేదు. సరాసరి తన గదిలోకి వెళ్ళబోతుండగా ఫోన్ మోగింది.

అంతే! చేతిలో ఉన్న పుస్తకాల సంచిని ఓ మూలకి గిరాటువేసి ఒక్క ఉదుటున వెళ్లి ఫోన్ అందుకుంది.

"హల్లో" అంటుంటే ఆ స్వరంలో ఎంత దాచిపెట్టినా దాగని ఉద్వేగం కన్పిస్తోంది.

"విజేష్‌గారున్నారా!" అటునుంచి ఎవరో అడుగుతున్నారు.

ఆమెకు సమాధానం చెప్పబుద్ధికాలేదు. ఫోన్ ఠక్కుమని పెట్టేసి గదిలోకి వెళ్ళిపోయింది.

సుశీలకి తెలీదు తనను రెండు కళ్లు గమనిస్తున్నాయని.

ఆ రాత్రి భోజనాల దగ్గర అంతే.

పెరుగన్నంలో ఉప్పు బదులు నెయ్యి వేసుకుని తల్లితో చీవాట్లు తింది.

ఆ రాత్రంతా నిద్రపట్టక అటూఇటూ తిరుగుతూనే ఉంది.

మరుసటిరోజు అందరికన్నా ముందుగా నిద్రలేచి కాలేజీకి తయారైంది.

★ ★ ★

మర్నాడు ఉదయం కాలేజీకి వెళ్ళిందన్న మాటేగానీ లెక్చరర్ చెప్పిన పాఠాలు, స్నేహితుల కబుర్లు ఆమె బుర్రకి ఎక్కడంలేదు.

కాలేజీ వదిలాక పరుగులాంటి నడకతో బయటకు వచ్చింది.

అక్కడ...

ఎప్పుడూ వాళ్ళిద్దరూ కలుసుకునే స్థలంలో...

వారి కబుర్లన్నీ వింటూ తన చిరుగాలితో వారిని సేదతీరుస్తూ వారి ఊహలకు, ఆశలకు తన చిగురుటాకులతో తాళంవేసే చెట్టుని ఆనుకుని నిలబడ్డాడతను.

మనిషి ఎంతో సౌమ్యంగా ఉంటాడు.

ఒకసారి అతనితో మాట్లాడితే అతని స్నేహం విడిచిపెట్టాలన్పించదు.

అంతే! ఆమె ముఖం దేదీప్యమానంగా వెలిగిపోయింది.

అతన్ని చూడగానే ఆగిపోయింది.

సంతోషం, సంభ్రమం, ఆశ్చర్యం అన్నీ ఒక్కసారిగా ఆమెలో పెల్లుబికాయి.

"అహ్మద్! ఎప్పుడొచ్చావ్ ఊరినుంచి?" అతని చెయ్యి పట్టుకుని ఊపింది సుశీల.

చుట్టూ ఉన్న జనం ఆగి మరీ తమని చూస్తున్నారని తెలిసినా ఆమె వాళ్ళగురించి పట్టించుకోలేదు.

రెండురోజుల్లో ఊరునుంచి వస్తానన్న అహ్మద్ వారంరోజులకుగానీ రాకపోవ డంతో ఆమె అక్షులు గవాక్షాలు చేసుకుని మరీ ఎదురుచూసింది. మొత్తానికి ఆమె నిరీక్షణ ఫలించింది. ఈ వారంరోజులుగా తను పడిన వేదనంతా అతనిముందు ఉంచాలని, ఇంకెప్పుడూ తనను అలా వది లివెళ్ళద్దని చెప్పాలని, అలాగని అతన్నించి వాగ్దానం తీసుకోవాలని ఆమె ఎప్పుడో నిర్ణ యించుకుంది.

"సుశీలా..." మృదువుగా తన చెయ్యి విడి పించుకున్నాడు అహ్మద్.

"ఏంట్రా! ఇదంతా నామీద బెంగేనా... ఎలా చిక్కిపోయావో చూడు" అన్నాడు.

ఆ మాటకి సుశీల కనులు వర్షించే మేఘా లయ్యాయి.

అతనికి ఎంతో చెప్పాలని ఉంది.

ఆమెకి ఎన్నో ఎన్నెన్నో అడగాలని వుంది.

కానీ 'గుండె గొంతుకలో కొట్టాడుతోంది' అన్నట్టుగా వారి హృదయాలలో ఉప్పొంగిన ప్రేమ గొంతుకి అడ్డుపడడంతో మాట బయటకు రాలేనంటోంది. ఇద్దరిలో ఆ భావోద్వేగంలోంచి ముందుగా బయటప డింది సుశీల. "ఇప్పుడు చెప్పు అహ్మద్! మీ అమ్మగారికి ఎలావుంది?" అడిగింది ఆమె.

"ఆమాట నేను కనిపించగానే అడుగుతా వనుకున్నాను..."

"ఏమిటో తోచనే లేదు. అసలీ వారంరోజు లుగా నా మనసు నా దగ్గరుంటేగా" అని ఓసారి అతనివైపు చూసి ఏదో ట్రాన్స్‌లో ఉన్నట్టుగా చెప్పసాగింది "అవును. బస్టాప్‌లో నీకోసం చూస్తూ బస్ మిస్సయిపోయేదాన్ని. ఈ వారం రోజులు ప్రతి రోజూ ఫస్ట్అవర్ యాబ్సెంటే. మా కెమెస్ట్రీ లెక్చరర్ మొన్న క్లాసులో అందరి ముందూ 'అదేంటమ్మాయ్! బస్ వచ్చినా ఎక్కకుండా బస్‌స్టాప్‌లో అంత సుదీర్ఘంగా ఆలోచిస్తున్నావేంటీ?' అని అడి గారు. అది విని దివ్య ఎంత ఆటపట్టిం చిందో తెలుసా?"

ఆమె చెప్తున్న తీరుకి అతనికి నవ్వాగ లేదు. చాలాసేపు అలా నవ్వుతూనే ఉన్నాడు. అతను నవ్వుతుంటే కళ్ళు విశాలం చేసుకుని చూస్తోంది సుశీల. అతని నవ్వంటే ఆమెకు ఎంతో ఇష్టం.

"యూ సిల్లీ గాళ్. మరీ అంత ప్రేమైతే ఎలా?" ఆమె నెత్తిమీద చిన్నగా మొట్టాడు అహ్మద్.

సుశీల ప్రేమ అతన్ని ఉక్కిరిబిక్కిరి చేస్తోంది.

"ఇంతేనా? ఈ వారం రోజులూ నేనేం చేశానో చెప్తే అదో వెయ్యి పేజీల నవల అవుతుంది" బుంగమూతి పెట్టింది సుశీల.

అంతలో ఏదో గుర్తుకువచ్చినట్టు "ఇంతకీ నువ్వు ఎప్పుడొచ్చావ్?" అని అడిగిందామె.

"ఉదయం వచ్చాను" చెప్పాడతను.

"ఉదయమా?" విస్మయంగా అడిగింది సుశీల.

ఉదయమనగా వచ్చి తనను కలవడానికి రాలేదని ఆమె బాధ.

"అవును. కాలేజీనుంచి వస్తున్నాను" అన్నాడు అహ్మద్.

"చూశావా నేనెంత సెంటిమెంటల్ ఫూల్‌నో" నవ్విందామె. ఈసారి ఆ నవ్వులో విషాదం స్పష్టంగా కనిపించిందతనికి. "నీకోసం నేను ఎంత ఆరాటపడ్డానో తెలుసా? నువ్వు వస్తానన్న టైముకి రాకపో




యేసరికి నీకేం ప్రమాదం జరిగిందోనని ఆవేదన పడ్డాను. ఫలాన కారణం వల్ల రావడం లేదు అని కనీసం ఫోన్ చేసైనా చెప్తావేమోనని కాలేజినుంచి ఇంటికి వెళ్లింది మొదలు ఫోన్ పక్కనే కూచుని నీ ఫోన్‌కాల్ కోసం ఎదురు చూసేదాన్ని. కానీ నువ్వు... రాగానే నన్ను చూడాలని పరుగెత్తుకు రాకుండా కాలేజీకి వెళ్లి క్లాసులన్నీ ఎటెండయి తీరికగా వచ్చావు..." ఆమె స్వరం రుద్ధమైంది.

కన్నీళ్ళు దాచుకోవడం ఆమెవల్ల కాలేదు. తనని ఎవరైనా నిర్లక్ష్యం చేస్తే సుశీల భరించలేదు.

"ఈరోజునుంచి ఇంటర్నల్ ఎగ్జామ్స్ సుశీలా" నెమ్మదిగా చెప్పాడు అహ్మద్. ఆమె ఛర్రున ఏదో అనబోయి విరమించుకుంది.

"నాకు తెలుసు నువ్వేం అనుకుంటున్నావో... నాకన్నా ఇంటర్నల్ ఎగ్జామ్ నీకెక్కువన్నమాట అంటావు, అంతేగా. కానీ ఈరోజు పరీక్షలు లేకపోయినా నేను కాలేజీకి వెళ్ళి క్లాసులు ఎటెండయ్యాకే నిన్నొచ్చి కలిసేవాడిని. ఎందుకో తెలుసా? నాకు నా ప్రేమ ఎంత ముఖ్యమో నా కెరీర్ కూడా అంతే ముఖ్యం..." నిజాయితీగా అన్నాడు అహ్మద్.

సుశీల అతడివైపు అయోమయంగా చూసింది. అహ్మద్ ఆమెని చిన్నపిల్లలా ట్రీట్‌చేస్తాడు తప్ప అంత సీరియస్‌గా ఎప్పుడూ ఇంతకుముందు మాట్లాడలేదు. అందుకే అతను చెప్పేది ఆమెకి కొంచెం కన్‌ఫ్యూజింగ్‌గా అన్పించింది.

"సుశీలా! మన ప్రేమ సినిమాల్లోలానో, కథల్లోలానో ప్రారంభంకాలేదు. అది నీకు తెలుసు. నేను నీ వెంటపడలేదు. నీకు ప్రేమలేఖలు రాయలేదు"

అవునన్నట్టు తలాడించింది సుశీల. అతని సిన్సియర్ ప్రేమ గురించి సుశీలకి బాగా తెలుసు.

"నిన్ను నా జీవిత భాగస్వామిని చేసుకోవాలన్న ఆలోచన రాగానే నీతో పదినిముషాలు మాట్లాడాలి, కుదుర్తుందా అని అడిగి పర్మిషన్ తీసుకున్నాను. నా గురించి ఏదీ దాచకుండా నీకు చెప్పాను. నా అభిప్రాయం ఏమిటో చెప్పాను. నీకు కావాల్సినంత సమయం తీసుకుని బాగా ఆలోచించాకే సమాధానం చెప్పమన్నాను. ఎందుకో తెలుసా. నేను జీవితాన్ని ప్రాక్టికల్‌గా తీసుకుంటాను"

ఒక్క క్షణం ఊపిరి పీల్చుకోడానికి ఆగాడు అహ్మద్.

సుశీల విభ్రాంతిగా అతనివంక చూస్తుండిపోయింది.

"ఈ ప్రపంచానికి కావాల్సింది ప్రేమకాదు సుశీలా! సక్సెస్... రేపు మీ ఇంటికి వచ్చి 'నేను మీ అమ్మాయిని ప్రేమించాను. పెళ్ళి చేసుకుందామనుకుంటున్నాను మమ్మల్ని ఆశీర్వదించండి' అంటే మీ నాన్నగారు అడిగే మొట్టమొదటి ప్రశ్న ఏమిటో తెలుసా? 'నువ్వేం చేస్తున్నావ్?' ఆ తర్వాత 'నీ ఫ్యామిలీ బ్యాక్‌గ్రౌండ్ ఏమిటి?' అని అడుగుతారు. అంతేగానీ మా అమ్మాయిని నువ్వెంతగా ప్రేమిస్తున్నావో నేను తెలుసుకోవాలి అని మాత్రం అనరు. వాళ్ళకి కావాల్సింది నేను వాళ్ళమ్మాయిని సుఖపెట్టగలనా లేదా? మళ్ళీ ఇక్కడ సుఖమంటే ప్రేమగా చూసుకోవడంకాదు. డబ్బు, బ్యాంక్ బాలెన్స్‌లాంటి మెటీరియలిస్టిక్ సుఖాలు. నిజానికి వాళ్ళు అలా అనుకోవడంలో తప్పు కూడా ఏమీలేదు. ప్రపంచంలో అనుబంధాలన్నీ ఆర్థిక నిర్మితాలేనన్నది వారి అనుభవం నేర్పిన పాఠం మరి. ఇదంతా ఎందుకు చెప్తున్నానంటే మీ పెద్దవాళ్ళని వచ్చి అడిగేముందు నా కాళ్ళమీద నేను నిలబడాలి. వాళ్ళ అమ్మాయికి ఎలాంటి ఇబ్బందీ కలగకుండా చూసుకుంటాడన్న నమ్మకం వారికి కలిగించాలి"

సుశీల తలెత్తి సూటిగా అతడి కళ్ళలోకి చూసింది. ఇంతకుముందున్న అయోమయం, ఆశ్చర్యం ఇప్పుడామెలో లేవు. అతన్ని చూస్తుంటే ఏదో అద్భుతాన్ని



చూస్తున్నట్టుగా ఉందామెకి. ఏ విషయం అయినా ఎంతో విశ్లేషణాత్మకంగాను, ఎదుటివారి మనసుకి నొప్పి కలగకుండాను మాట్లాడతాడు.

"సుశీ! ప్రేమించుకుంటున్నంత మాత్రాన అనుక్షణం ఒకళ్ళనొకళ్ళు తలుచుకుంటూ కెరీర్ పాడుచేసుకోనక్కరలేదు. మన ప్రేమ మనం సాధించే సక్సెస్‌కి స్ఫూర్తి కావాలి. కాబట్టి ఇకనుంచి నీకోసం వేచిచూస్తూ, నిన్ను గురించి ఆలోచిస్తూ క్లాసులు మిస్ అయ్యాను అని చెప్పేకన్నా నిన్ను గుర్తు చేసుకుంటూ రేపటి మన భవిష్యత్‌కోసం మరింత శ్రద్ధగా చదువుతున్నాను అని చెప్తే నేను సంతోషిస్తాను" అని చిన్నగా నవ్వాడు అహ్మద్.

సుశీల పెదవులమీద కూడా చిరునవ్వు నాట్యం చేసింది.

మరో విషయం అన్నాడు అహ్మద్. "మన ప్రేమ విషయం నేను ఇంట్లో చెప్పేశాను. అమ్మ అంగీకరించింది కూడా"

"మన ప్రేమ సంగతి చెప్పావా? " ఉలిక్కిపడిందామె.

"అవును..."

"మీ అమ్మగారు ఏమీ అనలేదా? " అంది సుశీల.

"అనకుండా ఎలా ఉంటారు? "

"ఏమన్నారు? "

"ఏ తల్లితండ్రులైనా పిల్లలకి 'పెళ్ళిచేయడం వారి బాధ్యత అనుకుంటారు. కాదు నేను ఆల్రెడీ ఓ అమ్మాయిని ప్రేమించాను అని చెప్తే ఏ తల్లి అయినా షాకవుతుంది. కానీ ఒప్పించాను"

'ఒప్పించాను' అన్న మాటకి హాయిగా తేలిగ్గా ఊపిరి పీల్చుకుంది.

"ఏం చెప్పావు? " ఈసారి సుశీల కంఠంలో ఆసక్తి తొంగిచూసింది.

"నీ గురించి, మీ ఇంటిగురించీ, మీరు పాటించే సర్వమత సమానత్వం గురించీ చెప్పాను. అది విన్నాక అమ్మ నన్నింకేమీ అడగలేదు. తన అంగీకారం తెలియచేసిందంతే..." అన్నాడు అహ్మద్.

ఈ సమస్య ఇంత సింపుల్‌గా పరిష్కారం అవుతుందని, తల్లి అంత తేలికగా ఒప్పుకుంటుందని అతను కూడా అనుకోలేదు.

"మరి మా ఇంట్లో ఏమంటారో? " ఒక్కసారి చెప్పలేనంత నీరసం వచ్చింది సుశీలకి.

ఆ ప్రశ్నకి అతని దగ్గర సమాధానంలేదు.

ఎందుకంటే అన్ని మతాలు సమానమేనని అనుకోవడానికి, నమ్మడానికి, ఆచరించడానికి మధ్య చాలా తేడా ఉందని అహ్మాద్‌కు తెలుసు.



వారంరోజులు గడిచినా నీరవ్‌షానుంచి ఎలాంటి ఎటాక్ రాకపోవడం విజేష్‌కి చాలా ఆశ్చర్యం కలిగించింది. బహుశా ఇంత చిన్న విషయానికి తనతో గొడవ పెట్టుకోవడం ఎందుకని ఊరుకునుంటాడని అనుకున్నాడు.

నిజానికి జరిగిందేంటంటే అసలీ విషయాలేవీ షాకి తెలీదు.

వసంత్ ఓ స్థలాన్ని రాంభాయ్‌కి అమ్మకం పెట్టాడన్న సంగతిగానీ, ఆ తర్వాత జరిగిన

సంఘటనగానీ షాకి తెలియవు.

వసంత్ కూడా నీరవ్‌షాకి ఈ సంగతులేవీ చెప్పకుండానే అవసరార్థం అతని పేరు వాడుకున్నాడు.

రాంభాయ్ దగ్గర ముందు కొంత అడ్వాన్స్ తీసుకున్నాడు. ఆ తర్వాత మరో పార్టీ అంతకన్నా ఎక్కువరేటు పెట్టడానికి వచ్చింది. అసలే డబ్బు కక్కుర్తి మనిషి కనుక రాంభాయ్ దగ్గర ప్లేటు ఫిరాయించేశాడు. విజేష్‌కి, నీరవ్‌షాకి మధ్య పచ్చగడ్డి వేస్తే భగ్గుమంటుందని వసంత్‌కి తెలుసు కాబట్టి ఆపద్ధర్మంగా షాని రంగంలోకి దించేశాడు.

ఆ 'వచ్చినవాళ్ళని 'షా' పంపాడని, ఇప్పుడాస్థలం వాళ్ళకి ఇవ్వకపోతే 'షా' తనని బతకనీయడని విజేష్ కాళ్ళమీద పడి మరీ మొత్తుకున్నాడు. అయినా పథకం పారకపోవడంతో అగ్రిమెంట్ మీద సంతకం చేయక తప్పలేదతనికి. పోనీ జరిగినదంతా షాకి చెప్దామా అంటే షా తననే తిడతాడని వసంత్‌కి తెలుసు.

ఎందుకంటే నీరవ్‌షా ఒకసారి వాగ్దానం చేస్తే ప్రాణం పోయినా మాట తప్పడు. తప్పినవాళ్ళని క్షమించడు. ఇది ఒక కారణం అయితే తన అనుమతి లేకుండా తన పేరు వాడుకున్నందుకు కూడా చివాట్లేస్తాడు. ఈ రెండు కారణాలవలన వసంత్‌కుమార్ తేలు కుట్టిన దొంగలా అయిపోయాడు.

అయితే వసంత్‌కుమార్ తనకు జరిగిన అవమానం మాత్రం మర్చిపోలేదు. ముఖ్యంగా తన అడ్డాలోకి వచ్చి తనవాళ్ళ ముందు తనను కొట్టి విజేష్ తనను బలవంతంగా తీసుకువెళ్ళి అగ్రిమెంట్ మీద సంతకం పెట్టించిన సంగతి వసంత్‌కుమార్‌ని నిద్రలో కూడా వెంటాడుతూనే ఉంది. అందుకే తర్వాతర్వాత జరిగిన అనేక పరిణామాలకు అతనే కారకుడయ్యాడు.

★ ★ ★

సుశీల మనసు విహంగంలా ఎగిరిపోతోంది.

అహ్మద్ ఊరినుంచి వచ్చేశాడు.

అది ఒక కారణం అయితే అహ్మద్ తల్లి తమ పెళ్ళికి ఒప్పుకోవడం మరొక కారణం.

ఆమెకి మొదటినుంచీ అహ్మద్ తల్లి ఏదైనా అభ్యంతరం చెప్తుందేమోనని భయంగా ఉండేది. ఎందుకంటే తనవైపు ఎటువంటి అభ్యంతరాలు వ్యక్తం కావని ఆమె నమ్మకం. తన కొడుకు ఒక హిందువుని పెళ్ళి చేసుకోడానికి అహ్మద్ తల్లి అంగీకరిస్తుందో లేదోనని సుశీలకి కొంచెం భయంగా ఉండేది. ఇప్పుడది తీరిపోయింది.

సుశీల ఇంట్లో సర్వమానవ సమానత్వం పాటిస్తారు.

ఉదయంవేళ అటు సుప్రభాతం, ఇటు బైబిల్, ఖురాన్ కూడా చదువుతారు. కాబట్టి తను ఓ ముస్లిం కుర్రాడిని పెళ్ళి చేసుకుంటే ఇంట్లో అభ్యంతరం చెప్పరని సుశీల అభిప్రాయం.

కానీ ఈ విషయం ఇంట్లో ముందుగా ఎవరితో చెప్పాలన్నదే ప్రధాన సమస్య.

తల్లికి చెప్తే... ఊహూ... ఆవిడకి ఈ ప్రేమలపట్ల నమ్మకంలేదు.

తండ్రికి చెప్తే... ఊహూ... వద్దు. అసలు ఈమధ్య ఆయన తనతో సరిగా మాట్లాడటమే లేదు. చాలా టెన్షన్‌తో ఉన్నట్లున్నారు. ఆయన దగ్గరకు వెళ్ళి విషయం చెప్పే ధైర్యం తనకులేదు.

ఇక ఇంట్లో ఎవరు మిగిలారు?

తమ్ముడు చిన్నవాడు.

తాతయ్య దగ్గర తను ఈ విషయం ప్రస్తావించలేదు.

మిగిలింది నానమ్మ...

అంతే సుశీల పెదవులమీద రిలీఫ్‌తో కూడిన చిరునవ్వు కదలాడింది.

ఎస్... నానమ్మకే చెప్పాలి. ఆవిడైతేనే తన మనసుని సరిగ్గా అర్థం చేసుకుంటుంది. అంతేకాదు తను చెప్పిన సంగతులు పదిలంగా హృదయంలో దాచుకుని మంచి సమయం చూసి తండ్రికి చెప్తుంది.

అవును ఈ విషయం వెంటనే నానమ్మకి చెప్పేయాలి. అందుకు ఇదే తగిన సమయం కూడా. ఇంట్లో తను, నానమ్మ మినహా ఎవ్వరూలేరు.

నానమ్మకి తన ప్రేమ సంగతి చెప్పేయాలన్న నిర్ణయానికి వచ్చాక సుశీల ఎంతో రిలీఫ్‌గా ఫీలయ్యింది.

సుశీల పడుతున్న ఇబ్బందిని ఓ రెండు కళ్ళు గమనిస్తూనే ఉన్నాయి.

ఆ రెండుకళ్ళూ ఎవరివో కాదు శారదమ్మగారివి.

మనవరాలు పెదవివిప్పి ఏమీ చెప్పకుండానే శారదమ్మగారికి విషయం అంతా అర్థం అయ్యింది.

సుశీల ఓ నిర్ణయానికి వచ్చినదానిలా నానమ్మ గదివైపుకి నడిచింది.

సరిగ్గా అప్పుడే ఫోన్‌మోగింది.

సుశీల ఆలోచనలో పడింది.

ఇప్పుడేం చేయాలి?

ఇంట్లో అమ్మ, నాన్న, తాతయ్య, తమ్ముడు ఎవ్వరూలేరు. నానమ్మతో తన మనసులో మాట చెప్పడానికి ఇదే తగిన సమయం.

కానీ ఫోన్...?

సుశీలకి ఏం చేయాలో అర్థంకాలేదు.

ముందుకి అడుగు వెయ్యబోయింది.

కానీ ఫోన్ మోగుతూనేవుంది.

ఫోన్ లిఫ్ట్ చెయ్యకుండా వెళ్ళిపోదామా అనుకుంది ఒక్కక్షణం. కానీ వెనక్కి వచ్చి ఫోన్ ఎత్తక తప్పలేదు.

"హల్లో..." విసుగంతా గొంతులోకి తెచ్చి అంది సుశీల.

"హల్లో... ఎవరు మాట్లాడేది? సుశీలా..." అటునుంచి అడిగారు.

"అవును..."

"సుశీ! నేనమ్మా... అత్తయ్యను..."

సుశీలకి ఒక్కసారిగా భరించలేనంత నీరసం వచ్చింది. అటునుంచి ఆవిడ అడుగుతున్న ప్రశ్నలకు 'ఆ... ఊ, అవును, కాదు' అంటూ ముక్తసరిగా సమాధానాలు ఇచ్చి వెళ్ళి నానమ్మను పిల్చుకొచ్చింది.

సుశీల అత్తయ్య మధుజైన్ అమెరికాలో ఉంటోంది. ఇప్పుడు ఫోన్ చేసింది ఆవిడే.

నానమ్మ త్వరగా మాట్లాడి వచ్చేస్తే బాగుండుననుకుంటూ సుశీల ఎదురుచూడడం మొదలుపెట్టింది. కానీ ఆ ఫోన్ ప్రహసనం అంత త్వరగా ముగిసేది కాదని ఆమెకి తెలుసు.

అంతలో విజేష్ వచ్చాడు.

చెల్లెలి దగ్గరినుంచి ఫోన్ అనేసరికి తల్లి చేతుల్లోంచి ఫోన్ లాక్కున్నాడు. ఆలోగా గుడికని వెళ్ళిన సుశీల తల్లి, తమ్ముడు, మరి కాసేపటికి తాతయ్య కూడా వచ్చారు. ఒక్కొక్కరూ కనీసం అయిదు నిమిషాల సేపు మాట్లాడారు.

సుశీల ఉసూరుమంటూ తన గదిలోకి వెళ్ళిపోయింది. చక్కటి అవకాశం అత్తయ్య ఫోన్ మూలంగా తప్పిపోవడం ఆమెకి బాధగా అన్పించింది.

హాల్లో అంతా కూర్చుని 'అమెరికా ఫోన్' గురించి చర్చించుకుంటున్నా వాటితో తనకేం సంబంధం లేదన్నట్టు తనగది తలుపులు వేసేసుకుంది సుశీల.

మిగతావాళ్ళంతా ఈ విషయానికి పెద్దగా ప్రాముఖ్యత ఇవ్వలేదుకానీ మనవరాలు పడుతున్న సంఘర్షణను శారదమ్మగారు మాత్రం గమనిస్తూనే ఉన్నారు.

★ ★ ★

"నమస్కారం... నా పేరు విజేష్..." తననుతాను పరిచయం చేసుకున్నాడతను.

"కూర్చోండి" అని "మీరు నన్ను కలవాలనుకున్నారట" డైరక్టుగా అసలు విషయంలోకి వచ్చేసింది రతీబెన్ గోవిందా.

"అవును" అన్నాడు విజేష్.

నిజానికి అతనలా సైట్ ఓనర్ల ఇళ్ళకి వెళ్ళి ఎప్పుడూ మాట్లాడడు కానీ ఈ స్థలానికి ఉన్న ప్రాధాన్యత వేరు. అదీగాక ఈమధ్య నీరవ్‌షాతో పోటీ ఎక్కువైన రీత్యా ఈ స్థలాన్ని ఎలాగైనా సొంతం చేసుకోవా





లన్న పట్టుదల పెరిగింది విజేష్‌లో.

రతీబెన్ గోవిందా స్థలం అమ్ముతుందన్న సంగతి తెలియగానే విజేష్ తమ తరపున వర్ధన్‌ను మాట్లాడిరమ్మని పంపాడు. వర్ధన్ వెళ్ళి అన్నీ విజేష్ చెప్పినట్టే చెప్పాడు. రతీ బెన్ గోవిందాకు విజేష్ ఆఫర్ చేసిన ఎమౌంట్ నచ్చడంతో ఆవిడ కూడా వెంటనే అంగీకరించింది. హఠాత్తుగా ఏమైందో తెలీదుగానీ మాటమార్చేసింది. దీనివెనుక షా హస్తం ఉందని విజేష్ అనుమానం.

"చెప్పండి విషయం ఏమిటి? " సూటిగా అడిగిందావిడ.

"సైట్ గురించి"

విజేష్ మాట పూర్తి కాకుండానే "క్షమించండి. ఆ సైట్ అమ్మకమైపోయింది" అంది ముక్తసరిగా.

మీరు ఆ విషయం మాట్లాడడానికే వచ్చుంటే ఇక మీరు వెళ్ళచ్చు అన్నట్టు చూసిందావిడ. విజేష్‌కి ఇంతవరకూ ఎప్పుడూ ఇలాంటి పరిస్థితి ఎదురుకాలేదు. ఎదుటివ్యక్తి మాటకారి అయితే తన లాజిక్‌తో వాళ్ళని ఊపిరి పీల్చుకోకుండా చేస్తాడు. అదే మంచి శ్రోత అయితే తన మాటలతో బోల్తా కొట్టిస్తాడు. కానీ రతీబెన్ అటు మంచి వక్త కాదు. ఇటు మంచి శ్రోతా కాదు. అదే అసలు సమస్య.

అప్పుడు కల్పించుకున్నాడు వర్ధన్.

"మేడమ్... నేను మీ దగ్గరికి వచ్చి స్థలం గురించి మాట్లాడినప్పుడు

మీరు తప్పకుండా సైట్ మాకే ఇస్తానని చెప్పారు. ఇప్పుడిలా..."

"అవును! అన్నాను. నేను మీకేమీ అగ్రిమెంట్ రాయలేదుకదా! అప్పుడలా అన్నాను, ఇప్పుడిలా అంటున్నాను. నా స్థలం నా ఇష్టం వచ్చిన వారికి ఇచ్చుకునే అధికారం నాకు లేదంటారా? ఈ విషయంలో ఎవ్వరికీ సంజాయిషీ ఇవ్వాల్సిన అవసరం నాకు లేదు" రతీబెన్ ముఖం కోపంతో ఎర్రబడింది.

"కానీ వాళ్లు ఆఫర్ చేసిన ధరకన్నా మేము ఇస్తామన్నది చాలా ఎక్కువ" సర్ది చెప్పబోయాడు విజేష్.

"చూడండి... నేను నా నిర్ణయం ఏమిటో మీకు ఇంతకుముందే చెప్పాను. మరెంతసేపు కూర్చున్నా, ఎన్ని రకాలుగా ప్రయత్నించినా నా నిర్ణయంలో మాత్రం ఎలాంటి మార్పూ ఉండదు. మీరు కేవలం ఆ సైట్ గురించే మాట్లాడదల్చుకుంటే మాత్రం ఇక మీరు వెళ్లచ్చు" సోఫాలోంచి లేచి నిలబడి నమస్కారం చేసిందావిడ.

"ఓకే మేడమ్! మీ టైం వృధా చేసుంటే క్షమించండి" జేబులోంచి తన విజిటింగ్ కార్డు తీసి టీపాయ్‌మీద పెట్టాడు విజేష్. "ఒకవేళ మీ మనసు మారితే మాత్రం నాకు ఫోన్ చేయండి"

రతీబెన్ కనీసం ఆ కార్డు వంక కూడా చూడలేదు.

రెండు రోజుల తర్వాత ఆ కార్డుతోనే తనకు అవసరం వస్తుందని రతీబెన్ అనుకోలేదు.

★ ★ ★

ఆఫీసులో అడుగుపెట్టగానే ఫ్రిజ్ దగ్గరకు నడిచి ఒక బాటిల్ తీసుకుని నీళ్లు మొత్తం తాగేశాడు విజేష్.

ఆఫీసు బాయ్‌ని కాఫీలు తెమ్మని పంపాడు.

"ఇప్పుడేం చేద్దామన్నా" అడిగాడు వర్ధన్.

"ఏంటన్నా! ఆవిడ ఉత్త తిక్క మనిషిలా ఉందే. మనం ఎంతగా నచ్చచెప్పినా ఆవిడ విన్పించుకోనేలేదు. అవతల పార్టీ మీకిచ్చే ఎమౌంట్ చాలా తక్కువ. మీరు ఈ డీల్‌లో నష్టపోతారు అని చెప్పినా అర్థం చేసుకోదేం? " ఎప్పుడూ లేనిది రాంభాయ్ కూడా విసుక్కున్నాడు.

విజేష్ చిన్నగా నవ్వాడు.

ఆ నవ్వు చూసేసరికి వర్ధన్ కోపం ఎక్కువైంది.

"బాగుందన్నా! మేమేమో ఇక్కడ టెన్ష

# ఏరిన ముత్యాలు

* నింద పడని వాడు లోకంలో ఎవడూ లేడు.

-గౌతమబుద్ధుడు

* పరమాత్మను తెలుసుకోవడం, ఆయనను సేవించుకోవడం... ఇంతకు మించిన జ్ఞానం వేరే లేదు.

-గురునానక్

* కష్టాలని చాలామంది ఎదుర్కోగలరు, కానీ ద్వేషాన్ని చాలామంది తట్టుకోలేరు.

-ఫుల్లర్

* సాధ్యమయిన దానికంటే ఎక్కువ మంచిగా ఉండాలనుకోవడం పెద్దపొరపాటు.

-వాల్టర్ వేగ్‌హట్

* బుద్ధి ఉన్నవాడెవడూ క్షురకుడినీ, బిచ్చగాడినీ, నటుడినీ సలహా అడగడు.

-పంచతంత్రం

* ఇతరులందరూ వివేకం కోల్పోయినప్పుడు నువ్వు వివేకం ప్రదర్శిస్తే నువ్వే ఆ గుంపంతటికీ నాయకుడివి.

-కౌటిల్యుడు

* తమ తెలివితేటల్లో సగం అప్పు పుట్టించడానికీ, తక్కిన సగం అది ఎగవేయడానికీ కొందరు ఉపయోగిస్తారు.

-జార్జ్ డి.ప్రెంటిస్

* వివాదం ఎంతకీ తెగలేదంటే అర్థం తప్పు రెండు వైపులా ఉందని.

-వోల్టేర్

* చిన్న గాయాన్నీ, పేద బంధువునూ, అణిగి ఉన్న శత్రువునూ ఎన్నడూ అశ్రద్ధ చేయకు.

-మహాభారతం

* పవిత్రమైన వాటిని కుక్కలకు వేయకండి, ముత్యాలను పందుల ముందు జల్లకండి.

-సోమర్‌సెట్ మామ్

* భయం లేకుండా దుస్సాహసం చెయ్యడం కాదు ధైర్యం, ధర్మం కోసం దృఢంగా నిలబడడమే ధైర్యం.

-లాంగ్‌ఫెలో

* డబ్బు కోల్పోవడం నష్టమే, మిత్రుని కోల్పోవడం ఇంకా నష్టం. ధైర్యాన్ని కోల్పోవడం అన్నిటినీ మించిన నష్టం.

-శామ్యూల్ జాన్సన్

* విశ్వాసం దారిని పూలబాట చేస్తుంది, దుఃఖాన్ని సుఖంగా మారుస్తుంది, శత్రువుని మిత్రుడ్ని చేస్తుంది. విశ్వాసం కదిలే దైవం.

-ఎఫ్.ఎల్ హమ్స్

సేకరణ: వి.వి.రమణకుమార్

న్‌తో చస్తున్నాం. నువ్వేమో ఏమీ పట్టన ట్టుగా చిరునవ్వులు చిందిస్తున్నావ్"

విజేష్ వర్ధన్ భుజం మీద చెయ్యి వేసి, నొక్కాడు. "రిలాక్స్ భయ్యా! ఆ సైట్ కచ్చి తంగా మనదే. ఈ రోజు కాకపోతే రేపు లేదా మరో రెండు రోజులకైనా రతీబెన్ గోవిందా మనకు స్వయంగా ఫోన్ చేసి స్థలం మీకే అమ్మ దలచాను, అగ్రిమెంట్ చేసుకుందాం అని చెప్తుంది. మీరు అనవస రంగా ఆందోళన చెందకుండా ఏం జరుగు తుందో నిశ్శబ్దంగా గమనించండి"

"ఎలాగన్నా" రాంభాయ్, వర్ధన్ ఇద్దరూ ఒకేసారి అడిగారు.

విజేష్ వెంటనే సమాధానం చెప్పలేదు. నిజానికి ఈ ప్రశ్నకు అతని దగ్గర సమా ధానం లేదు. అతనికెందుకో బలంగా అన్పి స్తోంది. తప్పకుండా సైట్ తనదే అవుతుం దని అన్పించసాగింది. ఆ మాటే వాళ్లతో అన్నాడు తప్ప ఎలా అంటే నిజంగానే ఈ ప్రశ్నకు అతను సమాధానం చెప్పలేడు.

"చెప్పన్నా! ఏ ధీమాతో నువ్వు అలా అంటున్నావు?" అడిగాడు రాంభాయ్.

ఏదో ఒక సమాధానం చెప్పనిదే వాళ్లు తనను వదిలేలా లేరని విజేష్‌కి అర్థమైంది. అందుకే అన్నాడు "ఏమోరా! ఎలా అంటే కచ్చితంగా నేను చెప్పలేను. బట్ నిశ్చ యంగా నూటికి నూరు పాళ్లు ష్యూర్‌గా రతీ బెన్ గోవిందా స్థలం మనదే అవుతుంది. నాకు ఆ నమ్మకం ఉంది" అన్నాడు విజేష్.

"అసలు దీనికంతటికీ నేనే కారణం" తనలో తాను అనుకోబోయి ఆ మాట రాంభాయ్ పైకే అనేశాడు.

విజేష్, వర్ధన్‌లు ఆశ్చర్యంగా చూశారు.

"అవునన్నా! ఆరోజు నువ్వు చెప్పగానే నేను ఆవిడ దగ్గరకు వెళ్లుంటే ఈపాటికి అగ్రి మెంట్ రాసుకోవడం కూడా పూర్తైపోయేది"

రాంభాయ్ ముఖంలో దిగులుతోపాటు పశ్చాత్తాపం కూడా కన్పించింది. కూచున్న వాడు కాస్తా ఏదో నిర్ణయానికి వచ్చిన వాడిలా లేచాడు రాంభాయ్.

అతని తీరు చూసేసరికి విజేష్‌కి ఏదో అనుమానం వచ్చింది. ఇలాంటప్పుడు బయటికెళ్లి అతనేం చేస్తాడో విజేష్ ఊహించగలడు.

ఇంతకుముందు కూడా ఇలా జరిగింది. సైట్ ఇస్తానని మాట ఇచ్చి తీరా అగ్రి మెంట్ కోసం వెళ్లేసరికి వాళ్లు మాట మార్చే సేవాళ్లు. సారీ ఆ సైట్ అమ్మకమైపో యింది అనేవారు.

విజేష్ ఆ విషయాన్ని తేలికగానే తీసుకునే వాడు. వ్యాపారంలో ఇదంతా మామూలేనని సరిపెట్టుకునేవాడు. కానీ రాంభాయ్ మాత్రం ఊరుకునేవాడు కాదు. ఏమయ్యేవాడోగానీ రెండు మూడు రోజులపాటు మనిషి అయిపు వుండేవాడు కాదు. ఆ తర్వాత తిరిగొచ్చే వాడు. అతనొచ్చిన మర్నాడు మునుపు సైట్ అమ్మేశాం అన్న స్థలం తాలుకు ఓనర్లు విజే ష్‌కి ఫోన్ చేసి తమ అభిప్రాయం మార్చుకు న్నామని సైట్ ఇస్తామని చెప్పేవారు.

వాళ్లలా హఠాత్తుగా మనసెందుకు మార్చుకున్నారు అని అనుకునేవాడేగాని దీని వెనుకనున్నది రాంభాయ్ అన్న సంగతి చాలా రోజుల వరకు విజేష్‌కు తెలీదు. తర్వాత ఎప్పుడో తెలిసింది. వాళ్లను ఒప్పిం చడానికి రాంభాయ్ సామదానభేద దండోపా యాలన్నీ ఉపయోగించాడని.

నిజానికి విజేష్ ఏ పని చేసినా చేతికి మట్టి అంటకుండా చేస్తాడు. బుర్రకి పని కల్పిస్తాడే తప్ప చేతలతో మాట్లాడడు.

కానీ నీరవ్‌షా అలా కాదు. కాబట్టే అత న్నంతా గూండాబిల్డర్ అని పిలుస్తుంటారు. ఆవిధంగా గూండాగర్దీ జోలికి పోకుండా విజేష్ ఇన్నాళ్లుగా క్లీన్‌చిట్ ఇమేజ్‌తో వ్యాపారం సాగిస్తున్నాడు. అలాంటిది రాంభాయ్ తొందరపాటువల్ల ఇంతవరకు ఉన్న ఇమేజ్ దెబ్బతింటుందని విజేష్ అత నికి కళ్లెం వేస్తున్నాడీ మధ్య.

"చిన్న పనుందన్నా ఇప్పుడే వచ్చేస్తాను"

నసిగాడు రాంభాయ్.

"ఆ పనేదో తర్వాత చూసుకోవచ్చులేగానీ ముందీ విషయం తేల్చు. ఇంతకీ ఈ రతీ బెన్ గోవిందాని ఏం చేద్దామంటావ్?" అడిగాడు విజేష్.

రాంభాయ్‌లో ఒక్కసారిగా ఆవేశం తన్నుకొచ్చింది. "గదేంటో మనకి తెల్వదన్నా. అయినా ఒకే తప్పుకి శిక్షలు కూడా ఒకే రకంగా ఉండాలిగాని నువ్వేంటి మనిషిని బట్టి శిక్షలు మారుస్తున్నావ్?"

"ఏంట్రా! సరిగ్గా అర్థమయ్యేలా చెప్పు" అన్నాడు విజేష్.

"అదేనన్నా! మొన్న ఆ వసంత్‌గాడు నాకు స్థలం ఇవ్వనంటే మనమేం చేసినాం? బొక్కలిరగ గొడదామనుకోలే. ఆడు కూడా మనం ఆ మాటన్నాకే కదా మన దారికొచ్చాడు మరి ఈడకూడా గదే చేస్తే సరిపోదూ! దానికెందుకంత ఆలోచన?"

విజేష్ రాంభాయ్ ముఖంలోకి ఓసారి సూటిగా చూసి అన్నాడు "అదీ ఇదీ ఒకటేనా రాంభాయ్! తేడా ఏం లేదా?"

"ఏముందన్నా తేడా! ఇద్దరూ మాట తప్పింద్రుకదా!" పళ్లు బిగించాడు రాంభాయ్.

"మతిలేనట్టు మాట్లాడకు" కసురుకున్నాడు వర్ధన్.

"అవున్రా నాకు మతిలేదు. అసలు బుర్రే లేని వాడికి మతి ఎక్కడ్నించి వస్తుంది? అంత మతున్న వాడివి నువ్వేదైనా సలహా ఇవ్వరాదూ! అన్న నోరు తెరిచి అడిగాడు కదా" రాంభాయ్ ఉక్రోషం చూస్తుంటే విజేష్‌కి నవ్వొచ్చింది.

అతనితోపాటు వర్ధన్ కూడా శ్రుతి కలిపాడు.

"అది కాదన్నా ఆ విషయం వేరు ఇది వేరు"

"ఎట్లా వేరు?" తన భుజం మీద పడ్డ వర్ధన్ చెయ్యి విసురుగా తోసేశాడు రాంభాయ్.

"ఆ వసంత్ నీకు స్థలం ఇస్తానని కమిటయ్యి సగం అడ్వాన్స్ కూడా తీసుకున్నాక ప్లేటు ఫిరాయించాడు. మరి ఈవిడ అలా అన్లేదుకదా! మనం వెళ్లి మాట్లాడినప్పుడు చూస్తాను, ఆలోచిస్తాను అని అందేగాని సైట్ మీకు తప్పక ఇస్తానని మనకేమీ వాగ్దానం చెయ్యలేదు. మనం చెప్పిన టైంకి ఆవిడ దగ్గరకు వెళ్ల లేకపోయాం. తీరా మనం వెళ్లేసరికి ఆవిడ తన మనసు మార్చేసుకుంది. కాబట్టి ఇందులో తప్పేదైనా ఉంటే మనదేగానీ ఆవిడదికాదు. ఇంకా ఒక రకంగా ఆవిడ చాలా మంచావిడనే చెప్పాలి. ఎందుకంటే అవతలివాళ్లు ఇచ్చే ఎమౌంట్‌కన్నా మనం ఎక్కువ ఇస్తామని చెప్పినా ఆవిడ తన నిర్ణయం మార్చుకోకుండా వీళ్లకిచ్చిన మాటకే కట్టుబడి ఉంది"

వర్ధన్ చెప్పినదాంతో రాంభాయ్ కన్విన్స్ అయినట్టే కనబడ్డాడు.

దాదాపు అయిదు నిముషాలపాటు అక్కడ మౌనమే రాజ్యమేలింది. అంతలో ఫోన్ మోగింది.

రెండు రింగులకి కూడా విజేష్ ఫోన్ లిఫ్ట్ చెయ్యకపోయేసరికి వర్ధన్ తీసుకున్నాడు.

"అన్నా! వసంత్" అన్నాడు వర్ధన్ ఫోన్ అందిస్తూ.

అవతల వసంత్ ఏం మాట్లాడాడో తెలీదుగాని విజేష్ ముఖంలో ఆగ్రహం కొట్టొచ్చినట్టు కన్పించింది. దవడ కండరం బిగుసుకుంది. అతి కష్టంమీద కోపాన్ని కంట్రోలు చేసుకుంటున్నట్టుగా ఉన్నాడు.

చివర్లో మాత్రం "థాంక్స్ వసంత్ భాయ్" అన్నాడు విజేష్. "మొన్న నీ పట్ల కొంచెం దురుసుగా ప్రవర్తించినా అదేమీ మనసులో పెట్టుకోకుండా చాలా విలువైన సమాచారం అందించి మాకు మేలు చేశావు"

"..."

"అలాగే భయ్యా! నువ్వంతగా అడగాలా! ఈ రోజు నుంచి నువ్వు విజేష్ మనిషివి. ఆ షానే కాదు ఎవ్వరూ నిన్నేమీ చేయలేరు.





నీకెప్పుడు ఏం అవసరం వచ్చినా నేనున్నా నని గుర్తుంచుకో"

అని విజేష్ చెప్తుంటే రాంభాయ్‌కి ఎందుకో ఆ మాటలు రుచించలేదు. వసంత్ దగ్గరవడంవల్ల విజేష్ దగ్గర తన ప్రాముఖ్యమేదో తగ్గిపోతుందని అతనికేమీ బాధలేదు. కాని ఎందువల్లనో అతని మన సుకి ఆ విషయం నచ్చలేదు అంతే. ఎందు కంటే బహుశా రాంభాయ్ కూడా సరిగ్గా సమాధానం చెప్పలేకపోవచ్చు ఒక విషయం మాత్రం రాంభాయ్‌కి రూఢీగా తెలుసు. వసంత్‌లాంటి వ్యక్తులు మారరు. జరిగింది అంత త్వరగా మర్చిపోరు. అయితే తన మనసులో మాటని బయటపె ట్టలేకపోయాడతను.

ఫోన్ పెట్టేశాక విజేష్ ముఖంలో కోపం తగ్గింది.

"వర్ధన్! ఆ ఫోన్ తీసుకో" అన్నాడు.

వర్ధన్ విజేష్‌కి రాంబంటు లాంటివాడు. చెప్పింది గుడ్డిగా చేసుకుంటూ పోతాడు తప్ప ఎందుకు? ఏమిటి? ఎలా? లాంటి ప్రశ్నలు అడగడు.

వర్ధన్ ఫోన్ అందుకున్నాడు.

"రతీబెన్ గోవిందాకి ఫోన్ చేసి నేను చెప్పమన్నట్టు చెప్పు" అన్నాడు విజేష్.

రాంభాయ్ అసహనంగా కుర్చీలోంచి లేచి అటూఇటూ పచార్లు చేయసాగాడు. అతని మనసు ఏదో తెలీని ఆందోళనకు లోనైంది.

శత్రువుని అయినా నమ్మచ్చేమోగాని మిత్రుడిలా నటించే శత్రువుని అస్సలు నమ్మకూడదు.

వసంత్ రెండో కేటగిరికి చెందినవాడు.

షాని దెబ్బతీయాలన్న ఆలోచనతో విజేష్ ఆ విషయం తాత్కాలికంగా మర్చిపోయాడు. అందుకుగాను భవిష్యత్తులో అతను పెద్ద మూల్యమే చెల్లించాల్సి వచ్చింది.

★ ★ ★

సుశీల కాలేజీనుంచి ఇంటికి వచ్చేసరికి ఆమె అత్తయ్య వచ్చి ఉంది.

ఆవిడ అమెరికాలో ఉంటోంది. భర్త కొడుకు వచ్చినా రాకపోయినా సంవత్సరా నికో సారి ఆవిడ మాత్రం తప్పనిసరిగా వస్తుంటుంది. నెల రోజులుపాటు ఉండి వెడుతుంది. ఈసారి మాత్రం కుటుంబం అంతా వచ్చారు.

చెల్లెలంటే విజేష్‌కి పంచప్రాణాలు.

ఆమె ఉన్నన్ని రోజులు ఎక్కువసేపు ఇంట్లోనే గడుపుతాడు.

సుశీలకి అత్తయ్యరాక ఆనందం కల్గించినా ఆవిడ తన పెళ్లి మాట ఎక్కడ ఎత్తుతుందోనని భయపడసాగింది.

"బాగున్నావా అత్తయ్యా" అని పలకరించింది.

మధుజైన్ సుశీలని ఆప్యాయంగా దగ్గరకు తీసుకుంది.

బావ రాలేదా? అని అడుగుదామనుకుని మళ్లీ నాకెందుకు అతని గురించి అని ఆ ఆలోచన విరమించుకుంది.

సుశీల వాళ్ల అత్తయ్యతో మాట్లాడుతుండగా అక్కడికి రాజేశ్వరి వచ్చింది. తీరికగా కూర్చుని కూతురు కబుర్లు చెప్తుండేసరికి ఆవిడకి కోపం వచ్చింది.

"ఏమే! ఉదయం నువ్వు కాలేజీకి వెళ్లేప్పుడు ఏం చెప్పాను? "

"ఏం చెప్పావు? " అని ఒక్కక్షణం ఆలోచించి "ఏమోనమ్మా గుర్తు రావడం లేదు" అంది.

ఆ మాటకి ఆవిడ కోపం మరింత రాజుకుంది.

"ఈరోజు నిన్ను చూసుకోవడానికి పెళ్లి వారొస్తున్నారని కాలేజీ నుంచి తొందరగా రమ్మని చెప్పానా లేదా? "

"ఏమోనమ్మా!" విసుక్కుంది సుశీల.

పెళ్లివారు వస్తున్నారన్న మాట వింటుంటేనే ఆమెకి చాలా చిరాకుగా ఉంది. నాకీ పెళ్లిచూపులు వద్దు. నేను అహ్మద్‌ని తప్ప ఎవ్వర్నీ పెళ్లి చేసుకోను అని గట్టిగా అరిచి మరీ అందరికీ చెప్పాలన్పిస్తోంది. కానీ చెప్ప



లేని అశక్తత. అందుకే ఎలాగో అలా ఈ పెళ్లిచూపుల ప్రహసనాన్ని తప్పించుకోవాలన్న ఉద్దేశ్యంతోనే తల్లి వద్దని వారించినా వినకుండా కాలేజీకి బయలుదేరింది. కావాలనే ఆలస్యంగా వచ్చింది.

"ఈ విసుగుకేం తక్కువలేదు. వెళ్లి త్వరగా తయారవ్వు. వాళ్లొచ్చే వేళయ్యింది"

సుశీల ఆ మాటలు విననట్టుగా అలాగే కూర్చుండిపోయింది.

"చెప్తుంటే నీకు కాదూ! వెళ్లి తయారవ్వు. నువ్విలాగే వుంటే మీ నాన్నగారొచ్చి కేకలేస్తారు" అంది రాజేశ్వరి.

"లేమ్మా! అమ్మ చెప్పిన మాట విను" బుజ్జగింపుగా చెప్పింది మధుజైన్.

"ఉహు... నాకొద్దు అత్తయ్యా" నెమ్మదిగా గొణిగింది సుశీల.

రాజేశ్వరి చిరాకు పడింది. "ఏమిటొద్దు" అరిచినట్టే అడిగిందావిడ.

"నేను... నేను పెళ్లి చేసుకోను" తడబడినా తన మనసులో మాట ధైర్యంగా చెప్పేసింది సుశీల.

మేనకోడలికి మొండితనం ఎక్కువేనని గ్రహించింది మధుజైన్.

"ఏమ్మా! మేనకోడలా! పెళ్లి చేసుకోను అంటే ఏమిటి అర్థం? ఈ పెళ్లి వద్దనా! లేక అసలు పెళ్లే చేసుకోవా?" అని రాజేశ్వరి వైపు తిరిగి "ఏం వదినా! పెళ్లి వారికి చూపులకి రమ్మని కబురుపెట్టే ముందు సుశీల అభిప్రాయం ఏమిటో కనుక్కోలేదా?" అడిగింది మధుజైన్.

"ఏమోనమ్మా! మీ అన్నయ్య నాక్కూడా ఉదయమేగా చెప్పింది"

"అవునా!" బోలెడంత ఆశ్చర్యం నటించింది మధుజైన్. ఎందువల్లనో ఆమె పెదవులు చిరునవ్వుతో విచ్చుకోబోయి ఆగిపోయాయి.

"అవునమ్మా" అంటూ కూర్చుంది రాజేశ్వరి.




ఆవిడకు పాపం చిన్న వయసులోనే నడుంనొప్పి పట్టుకుంది. అందుకే ఎక్కువసేపు నిలబడలేదు.

"అదేంటొదినా"

"ఏమిటంటే ఏం చెప్పను తల్లీ! అక్కడికీ ఎవరబ్బాయి? ఏం చేస్తాడు? అని అడిగాను. 'చెప్తాను! సాయంత్రం వాళ్లు వస్తున్నారుకదా! అప్పుడు తెలుస్తుంది' అన్నారు. తీరా పెళ్లివారిని పిలిచాక ఇప్పుడు ఏం అడగను. అయినా సుశీలని ఈ పెళ్లి నీకు ఇష్టమేనా అని అడగడానికి నాకు వివరాలేమైనా తెలిస్తే కదా! నాకే తెలీనప్పుడు దానికేం చెప్పను? అందుకే పెళ్లివారు వస్తున్నారు. కాలేజీకి వెళ్లకు అని చెప్పాను. ఇదేమో విన్పించుకోకుండా ఇంపార్టెంట్ క్లాసులున్నాయి అంటూ బయల్దేరింది. త్వరగా రావాలన్న బుద్ధి ఉంటేగా! తొందరగా రమ్మంటే రోజూకన్నా ఆలస్యంగా వచ్చింది. సరే కాలేజీలో ఆలస్యం అయ్యింది. ఇంటికి వచ్చాక అయినా త్వరగా రెడీ అవుతుందా అంటే తీరికగా కూర్చుని కబుర్లు చెప్తోంది. వెళ్లి రెడీ అవ్వవే అంటే పెళ్లి చేసుకోను అని చెప్తోంది. ఈ విషయాలన్నీ చర్చించుకోవడానికి ఇదా సమయం! అయినా ఇప్పుడేమైందని? పెళ్లివారు వచ్చి చూసి వెడతారు అంతేగా! వాళ్లొచ్చి చూసి వెళ్లినంత మాత్రాన ముహూర్తాలు పెట్టించడం లేదుగా"

రాజేశ్వరికి భర్తమీద చాలా కోపం వచ్చింది.

నిన్నటివరకు ఆడపడుచు కొడుకే సుశీల మొగుడని మాట్లాడి ఆ పిల్ల మనసులో ఆశలు రేకెత్తించి, తీరా ఇప్పుడేమో వేరే వారిని పెళ్లి చూపులకి రమ్మని పిలవడం ఎంతవరకు సబబు? ఏదీ ఆ మాట అడుగుదామంటే పొద్దుననగా హడావిడిగా వెళ్లిన మనిషి ఇంతవరకు అయిపులేరు. మధ్యలో ఫోన్లు చేసినా చెల్లెలితోనే కబుర్లన్నీ.

"వెళ్లమ్మా! మా బంగారు తల్లివి కదూ! వెళ్లి రెడీ అవ్వు. పెళ్లికొడుకు నీకు నచ్చకపోతే ఈ సంబంధం వద్దని చెప్పేద్దాం. మీ

నాన్నగారికి నేను ఎలాగో అలా నచ్చచెప్తాను. ముందు నువ్వెళ్లి రెడీ అవ్వు" కూతుర్ని బతిమాలింది రాజేశ్వరి.

సుశీల సణుక్కుంటూనే లోపలికి వెళ్లింది.

కూతురి వెంట తను కూడా గదిలోకి వెళ్లి సుశీల కట్టుకోవాల్సిన చీర, వేసుకోవాల్సిన నగలు తీసిచ్చింది.

సుశీలకి పెళ్లిచూపులకి కూర్చోవడం ఎంత మాత్రం ఇష్టంలేదు. తను అహ్మద్‌ని ప్రేమిస్తోంది. అతన్నే పెళ్లి చేసుకోవాలనుకుంటోంది. తమ మనసులు కలిసిన రోజే తామిద్దరికీ వివాహం అయిపోయినట్టు లెక్క.

తల్లి రెండు మూడుసార్లు వచ్చి హెచ్చరించాక లేచి తయారైంది.

పెళ్లివారిని చూసి రాజేశ్వరి, శారదమ్మగారు ఆశ్చర్యపోయారు.

రాజేశ్వరికైతే పొద్దున్నుంచీ భర్తమీద ఉన్న కోపమంతా పెళ్లికొడుకును చూడగానే కరిగిపోయింది. ఆమెకైతే అప్పుడే వెళ్లి కూతురుకి ఈ విషయం చెప్పాలనుంది కానీ భర్త వారించడంతో ఆగిపోయింది.

సుశీలని తీసుకొచ్చి కూర్చోబెట్టారు.

"బేబీ! అలా తలవంచుకుని కూర్చుంటే కాదు. తలెత్తి చూడు. నచ్చకపోతే ఇప్పుడే చెప్పు" అన్నాడు విజేష్.

"అవునమ్మా! పెళ్లికొడుకు నీకు నచ్చకపోతే ఇప్పుడే పంపించేద్దాం" అంది మధుజైన్.

రాజేశ్వరి వస్తున్న నవ్వు ఆపుకోడానికి పైటకొంగు అడ్డుపెట్టుకుంది. సుశీలకి ఇదంతా ఏమీ అర్థంకాలేదు.

తను ఇష్టపడకపోతే ఈ పెళ్లి జరగదు అన్న మాటొక్కటే విన్పించింది. అందుకే నెమ్మదిగా తలెత్తిచూసింది.

అంతవరకు తన పక్కన ఉన్న అత్తయ్య ఎప్పుడు లేచి వెళ్లిందో గానీ ఇప్పుడు మాత్రం పెళ్లికొడుకు పక్కన కూర్చుంది.

మావయ్యకూడా మరో పక్కనున్నాడు.

సుశీలకంతా అయోమయంగా అన్పించింది.

"ఏమ్మా! మేనకోడలా! మా అబ్బాయి ఎలా ఉన్నాడు?" కొడుకుని దగ్గరకి తీసుకుంటూ అడిగింది మధుజైన్.

దాంతో సుశీలకి పూర్తిగా విషయం అర్థమైంది. అంటే తనని చూడటానికి వచ్చింది మేనత్త కొడుకేనన్నమాట.

మరొకరైతే అబ్బాయి నాకు నచ్చలేదని చెప్పి ఈ పెళ్లి ఎలాగోలా తప్పించుకోవాలనుకుంది. కానీ బావే అయ్యేసరికి ఆమెకేం చేయాలో అర్థం కావడంలేదు. దినేష్ అందగాడు. ఐశ్వర్యవంతుడు. అమెరికాలో పెద్ద ఉద్యోగం చేస్తున్నాడు. అన్నింటిని మించి చిన్ననాటినుంచి అనుకున్న సంబంధం. అదీగాక తండ్రికి చెల్లెలంటే పంచప్రాణాలు. అలాంటిది ఆమె కొడుకు కాకుండా మరొకరు ఈ ఇంటికి అల్లుడవుతాడంటే తండ్రి భరించడని కూడా సుశీలకి తెలుసు.

అమెరికాలో పుట్టి పెరిగిన దినేష్ అక్కడి అమ్మాయినే చేసుకుంటానంటాడేమోనని ఇన్నాళ్లుగా సుశీల ఎదురు చూస్తోంది. అది జరిగితే తను బావ నచ్చలేదని చెప్పనక్కర్లేదని ఆమె అభిప్రాయం. కానీ దినేష్ బుద్ధిగా తల్లి మాటకు కట్టుబడి సుశీలని చేసుకోవడానికి ఒప్పుకోవడం ఇప్పుడామెకి పెద్ద సమస్యగా తయారైంది.

వచ్చినవాళ్లు పరాయివాళ్లు కాదు కాబట్టి సుశీల లేచి లోపలికి వెళ్లబోతుంటే "అబ్బో! నీ కూతురికి ఎంత సిగ్గోరా అన్నయ్యా!" అన్న మధు మాటలు ఆ వెనకే కోరస్‌లాగా మిగతావారి నవ్వులు విన్పించాయి.

ఒక్క శారదమ్మగారికి మాత్రం మనవరాలు ఎందుకో బాధపడుతోందని అర్థమైంది.

ఆవిడ సుశీల గదిలోకి వెళ్లేసరికి ఆమె బట్టలు కూడా మార్చుకోకుండా మంచానికడ్డంగా పడుకుని దిండులో ముఖం దాచుకుని ఏడుస్తోంది.

శారదమ్మగారి భృకుటి ముడిపడింది.



చతుర... 31

నెమ్మదిగా తలుపు దగ్గరకి లాగి ఆవిడ కూడా హాల్లోకి నడిచారు.

★ ★ ★

ఆ రాత్రి భోజనాల దగ్గర కూడా అంతే...

అంతా సరదాగా, ఉత్సాహంగా కబుర్లు చెప్పుకుంటుంటే సుశీల మాత్రం

మౌనంగా నాలుగు ముద్దలు కెలికి తన గదిలోకి వెళ్ళిపోయింది.

దినేష్ మాట్లాడించినా ముక్తసరిగానే సమాధానం చెప్పింది తప్ప సంభాషణను పొడిగించలేదు.

అదంతా సిగ్గు, బిడియం అనుకుని సరిపెట్టుకుని పెళ్ళి ఎప్పుడు చేయాలి? ఎక్కడ, ఎలా చేయాలి? అనే చర్చలో మునిగిపోయారంతా...

సుశీలకి ఆ మాటలు వింటున్నకొద్దీ ఏడుపు తన్నుకొస్తోంది.

ఒకపక్క తన అసహాయత, మరోపక్క అహ్మద్‌తో తాను గడపబోయే జీవితం గుర్తుకొస్తోంది.

గదిలో కూర్చోలేక నెమ్మదిగా మేడమీదికి దారి తీసింది.

సుశీల పడుతున్న అవస్థను శారదమ్మగారు గమనిస్తూనే ఉన్నారు. మనవరాలితో పర్సనల్‌గా మాట్లాడేందుకు అంతకన్నా చక్కని అవకాశం దొరకదనిపించింది ఆవిడికి.

మనవరాలు వెళ్లిన కాసేపటికి తనుకూడా మేడమీదికి వెళ్లింది.

అక్కడ పిట్టగోడనానుకుని పరధ్యానంగా నిలబడ్డ మనవరాలిని చూసేసరికి ఆవిడ హృదయం కలుక్కుమంది.

తొలగిన పైట సర్దుకుంటుంటే శారదమ్మగారి చేతిగాజుల గలగలలకి సుశీల ఈ లోకంలోకి వచ్చింది.

"నానమ్మా... నువ్వు... ఇక్కడ... ఈ సమయంలో..."

ఆమెకేం మాట్లాడాలో అర్థంకాలేదు.

"సుశీలా! నువ్వు... ఇక్కడ.. ఈ సమయంలో..."

తనుకూడా మనవరాలిని అనుకరించింది.

ఇద్దరూ ఒకర్నొకరు ఓసారి సీరియస్‌గా చూసుకుని ఫక్కుమని నవ్వేశారు.

"ఏంట్రా! ఇలా ఒక్కత్తివీ ఉన్నావేం? నిద్ర రావడంలేదా?" అడిగారు శారదమ్మ.

"లేదు నానమ్మా" అంది సుశీల.

ఆమె గొంతులో ఎంత దాచినా దాగని ఆవేదన, బాధ వ్యక్తమయ్యాయి.

"ఏరా?" లాలనగా ఆమెని దగ్గరకు తీసుకున్నారు ఆవిడ.

ఆమాత్రం ఆత్మీయతకే సుశీల కరిగిపోయింది.

శారదమ్మగారిని బలంగా చుట్టేసి వెక్కిళ్ళు పెట్టింది.

ఆవిడ మనవరాలిని ఓదార్చే ప్రయత్నం చెయ్యలేదు. ఎందుకంటే ముందు ఆ గుండె భారం దిగితేగానీ మనసులో మాట బయటకు రాదని ఆవిడకు తెలుసు.

కాలం ఎంత మారినా స్త్రీల మనసులో ఎంతమాత్రం మార్పు రాకపోవడం ఆవిడకి చాలా ఆశ్చర్యంగా అనిపిస్తుంది.

ఆ రోజుల్లో తనూ అంతే.

అమ్మాయికి పెళ్ళివయసు వచ్చింది అని పెద్దవాళ్ళు అనుకున్నారు. వాళ్ళల్లో వాళ్ళే సంప్రదింపులు జరుపుకుని పెళ్ళిచూపులు ఏర్పాటు చేసేశారు. ఒక్కరు కూడా తన అభిప్రాయం కనుక్కోలేదు.

వచ్చిన పెళ్ళికొడుకును 'అమ్మాయి నచ్చిందా?' అని అడిగారేగానీ తనని మాత్రం ఎవరూ 'అబ్బాయినచ్చాడా?' అని అడగలేదు.

పెళ్ళిచూపులు దగ్గరినుంచి తన మనసులోమాట ఎలా చెప్పాలా అని మథనపడ్డ తను శుభలేఖలు అచ్చయి వచ్చేదాకా మీనమేషాలు లెక్కపెట్టింది. పెళ్ళి దగ్గరపడుతుండేసరికి ఇక ఆవేదన తట్టుకోలేక వెళ్ళి తల్లికి మాత్రం చెప్పింది. తల్లి తన బాధను అర్థం చేసుకుంటుందని, తండ్రికి నచ్చచెప్పి పెళ్ళి ఆపుచేయిస్తుందని తను అనుకుంది.





# చతుర సమీక్ష



ఈ శీర్షిక ద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్లీ చెప్పకుండా అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్ హైదరాబాద్-500 082 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

★ మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రూ. 100/- ప్రథమ బహుమతి, రూ. 75/- ద్వితీయ బహుమతి, రూ. 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.



**కూపన్**

.......... **డిసెంబర్ చతుర నవల ఆ రోజెప్పుడు?**

సమీక్షకుని పేరు: ..............................................

చిరునామా: ..............................................

..............................................

..............................................

..............................................

..............................................

కానీ అవేం జరగలేదు.

తల్లి తననే చివాట్లుపెట్టింది. ఇంతవరకు ఎందుకు చెప్పలేదంది! ఇప్పుడు ఈ విషయం పెళ్ళివారికి తెలిస్తే మన పరువేం కావాలంది! పరువుపోయాక బతికేకన్నా చావడం మంచిదంది. చివరకు తను ఈ పెళ్ళి చేసుకోకపోతే విషం మింగి చస్తానని బెదిరించింది.

అంతే తన నోరు మూతబడిపోయింది.

తన పెళ్ళికి తను తప్ప అంతా ఆనందం గానే ఉన్నారు.

ఈ చీర నచ్చిందా? ఆ నెక్లెస్ బావుందా? అని అడిగారేగానీ నూరేళ్ల కాపురం చేయాల్సిన భర్త గురించి తన అభిప్రాయం కనుక్కోవాలని ఎవ్వరికీ అన్పించలేదు.

ఈ దేశంలో అమ్మాయి మనసు గురించి ఎవ్వరికీ పట్టదు.

ఆనాడు అలా ఉందనుకుంటే నేడు కూడా పరిస్థితిలో ఎలాంటి మార్పులేదు. పరువు కోసం, ప్రతిష్ఠకోసం, తల్లితండ్రులు చస్తామంటే ఆ బెదిరింపులకు లొంగి అమ్మాయిలు తలవంచి తాళి కట్టించుకుంటున్నారు.

తన మనవరాలి విషయమైనా అంతే.

మేనత్త కొడుకు వరసైనవాడు కాబట్టి సరదాగా ఏడ్పించచ్చు కనీసం పెళ్ళి విషయానికి వచ్చినప్పుడైనా సుశీలని ఎవ్వరూ అడగలేదు. తన కొడుకు సుశీలకి అన్నింట్లో స్వేచ్ఛనిచ్చాడు. కానీ పెళ్ళి విషయానికి వచ్చేసరికి ఆమె మనసుతో పనిలేదనుకున్నాడు.

"సుశీ! ఊర్కోమ్మా! నేనున్నానుగా. చెప్పు... నీ బాధేంటో నాతో చెప్పు" ఆమె వెన్ను నిమురుతూ అంది శారదమ్మ.

"ఏంలేదు నానమ్మా! ఏంలేదు..." కళ్ళు తుడుచుకుంది సుశీల.

"ఏమీ లేకపోతే ఎందుకంతగా బాధపడ్తున్నావ్?"

సుశీల మౌనం వహించింది.

"సుశీ! ఒకప్పుడు నేను కూడా నీలాగే బాధపడినదాన్నేనమ్మా! ఇష్టంలేని పెళ్ళి చేసుకోవాల్సివస్తే ఆడపిల్ల మనసు ఎంత బాధపడ్తుందో నాకు తెలుసు"

సుశీల ఆశ్చర్యంగా చూసింది.

"ఆరోజు నన్నిలా ఓదార్చినవారుగానీ, ధైర్యం చెప్పినవారుగానీ ఎవ్వరూ లేరు. నాలో నేను మథనపడీ పడీ మా అమ్మకు అసలు విషయం చెప్పేసరికి పుణ్యకాలం కాస్తా గడిచిపోయింది. ఆ విషయం ముందే చెప్పచ్చుకదా! ఇన్నిరోజులు ఊర్కుని తీరా శుభలేఖలు కూడా అచ్చయ్యాక ఇప్పుడీ పెళ్ళి ఇష్టం లేదంటే మా పరువేం కావాలి అని మా అమ్మ తిట్టింది. నోరు మూసుకుని తాళి కట్టించుకోకపోతే చస్తానని బెదిరించింది. అయితే ఆ పెళ్ళి జరగలేదనుకో"

"నానమ్మా...!" విస్మయంగా అంది సుశీల.

"అవునమ్మా! అప్పటికీ ఇప్పటికీ పెళ్ళి విషయంలో ఆడపిల్ల అభిప్రాయంతో పనిలేదన్నట్టుగానే ఉంటున్నారు. మేమంటే అంతగా చదువుకోలేదు కాబట్టి ఇష్టంలేదని చెప్పలేకపోయాం. కానీ మీరు అలా కాదు కదా! చదువుకుంటున్నారు. అన్నింటా మగవాళ్లతో పోటీపడుతున్నారు. అలాంటి మీరు కూడా ఎందుకలా మౌనంగా రోదిస్తూ తలలు వంచి తాళికట్టించుకుంటున్నారో నాకు అర్థంకావడంలేదు" ఆవేశంగా అన్నారు శారదమ్మ.

"కానీ నానమ్మా! ఈ పెళ్ళి ఇష్టంలేదని నేను..."

"నువ్వు నోటితో చెప్పక్కర్లేదు. నీ ప్రవర్తన చూస్తుంటేనే అర్థమవుతోంది. అసలు ప్రేమలో గొప్పతనమే అది సుశీ! మనకన్నా ముందే మనం ప్రేమలో పడిన సంగతి మిగతావారికి తెలిసిపోతుంది. గత కొన్ని రోజులుగా నిన్ను గమనిస్తూనే ఉన్నాను. మునుపటి ఉత్సాహం, చలాకీతనం నీలో ఏకోశానా లేవు. ఎప్పుడు చూసినా ఏదో పోగొట్టుకున్నదానిలా ఉంటావు. గదిలోంచి బయటకు రావడం మానేశావు. వెడితే కాలే

జీకి వెళ్ళడం, లేదంటే నీ గదిలో తలుపులు బిడాయించుకుని కూర్చోవడం. పిలిస్తే వెంటనే పలకవు. ఊరికే ఉలిక్కిపడతావు. బావతో నీ పెళ్ళన్న మాట విన్నప్పుడల్లా ఒణికిపోతావు. ఈరోజు మీ అమ్మ 'పెళ్ళిచూపులకి వస్తున్నారు కాలేజీకి వెళ్లద్దు' అని చెప్తే కాలేజీ మానడం కుదరదన్నావేగానీ బావను తప్ప ఎవ్వర్నీ పెళ్ళిచేసుకోను' అని నువ్వన లేదు. ఇన్నాళ్లు బావే నాక్కాబోయే భర్త అని చెప్పి ఇప్పుడు ఇంకెవరినో పెళ్ళిచూపులకి రమ్మనటమేంటని మీ అమ్మని నిలదీయలేదు. కామ్‌గా కాలేజీకి వెళ్ళిపోయావు. వచ్చాకైనా ఆమాటన్నావా అంటే అదీలేదు. పోనీ పెళ్ళిచూపులకి వస్తున్నదెవరో తెలుసుకోవాలన్న కుతూహలం ఉందా అంటే అదీలేదు. అటు బావమీద మనసు లేదు ఇటు వేరే పెళ్ళిమీద ధ్యాసలేదు. ఇవన్నీ చాలవా ఒక ఆడపిల్ల ప్రేమలో పడిందని చెప్పడానికి"

సుశీలకి నానమ్మని చూస్తే చాలా గర్వంగా అన్పించింది.

ఎంత చక్కగా ఆవిడ తన మనసుని గ్రహించింది అనుకుంది. అందుకే నిజం చెప్పేసింది.

అహ్మద్‌తో పరిచయం, అతను ప్రేమను వ్యక్తంచేయడం, తను అంగీకరించడంతో పాటు అతన్నెందుకు ఇష్టపడుతోందో కూడా చెప్పింది.

మొత్తం అంతా చెప్పేశాక గుండెబరువు తగ్గినట్టు అన్పించింది సుశీలకి. శారదమ్మ గారు అంతా విని ఒక్కసారి బలంగా నిట్టూర్చారు.

సుశీల చేసిందాట్లో తప్పేంలేకపోయినా ఈ విషయం తెలిస్తే కొడుకెలా రియాక్ట్ అవుతాడో ఆవిడ ఊహించగలదు.

తను, భర్త మంచికి, మానవత్వానికి అన్నింటికీ మించి సర్వమానవసమానత్వానికి విలువ ఇచ్చారు. మతం గురించి తాము ఎప్పుడూ పట్టించుకోలేదు. కానీ కొడుకు అలా కాదు. స్థితిగతులకి, అంతస్థులకి, మతానికి ప్రాధాన్యమిస్తాడు. అదీగాక చెల్లెలంటే అతనికి ప్రాణం.

చెల్లెలికి మాటిచ్చి ఇప్పుడు వెనక్కి తీసుకోవడానికి అతను ఒప్పుకోడు. శారదమ్మగారితో తన ప్రేమ విషయం చెప్పాక సుశీల రిలీఫ్‌గానే ఫీలయ్యింది కానీ ఆవిడ మనసు భారమైంది.

ఇటు మనవరాలి ప్రేమ.

అటు కొడుకు తన చెల్లెలికిచ్చిన మాట.

వీటికి తోడు తన మనవడు సుశీలని ప్రేమిస్తున్నాడో! లేక తల్లి చెప్పిన మాటకు విలువ ఇచ్చి సుశీలని పెళ్ళిచేసుకోవడానికి అంగీకరించాడో తెలీదు. ఒకవేళ దినేష్ సుశీలని ప్రేమిస్తున్నట్టయితే అటు సుశీలో ఇటు దినేషో ఎవరో ఒకరు తమ ప్రేమను సమాధి చేయాలి. మనవరాలికి ధైర్యం చెప్పి కిందకు తీసుకొచ్చిందే గానీ ఆ రాత్రంతా ఆవిడకి కంటిమీద కునుకులేదు.

★ ★ ★

విజేష్ ఆఫీసుకు బయలు దేరుతుండగా దినేష్ ఎదురొచ్చాడు.

"మావయ్యా! మీతో నేనూ వస్తాను. ఐమీన్ మీకు అభ్యంతరం లేకపోతేనే" అన్నాడు.

"నాకేం అభ్యతరం లేదు. కాకపోతే నువ్వేమో కంప్యూటర్ ఇంజనీర్‌వి. మాదేమో రియల్ ఎస్టేట్ బిజినెస్. నీకేం తోస్తుందక్కడ" నవ్వాడు విజేష్.

"దాందేముంది మావయ్యా! రియల్ ఎస్టేట్‌లో కంప్యూటర్ నాలెడ్జి అప్లయ్ చేయకూడదని ఎక్కడుంది? "

"అలా అంటావా! అయితే మరి బయల్దేరు" మేనల్లుడి మాటలు అంగీకరిస్తున్నట్టుగా అతను తనతో రావడానికి అనుమతి ఇస్తూ అన్నాడు విజేష్.

దినేష్ తల్లికి చెప్పి మావయ్యతో బయలుదేరాడు.

కారులో వెడుతుండగా విజేష్‌ని సుశీల చదువుగురించి అడిగాడు దినేష్.

"నీ ఇష్టం. నీకు మీ ఆవిడ్ని ఇంకా చదివించుకోవాలనుంటే నీతో తీస్కెళ్ళి చదివించుకో నాకేం అభ్యంతరం లేదు" అన్నాడు విజేష్.

"అది కాదు మావయ్యా! ఇంకొక్క సంవత్సరంలో సుశీల చదువు పూర్తవుతుంది కదా! ఆ తర్వాత మ్యారేజ్ ఫిక్స్ చేసుకుంటే బాగుంటుందని"

విజేష్‌కి ఆ మాటలు అంతగా రుచించలేదు. నిన్నటిదాకా తన చదువు, ఉద్యోగం అని పెళ్ళి పోస్ట్‌పోన్ చేశాడు. ఇప్పుడేమో సుశీల చదువు పూర్తికావాలంటున్నాడు. అసలింతకీ దినేష్‌కి తన కూతుర్ని పెళ్ళిచేసుకోవడం ఇష్టమా? కాదా?

"చూడండి మావయ్యా! సుశీల అంటే నాకు ఇష్టమే. ఉత్త ఇష్టమే కాదు ప్రేమ కూడా. ఇన్నాళ్లు నా చదువు, ఉద్యోగం అంటూ వివాహం పోస్ట్‌పోన్ చేశాం. మరొక్క సంవత్సరం ఆగితే సుశీల డిగ్రీ అయిపోతుంది. ఆ తర్వాత ఆమెకి ఇంకా చదువుకోవాలని ఉంటే అమెరికాలో చదువుకుంటుంది, లేదా ఇంటిపట్టున ఉండిపోతుంది" అని ఒక్క క్షణం ఆగి అన్నాడు.

"మావయ్యా! చిన్నప్పుడెప్పుడో అమ్మ మీకు మాట ఇచ్చిందని నేనీ పెళ్ళికి ఒప్పుకోలేదు. సుశీల అంటే నాకు ఎంతో ఇష్టమూ, ప్రేమా కూడాను" అని తలవంచుకున్నాడు. మేనల్లుడి ముఖం చూసేసరికి విజేష్ పెదవుల మీద నవ్వు కదలాడింది. ఇంతవరకు తల్లి చెప్పిన మాట విని సుశీలని పెళ్ళిచేసుకోడానికి ఒప్పుకున్నాడేమోననుకుంటున్న విజేష్‌కి దినేష్ మాటలు సంతృప్తి కలిగించాయి.

"సరేరా! నీ ఇష్టప్రకారమే కానీ"

"మరి అమ్మకు..."

"నేను చెప్తాలే మీ అమ్మకు. నువ్వేం దిగులుపడకు" భరోసా ఇచ్చాడు విజేష్. ఇద్దరూ ఆఫీసుకి వచ్చారు.

కారు దిగి, ఆఫీసులోకి ప్రవేశిస్తుండగా విజేష్ సెల్ రింగయ్యింది.

నెంబరు చూసుకుని చిన్నగా తలపంకించాడు.

"హలో! విజేష్‌నీ మాట్లాడుతున్నాను" అన్నాడు.

అవతల ఉన్నది రతీబెన్ గోవిందా.

ఒక్కనిముషం మాట్లాడి ఫోన్ ఆఫ్ చేశాడు.

"ఏమన్నా! చాలా ఉత్సాహంగా కన్పిస్తున్నావ్" అంటూ ఎదురొచ్చాడు రాంభాయ్.

రాంభాయ్‌కి దినేష్‌ని పరిచయం చేసి "ఏడీ, వర్ధన్ రాలేదా? " అని అడిగాడు.

"వచ్చాడన్నా" అని రాంభాయ్ అంటుండగా వర్ధన్ వచ్చాడు.

విజేష్ వర్ధన్ భుజాలు పట్టుకుని దగ్గరకు లాక్కున్నాడు. "మన ఫోన్‌కాల్ అమోఘంగా పనిచేసింది. రతీబెన్ ఆ సైట్ మనకివ్వడానికి ఒప్పుకుంది" అన్నాడు.

విజేష్ గొంతు ఎంతో ఎక్సైటింగ్‌గా ఉంది.

ఈసారి కూడా షాని దెబ్బకొట్ట గలిగినందుకు విజేష్‌కి చాలా ఆనందంగా ఉంది.

"రాంభాయ్!" పిలిచాడు విజేష్.

"చెప్పన్నా!"

"నువ్వు, వర్ధన్ ఇమీడియట్‌గా వెళ్ళి అగ్రిమెంట్ మీద సంతకం పెట్టించండి. డబ్బు ఎప్పుడు కావాలంటే అప్పుడు ఇచ్చేస్తాం అని చెప్పండి"

"అలాగేనన్నా!"

"ఆ... మరో ముఖ్య విషయం. ఆవిడ కొంచెం అదోలాంటి మనిషి. ఆవిడ ఏం చెప్పినా తలాడించండి తప్ప ఎదురు మాట్లాడద్దు. స్థలం మనది అని అన్పించుకోవడం చాలా ముఖ్యం"

"అంతా నువ్వు చెప్పినట్టే జరుగుతుందన్నా. నువ్వేం ఫికర్‌కాకు" భరోసా ఇచ్చాడు వర్ధన్.

వాళ్ళిద్దరూ వెళ్ళాక దినేష్‌ని దగ్గరకు తీసుకున్నాడు. "చూశావా! నువ్వెంత అదృష్టవం



తుడివో" అన్నాడు.

"నేను అదృష్టవంతుడినా? ఏంటి మావయ్యా! నువ్వు చెప్పేదేంటో నాకు అర్థం కావడంలేదు" బిక్కముఖం వేశాడు దినేష్.

"అవున్రా... ఎన్నోరోజులుగా పరిష్కారం కాని సమస్య ఇలా నువ్వు ఆఫీసులో కాలు పెట్టావో లేదో అలా సాల్వ్ అయిపోయింది. అందుకే అన్నాను నువ్వు చాలా అదృష్టవంతుడవని. సో! ఈ సైట్ నీ పేరుమీద రిజిష్టర్ చేయించేస్తాను. ఈ వెంచర్‌లో వచ్చే లాభం మొత్తం మీ భార్యా భర్తలకి నేనిచ్చే కానుక అనుకోండి" విజేష్‌కి చాలా ఆనందంగా ఉంది.

కానీ దినేష్ మాత్రం చాలా ఇబ్బందిగా ఫీలయ్యాడు. 'సుశీల అంటే నాకు ఇష్టమే' అని చెప్పాడు కానీ 'ఈ పెళ్ళి జరగదు' అని చెప్పలేకపోయాడు. ఆ మాట విని ఇటు మావయ్య, అటు తల్లీ ఎవ్వరూ తట్టుకోలేరన్న సంగతి దినేష్‌కి బాగా తెలుసు. కానీ తప్పదు. అదే విధిరాత.

ఆ తర్వాత చాలాసేపు విజేష్ తన సైట్స్, ల్యాండ్ డీలింగ్స్ గురించి మేనల్లుడికి చెప్తూనే ఉన్నాడు. దినేష్ మనిషైతే అక్కడ ఉన్నాడు గానీ మనసు మాత్రం అక్కడలేదు.

తన పెళ్ళి గురించి ఓ నిర్ణయానికి రావాలి అని అతనికి అన్పించసాగింది. తను తీసుకోబోయే నిర్ణయం తల్లిని, మావయ్యని బాధిస్తుందని అతనికి తెలుసు.

కానీ తప్పదు. ఒకరి సంతోషం కోసం మరొకర్ని బాధపెట్టక తప్పదు.

మరో రెండు రోజుల తర్వాత దినేష్ అమెరికా ప్రయాణం అయ్యాడు.

వెళ్ళేముందు అమ్మమ్మతో ప్రత్యేకంగా మాట్లాడాడు. తన మనసులో మాట చెప్పాడు. తను వెళ్లాక ఆ సంగతి సుశీలకి చెప్పమన్నాడు. వాళ్ళిద్దరూ అంత రహస్యంగా ఏం మాట్లాడుకున్నారని విజేష్ అడిగితే శారదమ్మగారు నవ్వి వూరుకున్నారే గాని అసలు సంగతి మాత్రం చెప్పలేదు ఆవిడ.

అతను వెళ్ళాక సుశీల రిలీఫ్‌గా ఊపిరి పీల్చుకుంది.



"హల్లో! నా పేరు శాంతి" చిరునవ్వుతో చెప్పింది.

"హాయ్! ఐయామ్ దినేష్..." అన్నాడు దినేష్.

శాంతిని చూడగానే 'ఇదేంటి! సుశీల ఇక్కడికెలా వచ్చింది?' అని ఆశ్చర్యపోయాడు. తన ఆలోచనకు అతనికి నవ్వొచ్చింది.

ఎక్కడ గుజరాత్, ఎక్కడ వాషింగ్‌టన్.

అక్కడినుంచి సుశీల ఇక్కడకు ఎందుకొస్తుంది?

బహుశా మనిషిని పోలిన మనుషులు ప్రపంచంలో ఏడుగురు ఉంటారని అంటారు. ఇంతకుముందు నమ్మలేదు కానీ ఇప్పుడు మాత్రం నమ్మి తీరాలన్పిస్తోంది. శాంతి, సుశీల ఇద్దర్నీ పక్కన పెడితే అక్కచెల్లెళ్ళనుకుంటారు.

"సారీ! మీరు బిజీగా వున్నట్టున్నారు. మళ్ళీ కలుస్తానులెండి"

"అబ్బే అదేంలేదు!" గభాల్న అన్నాడు దినేష్.

అదొక పెద్ద మల్టీ నేషనల్ కంపెనీ.

వందలాదిమంది పని చేస్తుంటారు.

ఇప్పుడు శాంతిని వదిలేస్తే మళ్ళీ పట్టుకోవడం అసాధ్యం అన్న సంగతి అతనికి బాగా తెలుసు.

"మాట్లాడుతూ మాట్లాడుతూ ఆలోచనల్లోకి జారిపోతుంటారన్నమాట" మరోసారి చిరునవ్వు నవ్వింది శాంతి.

ఆ అమ్మాయిలో అదే ప్రత్యేకత.

తన తల్లిదగ్గరనుంచి నేర్చుకుంది.

అలంకరణలో ఏదైనా మర్చిపోతుంది కానీ పెదవులకు చిరునవ్వు లిప్‌స్టిక్ వేసుకోవడం మాత్రం మరువదు.

అందరినీ స్నేహంగా పలకరిస్తుంది.

అందరితోనూ అభిమానంగా మాట్లాడుతుంది.

నొప్పించదు. తానొవ్వదు.

"అబ్బే! అదేం లేదండీ! మిమ్మల్ని చూశాక కొంచెం కన్‌ఫ్యూజ్ అయ్యాను" సిన్సియర్‌గా చెప్పాడు దినేష్.

"అవునా!" బోలెడంత ఆశ్చర్యపడింది శాంతి.

"కానీ మనం మీట్ అవడం ఫస్ట్‌టైం కదా!"

"నిజమే... ఒక్కనిమిషం" అంటూ పర్స్‌లోంచి ఓ ఫోటో తీసి శాంతికి ఇచ్చాడు.

ఫోటోలో ఉన్న వ్యక్తిని చూడగానే విభ్రాంతితో శాంతి కళ్ళు పెద్దవి అయ్యాయి. "ఈ అమ్మాయి... ఈ అమ్మాయి అచ్చంగా నాలానే ఉందే" అంది..

"అందుకే నేను కూడా కొంచెం కన్‌ఫ్యూజ్ అయ్యాను"

"ఇంతకీ ఈ అమ్మాయి ఎవరు? " మరోసారి పరీక్షగా చూస్తూ అడిగింది శాంతి.

"తను మా మావయ్య కూతురు. డిగ్రీ చదువుతోంది. పక్కన మా అత్తయ్యా, మావయ్యా" చెప్పాడు విజేష్.

"అహా!" అంది సాలోచనగా.

ఒక్కక్షణం తర్వాత "మీ మామయ్య ఏం చేస్తుంటారు? " అని అడిగింది.

"బిల్డర్"

"ఆయన పేరు" తన అనుమానం నిజం కాకూడదనుకుంటూనే అడిగింది శాంతి.

"విజేష్"

అంతే పక్కన బాంబు పడ్డట్టుగా అదిరిపడింది. తననుతాను సర్దుకోవడానికి ఆమెకు కొంచెం ఎక్కువ సమయమే పట్టింది.

"మా నాన్నగారు మీ మావయ్యకు బాగా తెలుసు" ఫోటో తిరిగి అతనికిచ్చేస్తూ అంది శాంతి.

"అలాగా! ఆయన కూడా బిల్డరేనా? " ఆసక్తిగా అడిగాడు దినేష్.

"అవును" అని చెప్పిందే తప్ప పేరు చెప్పలేదామె. దినేష్ కూడా అడగలేదు.

"ఓ. కే. శాంతిగారూ! మళ్ళీ కలుస్తాను" అని చెప్పి తన విజిటింగ్ కార్డ్ తీసిచ్చాడు దినేష్.

దినేష్ వెళ్ళిపోయాక అనుకుంది శాంతి 'అవును! మనం తప్పకుండా కలవాలి'.

అప్పటికప్పుడే శాంతి మనసులో ఓ ఆలోచన రూపుదిద్దుకుంది.

తన తండ్రికి, విజేష్‌కు మధ్యనున్న గొడవలు గురించి ఆమెకి బాగా తెలుసు. తను, తల్లి ఎంతగా ప్రయత్నించినా వారి మధ్య రాజీ చేయలేకపోయారు. అలాంటిది ఇక్కడ దేశంకాని దేశం వచ్చాక తనకో మార్గం కన్పించింది. అలా చేస్తే తప్పకుండా ఇద్దరి మధ్య ఉన్న గొడవలు సమసిపోతాయి. 'ఎస్. శాంతీ! యూఆర్ జీనియస్. ప్రొసీడ్' అని తనలోతాను అనుకుంది.

అమెరికాలో ఒక్కత్తీ ఎలా ఉండాలోనని కొంచెం భయపడింది కానీ ఇప్పుడా సమస్య లేదు. దినేష్ ఉన్నాడు.

ఆమెకి హఠాత్తుగా తండ్రితో మాట్లాడాలన్పించింది. పర్స్‌లోంచి ఫోటో తీసింది. "డాడీ! చూశారా. మీ కూతురి తెలివి. మీకు, విజేష్‌కి మధ్య జీవితాంతం గొడవలు ఉంటూనే ఉంటాయని, మీ ఇద్దరి మధ్య 'రాజీ' అసాధ్యం అని అనేవారు గుర్తుందా!



బట్, మీ కూతురు అది సాధించబోతోంది. త్వరలో మీరిద్దరూ మీ గొడవలన్నీ మర్చిపోయి మంచి స్నేహితులవుతారు"

ఫొటోలోంచే తండ్రి 'అది అసాధ్యం! నీ ప్రయత్నం వృథా' అన్నట్టు విన్పించి శాంతి తనలోతాను నవ్వుకుంది.

తండ్రికి తగిన కూతురు శాంతి.

తండ్రిలానే ఆమెకి పట్టుదల ఎక్కువ.

"ఓ.కే. డాడీ! బై..." అని చెప్పి ఫొటో పర్స్‌లో పెట్టేసింది శాంతి. ఆ తర్వాత దినేష్, శాంతి మంచి ఫ్రెండ్స్ అయ్యారు.

మధుజైన్‌కు కూడా శాంతి బాగా నచ్చింది.

నీరవ్‌షా, విజేష్‌లమధ్యనున్న గొడవలు గురించి మధుజైన్‌కు కానీ, దినేష్‌కు కానీ తెలీదు. విజేష్ ఎప్పుడూ చెప్పలేదు.

అందువల్లనే శాంతి రాకపోకలకు దినేష్ ఇంట్లో ఎవ్వరూ అభ్యంతరం చెప్పలేదు.

శాంతి మనసులో ఉన్న ఆలోచన దినేష్‌కి కానీ, దినేష్ కుటుంబంలో వారికి కానీ ఎవ్వరికీ తెలీదు.

ఒకవేళ శాంతి ఎవరనేది తెలిసినా దినేష్ కుటుంబం ఆమెని అలాగే ఆదరిస్తుంది.

ఎందుకంటే ఇంతకుముందు చెప్పినట్టు నీరవ్‌షా, విజేష్ మధ్యనున్న గొడవలు గురించి దినేష్‌వాళ్లకి ఏమీతెలీదు.

కాని శాంతికి తెలుసు. తెలిసీ దినేష్‌తో పరిచయం పెంచుకుంది. ఎందుకంటే శాంతి ఎవ్వరో కాదు. నీరవ్‌షా కూతురు.

★ ★ ★

రతీబెన్ గోవిందా స్థలం అగ్రిమెంట్ కోసం షా తరపు మనుషులు వెళ్లారు. ఆవిడ సింపుల్‌గా 'సారీ' చెప్పేసింది. తాను ఆ స్థలాన్ని శారదాదేవి కన్‌స్ట్రక్షన్స్‌కు ఇచ్చేసినట్టుగా చెప్పింది.

శారదాదేవి అంటే విజేష్ తల్లి పేరు.

అంటే ల్యాండ్ విజేష్ సొంతమయ్యిందన్నమాట.

ఈ విషయం తెలిసి షా చాలా ఆవేశపడ్డాడు.

అసలు ఆవిడ మనస్థత్వం ఏమిటో షాకు అర్థం కావడంలేదు.

తనంతటతానుగా స్థలంకోసం ఎలాంటి ప్రయత్నమూ చెయ్యలేదు. రతీబెన్ గోవిందా తాను స్వయంగా ఫోన్‌చేసి ఆవిడకు స్థలం అమ్మే ఉద్దేశ్యం ఉందనీ, మీరే దైనా కొనే ఉద్దేశ్యం ఉంటే వచ్చి డీల్ ఫైనలైజ్ చేసుకోమని చెప్పింది.

షా చాలా ఆనందపడ్డాడు.

అంతలోనే కేవలం రెండే రోజుల వ్యవధిలో ఆవిడ ఇలా మాట మార్చేస్తుందని షా అనుకోలేదు.

దేశాయ్, చందూలైతే ఇప్పుడే వెళ్ళి విజేష్‌ని చంపేస్తామంటూ కత్తులు, కటార్లు పుచ్చుకుని బయలుదేరబోయారు.

ఒక్క బిక్కూ మాత్రం ఎలాంటి కామెంట్ చేయకుండా కూర్చున్నాడు.

"ఆరోజే చెప్పాం కదన్నా! రతీబెన్ స్థలానికి ఆ విజేష్ కూడా ప్రయత్నిస్తున్నాడు మనం తొందరపడాలి అని. కానీ నువ్వేం అన్నావ్? ప్రయత్నమే కదా! చేసుకోనీ అన్నావ్" దేశాయ్ మాటలలో ఎత్తిపొడుపు ధ్వనించింది.

"ఇందులో విజేష్ తప్పేంవుంది? అతనూ మనలాగే ప్రయత్నం చేశాడు. మొదట స్థలం మనకు ఇస్తానని ఒప్పుకుని రెండురోజులలో మాట మార్చిన ఆవిడ్ని అనాలసలు" అన్నాడు బిక్కూ.

"ఆవిడ్ని ఏమంటాం? అసలే పెద్దావిడ! అందులో ఒంటరిగా ఉంటోంది. ఆ విజేష్ ఏదో బెదిరించి ఉంటాడు. అలాంటప్పుడు ఎవరైనా ఆవిడలాగే ప్రవర్తిస్తారు. అసలు తప్పంతా మనది. నీటిపామే కదా అని వదిలేశాం. అది తాచుపామని అర్థం అయ్యాకైనా జాగ్రత్తపడ్డామా అంటే అదీలేదు. అందుకే ఇదిగో ఈ సమస్యలన్నీ" అన్నాడు చందూ.

వాళ్ళ మాటలలో వాస్తవం ఉండడంతో షా మౌనం వహించాడు.




విజేష్‌ని మొదట్లోనే అదుపులో పెట్టాల్సింది. ఇప్పటికైనా సమయం మించిపోలేదు. ఇకనుంచి అయినా చాలా జాగ్రత్తగా ఉండాలి.

"వదిలేయండ్రా... వ్యాపారం అన్నాక ఇదంతా మామూలే. కాకపోతే ఇకనుంచి జాగ్రత్తపడదాం. మనం ఏం చేస్తున్నామో, ఏం చేయబోతున్నామో, మన ల్యాండ్ డీలింగ్స్ ఏమిటో విజేష్‌కి ఎట్టి పరిస్థితులలోను తెలియకూడదు" అని నీరవ్‌షా అంటుండగా ఫోన్ రింగయ్యింది.

దేశాయ్ ఫోన్ లిఫ్ట్‌చేసి షా చేతికిచ్చాడు.

ముందు మామూలుగా మాట్లాడటం మొదలుపెట్టాడు నీరవ్‌షా. ఫోన్‌లో అవతలివ్యక్తి ఏం చెప్పాడోగానీ అతని దవడ కండరాలు బిగుసుకున్నాయి.

ఆవేశాన్ని అతికష్టంమీద ఆపుకుంటున్నట్టుగా ఉంది అతని ముఖం. కళ్ళు నిప్పు కణికలకుమల్లే ఎర్రబడ్డాయి.

కోపంతో ముక్కుపుటాలు అదిరిపడ్తుండగా ఫోన్ పెట్టేశాడు. "రేయ్! బిక్కూ! కారు తీయరా!" అని అరిచాడు.

షా ఆగ్రహం చూస్తుంటే బిక్కుకి వెన్ను జలదరించింది. "ఎక్కడికన్నా" అని అడిగే సాహసం చేయలేకపోయాడతను.

షా టేబుల్ సొరుగు తెరిచి గన్ చేతిలోకి తీసుకున్నాడు. బుల్లెట్స్ లోడ్‌చేశాడు.

"అన్నా" అని పిలిచాడు దేశాయ్.

షా ఆగి వెనక్కి తిరిగి చూశాడు.

"మేముండగా నువ్వెళ్ళడం ఏంటన్నా! మాకు చెప్తే ఆ పనేదో మేము పూర్తిచేసుకొస్తాం కదా!" అన్నాడు.

షా దేశాయ్ దగ్గరకు వచ్చి భుజంమీద చెయ్యివేశాడు.

"డోంట్ వర్రీ! నాకేంకాదు" అని చెప్పి ముందుకు సాగిపోయాడు.

షా కారు కదలగానే దేశాయ్, చందు కూడా మరో కారులో బయలుదేరారు.

★ ★ ★

"అన్న మాట ప్రకారం సైట్ రిజిస్టర్ చేసినందుకు చాలా థాంక్సండీ" అన్నాడు విజేష్.

రతీబెన్ తలెత్తి చూసింది.

"ఇందులో థాంక్స్ చెప్పేదేముంది? నీరవ్‌షా తనకా సైట్ అవసరంలేదని ఫోన్‌చేయడంతో మీకు ఫోన్ చేశాను" అంది రతీబెన్.

"వర్ధన్! అమ్మగార్ని జాగ్రత్తగా ఇంటిదగ్గర దింపిరా" అన్నాడు విజేష్.

"పర్వాలేదు బాబూ... నేను వెళ్ళగలను" అంది రతీబెన్.

"రండమ్మా! నేనూ అటే వెళ్తున్నాను. మిమ్మల్ని దింపటం నాకు శ్రమేంకాదు" అని "అన్నా! ఇప్పుడే వచ్చేస్తాను" అని చెప్పాడు విజేష్‌తో.

రతీబెన్ ఎక్కగానే కారు కదిలింది.

★ ★ ★

షా, బిక్కూల కారు సరాసరి విజేష్ ఇంటి ముందు ఆగింది.

బిక్కు దిగి డోర్ తెరిచేదాకా షా ఎదురు చూడలేదు.

కారు ఆగీ ఆగగానే విసురుగా డోరు తెరుచుకుని దిగి ముందుకు నడిచాడు.

బిక్కూ కారు లాక్ చేసి షా వెంట పరిగెత్తాడు.

షా సరాసరి లోపలికి వెళ్ళి సోఫాలో కూర్చున్నాడు.

ఎవరో వచ్చారన్న అలికిడికి శారదమ్మగారు, సుశీల బయటకు వచ్చారు.

"ఎవరు మీరు? ఏం కావాలి?" అడిగారు ఆవిడ.

"విజేష్‌ని పిలవండి" అన్నాడు బిక్కూ.

షా తాపీగా గన్ తీసి కర్చీఫ్‌తో తుడుస్తూ కూర్చున్నాడు.

శారదమ్మగారికి టెన్షన్ పెరిగిపోయింది.

"మీరు ఎవరసలు? సరాసరి ఇలా ఇంట్లో కొచ్చేయడమేమిటి?" అరిచారు శారదమ్మ.

"మీరు విజేష్ తల్లిగారా?" అడిగాడు షా.

శారదమ్మగారు అప్రయత్నంగానే తలాడించారు.

గన్ టీపాయిమీద పెట్టి షా లేచి నిలబడి "నమస్కారమమ్మా!" అంటూ చేతులు జోడించాడు "నన్ను నీరవ్‌షా అంటారు"

"నీ...ర...వ్...షా" అన్న పేరు వినగానే ఆవిడ భయంతో రెండు అడుగులు వెనక్కి వేశారు.

"మీ అబ్బాయిలాగా నేను కూడా బిల్డర్‌నే. మీ అబ్బాయికన్నా సీనియర్‌నమ్మా! ఈ ఊళ్లో నేనేం చెప్తే అదే వేదం... కానీ ఇప్పుడు మీ అబ్బాయి మూలంగా నా వ్యాపారం చాలా దెబ్బతింది. మొదట్లో ఇదంతా నేను పెద్దగా పట్టించుకోలేదు. ఏరంగంలోనైనా పోటీ ఉండాలి. అప్పుడే మనం మరింతగా రాణించగలం అని అనుకున్నాను. కానీ మీ అబ్బాయి సామాన్యుడు కాదమ్మా! మహామేధావి. అదే ఇప్పుడు సమస్యైంది. తన వ్యాపారం తాను చేసుకుంటే ఫరవాలేదు. కానీ నా డీలింగ్స్‌లో వేలుపెడుతున్నాడు. అది భరించడం కొంచెం కష్టంగా ఉందమ్మా! నిజానికి మీ అబ్బాయిని అడ్డుతొలగించటం నాకేం పెద్ద సమస్యకాదు. షాతో గొడవపెట్టుకుంటే వాళ్ళ అడ్రసే జనాభా లెక్కలోంచి తొలగించబడుతుందని ఇక్కడ అందరికీ తెలుసు. కానీ మీ అబ్బాయి విషయంలో ఏదో వాత్సల్యం నాకడ్డువస్తోంది. మీ అబ్బాయికి ఇకనుంచి నాకు అడ్డురావద్దని చెప్పండి. మరోసారి ఇలా జరిగితే అప్పుడిక" అని ఆగిపోయాడు షా.

సుశీల, శారద భయంతో బిగుసుకుపోయినట్టుగా నిలబడ్డారు.

"ఈరోజు రతీబెన్ గోవిందా సైట్ రిజిస్ట్రేషన్ అనుకుంటాను"

"తెలీదు" అన్నారు శారదమ్మ.

"నాకు తెలుసమ్మా! ఆ స్థలం మీ అబ్బాయి ఎలా సంపాదించాడో తెలుసా!" ఒక్క క్షణం వాళ్ళ రియాక్షన్ కోసం ఆగి, తిరిగి కొనసాగించాడు. "ఇన్నాళ్ళూ విజేష్ చాలా తెలివికలవాడని, సమర్థుడని అనుకున్నాను కానీ, అతను ఈ విధంగా ప్రవర్తిస్తాడని నేను ఎంతమాత్రం ఊహించలేదమ్మా!"

"ఏం చేశాడు? " ఖంగారు ధ్వనించింది శారదమ్మగారి స్వరంలో.

"అబ్బే! అలాంటిదేంలేదమ్మా! మీ అబ్బాయి ఎప్పుడూ అలాంటి పనులు చేయడు. తానేం చేసినా తనచేతులకు మట్టి అంటకుండా పని పూర్తిచేస్తాడు. ఈరోజు కూడా అదే పని చేశాడు"

శారదమ్మగారిలో టెన్షన్ పెరిగిపోసాగింది.

కళ్లు తిరుగుతున్నట్టుగా అనిపించి ఆసరా కోసం మనవరాలి చెయ్యి పట్టుకున్నారు.

"రతీబెన్ గోవిందాకు తన మనుషుల్తో ఫోన్ చేయించాడు. అది కూడా నా పేరుతో... ఆవిడకు ఏమని చెప్పించాడో తెలుసా!" నేను నీరవ్‌షాను మాట్లాడుతున్నాను. నాకు వేరే మంచి ల్యాండ్ దొరికింది. మీ స్థలం నాకు అవసరంలేదు. మరెవరికైనా మీరు ఇవ్వచ్చు' అని చెప్పించాడు"

శారదమ్మగారి కళ్ళు విభ్రాంతితో పెద్దవయ్యాయి.

"దాంతో ఆవిడ తనే స్వయంగా విజేష్‌కి ఫోన్‌చేసింది. అంతే రెండురోజులలో అగ్రిమెంట్ చేసుకోవడం, రిజిస్ట్రేషన్ అన్నీ జరిగిపోయాయి. చెప్పండమ్మా! ఇది న్యాయమంటారా? "

షా ప్రశ్నకు శారదమ్మగారికి ఏం సమాధానం చెప్పాలో అర్థంకాలేదు.

"వస్తానమ్మా! నమస్కారం!" చేతులు జోడించాడు షా. "నేను చెప్పమన్నది మర్చిపోకుండా మీ అబ్బాయికి చెప్తారు కదా"

అని వెనక్కి తిరిగిన వాడే మళ్ళీ ఆవిడ దగ్గరకు వచ్చాడు. "షా పిరికివాడు కాదమ్మా! మీ తల్లి మనసు బాధపడటం నేను చూడలేను. అందుకే విజేష్‌కు వార్నింగ్ ఇచ్చి వెడదామని వచ్చాను" అంటూ ముందుకి వంగి శారదమ్మగారి




పాదాలు స్పృశించాడు.

అప్రయత్నంగానే ఆవిడ వెనక్కి అడుగేశారు.

"పసితనంలో తల్లితండ్రుల్ని పోగొట్టుకున్నవాడిని... తల్లి విలువ ఏమిటో నాకు బాగా తెలుసు. మీకు పుత్రశోకం కల్గించకూడదనే విజేష్‌ని నా దారికి అడ్డురావద్దని చెప్పడానికి వచ్చాను" అని చెప్పి వేగంగా వెళ్ళిపోయాడు షా.

శారదమ్మగారు నిలబడ్డ చోటునే కుప్పకూలిపోయారు.

★ ★ ★

"హాయ్ దినేష్"

"ఐ గాట్ ఇట్" గాల్లోకి చేతులూపుతూ చిన్న పిల్లాడిలా సంబరపడ్డాడు దినేష్.

"హాయ్!" ఈసారి మరికొంచెం గట్టిగా పిల్చింది శాంతి.

కంప్యూటర్ గేమ్స్ ఆడుకుంటున్న దినేష్ వెనక్కి తిరిగిచూశాడు.

"హాయ్! హల్లో"

"ఏమిటంత ఖంగారుపడ్తున్నారు? " నవ్వింది ఆమె.

"ఏంలేదు. పిల్చినా రాని మీరు ఈసారి పిలవకుండానే వచ్చేసరికి కొంచెం షాకయ్యాను అంతే... రండి"

"మీరెప్పుడు నన్ను చూసినా కన్‌ఫ్యూజ్ అవడమో, షాక్ అవడమో జరుగుతుందన్నమాట" అంటూ ఇల్లంతా పరిశీలనగా చూస్తూ "అవునూ! అమ్మగారు లేరా? " అడిగింది శాంతి.

"ఉన్నారు. ఒక్కనిమిషం, పిలుస్తాను" అని శాంతితో చెప్పి "అమ్మా" కేకేశాడు దినేష్. "అమ్మా ఎవరొచ్చారో చూడు"

"వస్తున్నాను రా... ఎందుకలా చెవి తెగిన మేకలా అరుస్తావు. లోపల పనిలో ఉన్నదాన్ని రా...వా...లి... కదా!" అంటూ శాంతిని చూసి ఆశ్చర్యపోయింది మధుజైన్.

"నమస్తే ఆంటీ!" ముందుకి వంగి మధుజైన్ కాళ్ళకు నమస్కరించింది శాంతి.

మధుజైన్ వంట చేస్తుంటే ఆవిడకు వంటలో సహాయం చేసింది. మరోపక్క కాసేపు దినేష్‌తో కబుర్లు చెప్పింది.

తన ప్రాజెక్ట్ గురించి ఎవరికో ఫోన్లు చేసి మాట్లాడింది.

శాంతి ఇంట్లో తిరుగుతుంటే చూడటానికి ఆ ఇంటి మనిషిలానే అనిపించింది తప్ప దినేష్ ఇంట్లో వాళ్లెవ్వరికీ పరాయి మనిషన్న భావనే కలగలేదు.

సాయంకాలందాకా అక్కడే గడిపి వెళ్ళింది శాంతి.

ఆమె వెళ్ళగానే ఇల్లంతా బోసిపోయినట్టుగా అనిపించింది మధుజైన్‌కు. ఆ మాటే కొడుకుతో అంది ఆవిడ.

ఈ అవకాశం కోసమే దినేష్ చాలారోజుల నుంచి ఎదురుచూస్తున్నాడు. ఎప్పటికప్పుడు ఎలాగైనా చెప్పాలనుకోవడం, కానీ ఏదో తెలీని ఇబ్బందితో ఆగిపోవడం. తను తొందరపడకపోతే, తన మనసులో మాట చెప్పకపోతే సుశీలకి, తనకి పెళ్ళి కుదిర్చేస్తారు అని అతనికి తెలుసు. తను ఆలస్యం చేసేకొద్దీ సమస్య మరింత తీవ్రం అవుతుందని కూడా దినేష్‌కి తెలుసు. ఇన్నాళ్లుగా అతను ఎదురుచూస్తున్న అవకాశం ఇప్పుడొచ్చింది. దీనిని జారవిడుచుకుంటే ఇక ఎప్పటికీ తన మనసులో మాట చెప్పలేడనిపించింది అతనికి. అందుకే ఓ నిర్ణయానికి వచ్చినవాడిలా బలంగా వూపిరి తీసుకుని తల్లిని అడిగాడు.

"అమ్మా! శాంతి గురించి నీ అభిప్రాయం ఏమిటి? "

"మంచి అమ్మాయి. అందానికి అందం ఉంది. వినయవిధేయతలు ఉన్నాయి. మంచి చదువు, ఉద్యోగం నిజంగా ఎవరింటి కోడలు అవుతుందో గానీ వాళ్ళు అదృష్టవంతులనే చెప్పాలి" తన మనసులో ఏం అనుకుంటోందో ఆ మాటే చెప్పింది ఆవిడ.

"ఎవరింటికో పంపడం ఎందుకమ్మా! మన ఇంటి కోడలినే చేసుకోవచ్చు కదా!" నిదానంగా, నిశ్చలంగా చెప్పాడు దినేష్.



ఆ మాటకి మధుజైన్ చురుగ్గా కళ్లెత్తి చూసింది.

ఒక్కక్షణం కొడుకు ఏం మాట్లాడుతున్నాడో ఆవిడకు అర్థంకాలేదు. అర్థం అయ్యాక కూడా కొడుకు జోక్ చేస్తున్నాడేమో అనుకుని అతని వంక పరీక్షగా చూసింది. దినేష్ సరదాకి అనడం లేదని సీరియస్‌గానే అన్నాడని ఆవిడకి అర్థం అయ్యింది.

గుండెల్ని పిండినంత బాధ కలిగింది ఆవిడకు. కళ్ళు నీళ్ళతో నిండిపోయాయి. కొడుకు ఈ విధంగా ఆలోచించగలడని ఆవిడ ఎంత మాత్రం ఊహించలేదు.

అమెరికాలో పుట్టిపెరిగినా అమ్మాయిలతో స్నేహాలకు, డేటింగ్‌లకు దూరంగా ఉండే తన కొడుకును చూసుకుని ఆ తల్లి మనసు ఎంతో గర్వించేది. అలాంటిది ఇన్నేళ్లల్లో ఎప్పుడూ ఏ అమ్మాయినీ ఇంటికి తీసుకురాని కొడుకు మొట్టమొదటిసారి శాంతిని వెంటబెట్టుకుని వచ్చేసరికి మధుజైన్ ఆశ్చర్యపోయింది.

ఆవిడకు అన్నయ్య కూతురంటే ప్రాణం. సుశీల పోలికలు శాంతిలో కనిపించేసరికి సుశీలలా భావించే శాంతిని ఆదరించింది. అదే తన పొరపాటు అవుతుందని, తన కొడుకు మనసు మారుతుందని మధుజైన్ ఊహించలేకపోయింది.

తల్లి పడుతున్న మానసిక సంఘర్షణను అర్థంచేసుకోలేని పసివాడేం కాదతను.

"అమ్మా!" అంటూ ఆవిడ్ని చుట్టేసి బావురుమన్నాడు.

"అమ్మా! దయచేసి నన్ను గురించి తప్పుగా అనుకోవద్దమ్మా! నాకు సుశీలంటే ప్రాణం"

ఆ మాటకి మధుజైన్ చివ్వున తలెత్తి చూసింది.

అతను మాత్రం చెప్పుకుపోయాడు. "అవునమ్మా! మీరంతా చిన్నప్పటి నుంచి అన్నారనో, మరోటో తెలీదుగానీ నిజంగానే సుశీలంటే నాకు చాలా ఇష్టం. కానీ తన మనసులో నేను లేను" బాధతో దినేష్ స్వరం రుద్ధమైంది.

"దినేష్... ఏంట్రా నువ్వనేది?" షాక్ తిన్నట్టు దిగ్భ్రాంతిగా కొడుకువైపు చూసింది మధుజైన్.

"అవునమ్మా! నేను చెప్పేది నిజం" అన్నాడతను తడికళ్లతో. ఆ రాత్రి అమ్మమ్మను పిలవడానికి మేడమీదకు వెళ్ళిన అతను సుశీల, అమ్మమ్మ మాట్లాడుకున్నదంతా తల్లికి చెప్పాడు.

మధుజైన్ నిశ్చేష్టురాలైంది.

చిన్నతనంనుంచి 'సుశీల నీ పెళ్ళాంరా!' అంటూ కొడుకు మనసులో ఎన్నో ఆశలు రేపింది. కొడుకు మాత్రమేనా! తను మాత్రం? సుశీల కోసం ఎన్ని చీరలు కొన్నది. అమెరికానుంచి వెళ్ళినప్పుడల్లా ఎన్ని బహుమతులు తీసుకువెళ్ళింది. ఎప్పుడెప్పుడు పిల్లలు పెద్దవాళ్ళు అవుతారా! వాళ్ళిద్దరికీ పెళ్ళిచేసి కోడల్ని తెచ్చేసుకుందామా అని రోజులు లెక్కబెట్టింది. తీరా...

కళ్ళు తుడుచుకుని కొడుకుని దగ్గరకు తీసుకుంది మధుజైన్.

"నన్ను సుశీలతో మాట్లాడమంటావా?" కొడుకు జుట్టులోకి వేళ్ళు పోనిచ్చి సరిచేస్తూ అడిగింది.

"వద్దమ్మా! సుశీల మనసులో నేను లేను. ఈ విషయం అందరికీ తెలిస్తే, అందరూ కలిసి సుశీలకి నచ్చజెప్తారు. ముఖ్యంగా మావయ్య బలవంతంగానైనా సుశీలతో నా పెళ్లి జరిపిస్తాడు. దానివలన ప్రయోజనం ఏముంది? ఎవ్వరికీ సుఖం ఉండదు. జీవితాంతం అందరం ఏడుస్తూ బతకాలి. ఇద్దరి ప్రేమలో ఒకరి ప్రేమ బతికే అవకాశం ఉన్నప్పుడు దాన్ని బతికించడమే న్యాయం కదమ్మా! నేను శాంతిని పెళ్లి చేసుకుంటే సుశీలకు తన మనసుకి నచ్చిన వాడ్ని పెళ్లి చేసుకునే అవకాశం ఉందమ్మా! కనీసం తనైనా సుఖంగా ఉంటుందమ్మా" చిన్నపిల్లాడిలా ఏడుస్తున్న కొడుకుని ఎలా సముదాయించాలో మధుజైన్‌కు అర్థం కావడంలేదు.




అయిదు నిమిషాల తర్వాత కొంచెం తేరు కున్నాడు దినేష్. ఇన్ని రోజులుగా మనసు నిండా పేరుకున్న వేదన కన్నీళ్ల రూపంలో ప్రవహించాక మనసు కొంచెం తేలికపడిన ట్టుగా ఉందతనికి. ముఖ్యంగా అసలు విషయం తల్లితో చెప్పాక గుండె బరువు తగ్గినట్టుగా ఫీలయ్యాడు.

"అమ్మా" పిల్చాడు దినేష్.

"అమ్మా!" మరోసారి పిలిచాడు.

"ఏంట్రా..." ఉలికిపాటుగా అడిగింది మధుజైన్.

"నేను తీసుకున్న నిర్ణయం..." అర్థోక్తిగా ఆగిపోయాడు.

"తప్పుకాదు బాబూ! ఎంత మాత్రం తప్పు కాదు. ప్రేమ త్యాగాన్ని కోరుతుందంటారు. నీ ప్రేమను చంపుకుని సుశీల ప్రేమను బతికించాలనుకుంటున్న నిన్ను చూస్తుంటే ఓ పక్కన గర్వంగానూ ఉంది, మరోపక్కన బాధగానూ ఉందిరా" బాధతో, దుఃఖంతో మధుజైన్ కంఠం బొంగురుపోయింది.

"అమ్మా! ఈ విషయం ఎట్టి పరిస్థితుల లోనూ మావయ్యకి తెలీకూడదు. ముఖ్యంగా నా పెళ్లి అయ్యేదాకా". స్థిరంగా చెప్పాడు దినేష్.

"అలాగేరా" వాగ్దానం చేసింది మధుజైన్.

"ఇప్పుడు చెప్పమ్మా! శాంతి నీ కోడలు కావడం నీకు ఇష్టమేనా?" అని అడిగి ఆవిడ సమాధానం చెప్పే లోపున తిరిగి తనే కొనసాగించాడు.

"నేను కొద్దోగొప్పో అదృష్టవంతుడినమ్మా! శాంతికి, సుశీలకి పోలికలు చాలా ఉన్నాయి కదూ! కాకపోతే వారిద్దరి మనస్తత్వంలో ఎంతో భేదం ఉంది. అయినా రూపంలో సారూప్యత ఉందిగా. అంతటితో సరిపెట్టు కుంటాను"

"దినేష్..." ఆర్తిగా పిలిచింది మధుజైన్.

కళ్లు గట్టిగా తుడుచుకున్నాడు. "లేదమ్మా! నేను ఏడవడంలేదు" అంటుండగా మళ్లీ దుఃఖం ఉప్పెనలా వచ్చింది.

చాలా సేపటివరకు తల్లీకొడుకులిద్దరూ ఒకరినొకరు ఓదార్చుకుంటూనే ఉన్నారు.

తొలిప్రేమ అనుభవం మనిషి కట్టెల్లో కాలిపోయేదాకా విడిపోదంటారు. అందునా చిన్ననాటి స్నేహం ప్రేమగా పందిరి నల్లు కుంది. అందుకే అతనికి అంత బాధ.

కానీ మనసు చేసే గారడీయే ఇదంతా.

ఎప్పుడు ఏ క్షణాన ఎవరిమీద ప్రేమ కలుగుతుందో ఎవ్వరూ చెప్పలేరు.

★ ★ ★

విజేష్ వచ్చేవరకు ఎవరెంత చెప్పినా ఆవిడ మంచినీళ్లు కూడా తాగలేదు.

కొడుకును చూడగానే అప్పటివరకు అణు చుకున్న దుఃఖం ఒక్కసారిగా ఆవిడలో పెల్లుబికింది.

"అమ్మకేమైంది?" అంటూ వెళ్లి తల్లిని దగ్గరకు తీసుకున్నాడు విజేష్. అతని ప్రశ్నకు ఎవ్వరూ జవాబు చెప్పలేదు.

"నాన్నగారూ! మీరైనా చెప్పండి అమ్మకే మైంది?"

రాఘవయ్యగారు భార్యవైపు చూసి వూరు కున్నారే తప్ప నోరిప్పలేదు. అదే ప్రశ్న భార్యని అడిగారు. ఆవిడ కూడా మౌనంగా వుండిపోయింది.

"డాడీ మరి..."

"చెప్పమ్మా! నువ్వైనా చెప్పు"

సుశీల ఓసారి నానమ్మవైపు చూసి అంది "డాడీ! ఇందాక ఆ నీరవ్‌షా వచ్చి..."

షా పేరు వినగానే తండ్రి ముఖంలో కోపం బుస్సుమని పొంగేసరికి సుశీల భయంతో ఒక అడుగు వెనక్కి వేసింది.

"ఊ వచ్చి.."

"..."

"చెప్పు సుశీ! ఆ షా వచ్చి ఏమన్నాడు?" పళ్లు బిగించాడు విజేష్.

సుశీల అయోమయంగా తల్లివైపు, నాన్నమ్మ వైపు చూసింది. మందులు వేసు కోవడంవలన శారదమ్మగారికి నిద్ర ముంచు కొచ్చింది.

"సుశీలా!"

"డా...డీ"

"షా వచ్చి ఏమన్నాడని అడుగుతుంటే అలా దిక్కులు చూస్తూ నిలబడతావేం?" కోపంగా అరిచాడు విజేష్.

తండ్రి కోపం సుశీలని మరింతగా భయ పెట్టింది.

"డాడీ! మరి మీరు అన్నింట్లోను షాతో పోటీ పడుతున్నారట. ఆయన డీలింగ్స్‌లో కల్పించుకుంటున్నారట. అందుకని మిమ్మల్ని..." గుటకలు మింగింది సుశీల.

"ఆ అందుకని ఏం చేస్తాడట?" కోపం, హేళన మిళితమైన స్వరంతో అడిగాడు విజేష్.

"ఆయన తల్చుకుంటే..."

"నా అడ్రస్ లేకుండా చేస్తాడు. అంతేగా!"

"డాడీ..." సుశీల ఆందోళనపడింది.

విజేష్ గభాల్న వెనక్కి తిరిగి బయటకు నడిచాడు.

"డాడీ! ప్లీజ్... మీరిప్పుడు బయటకు వెళ్లద్దు" సుశీల అడ్డు పడింది.

"వాడు... వాడికెంత ధైర్యం కాకపోతే నా ఇంటికే వచ్చి నా తల్లిని బెదిరిస్తాడు. వాడ్ని వాడ్ని ఊరికే వదలను. ఊరికే వదలను. వాడు నా అడ్రస్ లేకుండా చెయ్యడం కాదు, నేనే వాడి అడ్రస్ లేకుండా చేస్తాను" అంటూ సుశీలని తప్పించి బయటకు వెళ్ల బోయాడు విజేష్.

అతనెంత గింజుకున్నా రాఘవయ్యగారు తన పట్టు విడవలేదు.

ఈ అలికిడికి శారదమ్మగారికి నిద్రాభంగమై మెలకువ వచ్చింది. "బాబూ! విజేష్" పిలిచారు శారదమ్మ.

వెంటనే విజేష్ తల్లి దగ్గరికి వెళ్లి మోకాళ్ల మీద కూర్చున్నాడు. తల్లి చేతిని తన చేతి లోకి తీసుకున్నాడు.

"బాబూ! నువ్వు ఇప్పుడు ఎక్కడికీ వెళ్లడానికి వీల్లేదు.. ఇలాగే నా పక్కనే కూర్చో" చెప్పారు శారదమ్మ.

ఆవిడ గొంతు ఎక్కడో నూతిలోంచి వస్తున్నట్టుగా ఉంది.

"అదికాదమ్మా" విజేష్ నచ్చచెప్పబోయాడు.

"వి...జే...ష్! నన్ను వదిలి వెళ్లద్దురా" దీనంగా ఉంది ఆవిడ స్వరం.

"డాడీ" తండ్రి భుజం మీద తలానించింది సుశీల. "డాడీ! నాన్నమ్మకి బి.పి బాగా ఎక్కువగా ఉందిట. ఆవిడ్ని ఏమాత్రం టెన్షన్ పెట్టద్దని డాక్టరు చెప్పారు ప్లీజ్ డాడీ! నాన్నమ్మ మాట వినండి. ఆవిడ్ని విడిచి ఎక్కడికీ వెళ్లనని చెప్పండి"

"అవున్రా! డాక్టరుగారు మరీమరీ చెప్పారు. ఇంతకుమించి బి.పి ఏమాత్రం పెరిగినా ప్రమాదమన్నారు. దాన్ని బాధపెట్టకురా! మీ అమ్మకి ఇప్పుడు ప్రశాంతత కావాలి. మనశ్శాంతి కావాలి. అవి రెండూ ఇవ్వ గలిగిన వాడివి నువ్వొక్కడివేరా! దయచేసి నా భార్యని కాపాడు. ఈ వయసులో నన్ను ఒంటరివాడిని చెయ్యకురా" కొడుకుకు రెండు చేతులూ జోడించి నమస్కరించారు రాఘవయ్య.

"నాన్నా" వారించాడు విజేష్.

"అవునురా... మీరూ మీ గొడవలూ ఏమిటో నాకు అర్థం కావడంలేదు. నేనూ రియల్ ఎస్టేట్స్ వ్యాపారమే చేశాను. కానీ ఏరోజూ ఇలా ఎవ్వరితోనూ గొడవలు పడలేదు. ఒకవేళ ఎవరితోనైనా చిన్నాచితకా అభిప్రాయభేదాలున్నా వాటిని ఇంటి బయటే పరిష్కరించుకున్నాను తప్ప ఇంటిదాకా గొడవలు తీసుకురాలేదు. అయినా నీకు వూళ్లో వేరే స్థలమే దొరకలేదా? ఆ నీరవ్‌షా తీసుకుందామనుకున్న స్థలమే కావాల్సి వచ్చిందా? ఆ సైట్ ఓనర్‌కి షా పేరుతో దొంగ ఫోన్ చేసి సైట్ తనకి అవసరం లేదని చెప్పించావట. అది తెలిసి షానేకాదు ఆ స్థానంలో ఎవరున్నా అతనిలాగే ఆవేశపడతారు. వ్యాపారం అన్నాక ఎత్తులు పైఎత్తులు మామూలే. కానీ ఇలాంటి చీప్ ట్రిక్స్ మాత్రం ప్రయోగించకు.





నీ ఇమేజ్ నాశనం చేసుకోకు" రాఘవయ్య గారి స్వరంలో కోపంతోపాటు మందలింపు కూడా వ్యక్తమయ్యింది.

తండ్రి చెప్పింది విని విజేష్ ఆశ్చర్యపోయాడు. ఇంత త్వరగా షాకి ఈ విషయం ఎలా తెలిసిందో అతనికి అర్థంకాలేదు.

"నాన్నగారూ! మీరు అన్నది నిజమే! కానీ నాకు ఈ మార్గం చూపించింది ఎవరో తెలుసా? "

విజేష్ ఇంతవరకు తల్లితండ్రుల ముందు స్వరం పెంచి మాట్లాడి ఎరుగడు.

"మీకు తెలీదు డాడీ! ఎందుకంటే ఆ నీరవ్‌షా కేవలం నేను చేసిందే చెప్పాడు తప్ప తాను చేసిన పని గూర్చి మీకు చెప్పలేదు. మీరేమో అతను చెప్పింది నమ్మి నన్ను చీవాట్లు వేస్తున్నారు"

"ఏమిట్రా నేను తెలుసుకోవాల్సింది"

"ఉంది... చాలా ఉంది. మీరన్నారే నేనూ వ్యాపారం చేసానని. ఏం సంపాదించారు? చెప్పండి. కనీసం సొంత ఇల్లైనా కట్టుకోగలిగారా? లేదే! మా చిన్నతనంలో తిండి, బట్టకు ఆ తర్వాత కాలేజీ ఫీజులకు ఎంత ఇబ్బంది పడ్డామో మీకు గుర్తు లేకపోయినా నాకు గుర్తుంది. మేము స్కూలుకి వెళ్లేప్పుడు నా చెల్లెలు ఆశగా అన్నయ్యా ఐస్‌క్రీమ్ కొనిపెడ్తావా! అని అడిగితే ఖాళీజేబులు నన్ను వెక్కిరించేవి. మమ్మల్ని కన్నారేగానీ ఒక్కనాడు ఒక్కనాడైనా మా కోరికలు ఏమిటో తెలుసుకోగలిగారా మీరు. లేదు... తెలుసుకోలేదు"

శారదమ్మగారు అదంతా భరించలేనట్టుగా బాధగా కళ్లు మూసుకున్నారు.

"ఏవండీ..." రాజేశ్వరి భర్త చెయ్యి పట్టుకుని వారించింది.

"నువ్వు మాట్లాడకు" ఒక్కసారి చెయ్యి విదిలించాడు విజేష్.

"అవునమ్మా! నువ్వు మాట్లాడకు. ఇన్నాళ్లకి నా కొడుకు నా కళ్లు తెరిపిస్తున్నాడు" బాధగా కళ్లు ఒత్తుకున్నారు రాఘవయ్య.

తండ్రి కళ్లనీళ్లు పెట్టుకోవడం చూసేసరికి విజేష్ ఆవేశపు పొంగు మీద నీళ్లు జల్లినట్టు అయింది.

"ఐయామ్ సారీ నాన్నగారూ! క్షమించండి. మీ రోజులకు మా రోజులకు చాలా తేడా వుంది. ఆ రోజున్న నైతిక విలువలు నేడు లేవు. ఏ వ్యాపారంలోనైనా నేడు పోటీ ఎక్కువైంది. సరే అదంతా వదిలెయ్యండి. ఏమన్నారు? నీరవ్‌షాను నేను మోసగించానా! లేదు నాన్నా! మొదలుగా ఆ పని చేసింది అతనే. ఆ సైట్‌కోసం రతీబెన్ గోవిందాని ముందుగా కలిసింది నేను. మాట్లాడింది నేను... ఫైనలైజ్ చేసుకుంది నేను. కానీ అతనేం చేశాడో తెలుసా? " కోపంతో విజేష్ దవడ కండరాలు బిగుసుకున్నాయి.

"అతను తన మనిషిని పంపించి విజేష్ దగ్గరినుంచి వస్తున్నానని సైట్ తనకు అవసరం లేదని చెప్పించాడు. దాంతో ఆవిడ నీరవ్‌షాకు సైట్ అమ్మడానికి నిశ్చయించుకుంది. హఠాత్తుగా ఆవిడ తన నిర్ణయం ఎందుకు మార్చుకుందో నాకు అర్థంకాలేదు. తీరా విచారిస్తే ఇదంతా షా ప్లానని అర్థం అయ్యింది. అలాంటి పరిస్థితుల్లో నేనేం చేయాలి? "

విజేష్ ప్రశ్నకు అక్కడ ఎవ్వరూ సమాధానం చెప్పలేకపోయారు.

"రతీబెన్ గోవిందా స్థలం కోసం నేనెంత కష్టపడ్డానో మీకు తెలీదు నాన్నా! ఆ స్థలంలో ఓ ఆకాశహర్మ్యం నిర్మించాలని కలలుగన్నాను. ఇంజనీర్‌ని సంప్రదించాను. ప్లాన్స్ గీయించాను. ఒక్కరోజు ఆలస్యం చేశాను. ఆ అవకాశం నీరవ్‌షా వాడుకున్నాడు. స్థలం నా చెయ్యి దాటిపోయిందనే అనుకున్నాను. కానీ నాకు మళ్లీ ఓ అవకాశం వచ్చింది. నీరవ్‌షా చేసిన మోసం తెలిసింది. నేను కూడా అదే ట్రిక్ ఎందుకు ప్లే చేయకూడదన్పించింది. టిట్ ఫర్ టాట్ అంటారుకదా! నేను అదే పని చేశాను. దాంతో ఆవిడే నాకు స్వయంగా ఫోన్ చేసి

సైట్ అమ్మదలిచినట్టు చెప్పింది. ఈసారి ఏమాత్రం అవకాశం వదులుకోదలుచుకో లేదు. వెంటనే అగ్రిమెంటు రాసుకున్నాను. రిజిస్ట్రేషన్ కూడా చేయించేశాను. ఇప్పుడు చెప్పండి నేను చేసిన దానిలో ఏదైనా తప్పుందా? "

"నీకు ఈ విషయం ఎలా తెలిసింది? అదే... షా తరపు మనిషి వెళ్లి నీ పేరు చెప్పి సైట్ అక్కర్లేదన్నాడన్న విషయం" అడిగారు రాఘవయ్య.

"వసంత్ చెప్పాడు. ఏం? " అనుమానంగా చెప్పాడు విజేష్.

"అది నిజమో కాదో కనుక్కున్నావా? "

"అడిగాను నాన్నా! రతీబెన్ గోవిందా కూడా ఎవరో ఒక వ్యక్తి వచ్చి ఈరకంగా చెప్పాడని చెప్పింది"

ఆ తర్వాత రాఘవయ్య ఆ విషయాన్ని పొడిగించలేదు. గదిలోంచి బయటకు వెడుతూ అన్నారు "నేను పొరపాటు పడి ఉంటే క్షమించు"

"నాన్నా!" వారించాడు విజేష్. "నేను మీ కొడుకుని. నన్ను కేకలేసే అధికారం మీకుంది. నేనే పొరపాటుగా మాట్లాడాను. మీరే నన్ను క్షమించాలి"

"తప్పేమీ మాట్లాడలేదురా! వాస్తవమేగా చెప్పావు. ఏదిఏమైనా జాగ్రత్తగా ఉండు. ఆ వసంత్ చెప్పేది కూడా గుడ్డిగా నమ్మకు" హెచ్చరించారాయన.

ఆ విషయాన్ని అంత సింపుల్‌గా రాఘవయ్యగారు వదిలేయకుండా ఉంటే ఈ కథ తీరు వేరే విధంగా ఉండేది.

★ ★ ★

టైం రాత్రి పన్నెండు గంటలవుతుండగా విజేష్ బయటకు వచ్చాడు.

అతను బయటకు రాగానే అతని ఇంటి దగ్గర వెయిట్ చేస్తున్న వాళ్లు ఎలర్ట్ అయ్యారు. అతని కారు షా ఇంటివైపుకు దూసుకుపోయింది.

డ్రైవ్ చేస్తున్నాడనేగానీ అతని మనసు అగ్నిగుండంలా మండిపోతోంది. ఎంత ప్రయత్నించినా షా తన ఇంటికి వచ్చి తల్లిని బెదిరించాడన్న సంగతి విజేష్ మర్చిపోలేకపోతున్నాడు.

అది తల్చుకుంటున్నప్పుడల్లా అతనిలో కోపం, ఆవేశం ఉప్పొంగుతున్నాయి. వ్యాపారం అన్నాక ఈ ఎత్తులు పైఎత్తులు అన్నీ మామూలే. ఒక్కోసారి ఒక్కొక్కరిది పైచేయి అవుతుంటుంది. అనుకోని సంఘటనలు జరగడం, ఎదురుదెబ్బలు తగలటం ఇదంతా ఏ వ్యాపారంలోనైనా మామూలే. అంత మాత్రానికే ఇంటికొచ్చి బెదిరించాలా? తన వాళ్లకి మనస్థాపం కలిగించాలా?

అయినా వ్యాపారం చేస్తున్నది తను. షాతో పోటీ పడుతున్నది తను. అలాంటిది తనను వదిలేసి ఇంటికెళ్లి తల్లిని బెదిరించడమేమిటి?

అసలే తల్లి సున్నిత మనస్కురాలు. చెప్పిన టైంకి ఇంటికి వెళ్లకపోతే ఏవేవో ఊహించుకుని భయపడిపోతుంది. అలాంటిది షా వచ్చి నీ కొడుకు నాకు అడ్డొస్తున్నాడు. జాగ్రత్తగా ఉండమని చెప్పండి లేదంటే అతని అడ్రస్ గల్లంతైపోతుంది అనంటే ఏ తల్లికైనా బి.పి పెరగకుండా ఎలా ఉంటుంది?

అసలా విషయం వినగానే వెళ్లి ఆ నీరవ్ షాను నరికేయాలన్నంత కోపం వచ్చింది. కానీ తల్లి అడ్డుపడడంతో ఊరుకున్నాడు.

ఎదురుగా ఏదో కారు అడ్డురావడంతో తన ఆలోచనల్లోంచి బయటికొచ్చి సడన్ బ్రేక్ వేశాడు విజేష్.

అక్కడంతా కొంచెం చీకటిగా ఉండటం వల్ల ఆ కారు ఎవరిదైందీ పోల్చుకోలేకపోయాడు.

కారులోంచి ఇద్దరు వ్యక్తులు దిగారు. వారిద్దరి చేతుల్లోను గన్స్ ఉన్నాయి.

విజేష్ ఉలిక్కిపడ్డాడు.

వారు షా మనుషులు కాదుకదా! తనకు ఈ విషయం తెలీగానే షా ఇంటికి బయలుదేరతానని ఊహించి మధ్యలోనే తనను





ఖతం చేయమని ఆ నీరవ్‌షా ఇలా మను షుల్ని పంపించాడా?

అంటే అందరూ అన్నట్టు ఆ షా నిజంగా మనుషుల్ని చంపే కిరాతకుడేనా? తల్లి మాట వినకుండా బయటకు వచ్చినందుకు తనకింత పెద్దశిక్షా? ఈ రోజుతో తన చాప్టర్ క్లోజన్నమాట.

అంతలోనే విజేష్‌లో ఏదో మొండి ధైర్యం చోటు చేసుకుంది. వాళ్లు షా మనుషులైతే తనకేం భయం? ఇలాంటి బెదిరింపులకు బెదిరిపోతే తను ఇక వ్యాపారం మానేసి ఇంట్లో కూర్చోవాల్సిందే.

ఒకవేళ వాళ్లు నిజంగా ఆ షా పంపిన వాళ్లే అయితే, వాళ్లు తన ప్రాణం తియ్యడా నికే వచ్చుంటే మాత్రం తను చచ్చేలోపు వాళ్లని కూడా చంపి తీరాలి. అవును! అలాగే చేయాలి.

అదోలాంటి తెగింపుతో కార్‌డాష్‌బోర్డ్ లోంచి రివాల్వర్ తీసుకుని కారు దిగాడు విజేష్.

ఆ ఇద్దరూ విజేష్ వైపు ఒక్కో అడుగు వేయసాగారు. తన చేతిలోని రివాల్వర్ చూసి కూడా వాళ్లు ఎంత మాత్రం బెదరలే దంటే వారికి నీరవ్‌షా అప్పగించిన పని ఎంత ముఖ్యమో తెలుస్తోంది.

షా దగ్గర ఎంతోమంది నమ్మినబంట్లు వున్నారని, షా ఏం చెప్తే వాళ్లు అది చేస్తా రని ఆఖరికి చనిపోమన్నా కారణం అడగ కుండా తమ ప్రాణం త్యాగం చేస్తారని విజేష్ విని వున్నాడు. షా చెప్పిన పని పూర్తి చేయడం మినహా తమ ప్రాణాలు గురించి ఆలోచించని నమ్మినబంట్లని ఇప్పుడు ప్రత్యక్షంగా చూస్తున్నాడు.

"స్టాప్‌దేర్! అడుగు ముందుకు వేస్తే కాల్చే స్తాను" అరిచాడు విజేష్. వాళ్లిద్దరూ ఆగ లేదు.

విజేష్ మాటలు విననట్టుగా అతనివైపుకు అడుగులు వేయసాగారు.

"ఆగిపోండి... అక్కడే ఆగిపోండి. దగ్గర కొస్తే కాల్చేస్తాను" మరోసారి హెచ్చరించాడు.

విజేష్ మాట పూర్తికాకముందే వాళ్లిద్దరి చేతుల్లోని గన్స్ పేలాయి. వెనకనుంచి విజే ష్‌ని ఎవరో పక్కకు లాగడంతో గుళ్లు అతని భుజాన్ని రాసుకుంటూ దూసుకుపో యాయి. లేదంటే అవి సరిగ్గా విజేష్ గుండెల్లో దిగబడేవి.

ఈ హఠాత్పరిణామం నుంచి తేరుకోడా నికి విజేష్‌కి కొంచెం ఎక్కువ టైమే పట్టింది.

ఆ టైమ్‌లో షూట్ చేసిన ఇద్దరూ పారి పోయారు. క్షణంలో వాళ్లు మాయమైపో యారు.

"మేము రావడం ఒక్క క్షణం ఆలస్యమై ఉంటే ఏమయ్యేది?" అరిచినట్టే అడిగాడు వర్ధన్.

"ఇప్పుడేం కాలేదుగా! ఎందుకంత వర్రీ అవుతావ్?" నవ్వబోయాడు విజేష్.

"ఏం కాలేదుగా అంటున్నావా? మేమురా వడం ఒక్కక్షణం ఆలస్యమై ఉంటే ఏమ య్యేదో తెలుసా? అమ్మో అది తల్చుకుం టుంటేనే ఒళ్లు జలదరిస్తోంది. నీకు మాత్రం నవ్వులాటగా ఉంది"

"వర్ధన్"

"నువ్వేం చెప్పద్దన్నా! అసలింత అర్ధరాత్రి వేళ నువ్వు ఒంటరిగా బయటకు రావాల్సిన అవసరమేమొచ్చింది? సరే ఏదో ముఖ్యమైన పనికోసం బయల్దేరావనుకుందాం మాకో ఫోన్ చేయచ్చుగా! నువ్వు రమ్మని చెప్తే మేము ఏనాడైనా రాకుండా ఉన్నామా! చెప్పన్నా" నిలదీస్తున్నట్టుగా అన్నాడు వర్ధన్.

"అది కాదురా" విజేష్ ఏదో నచ్చచెప్పబో యాడు.

"ఇంకెప్పుడూ ఇలా చేయనని చెప్పన్నా! ఆ మాట తప్ప నేనింకేమీ వినదల్చుకోలేదు. ఆ రతీబెన్ ల్యాండ్ విషయంలో గొడవ జరిగినప్పటినుంచీ ఆ నీరవ్‌షా నీ మీద ఎంతో కోపంగా ఉన్నాడని నీకూ తెలుసు. మరి తెలిసి కూడా నువ్విలా ఒక్కడివే బయటకు ఎందుకొచ్చావ్? నీకేదైనా

అయితే"

ఎంత ప్రయత్నించినా వర్ధన్‌కి ఏడుపు ఆగలేదు.

రాంభాయ్ పరిస్థితి మరీ దారుణంగా ఉంది.

వర్ధన్ అన్నట్టు వాళ్లు రావడం ఒక్కక్షణం ఆలస్యమై ఉంటే ఈపాటికి విజేష్ ప్రాణం... ఆ ఆలోచనకే అతని శరీరం సన్నగా కంపించింది.

"సారీరా! నువ్వన్నట్టు ఇంకెప్పుడూ ఇలా ఒంటరిగా బయటికి రాను. సరేనా" వర్ధన్‌ను దగ్గరకు తీసుకుంటూ అన్నాడు విజేష్.

ఒక్కక్షణం ఎవ్వరూ మాట్లాడలేదు.

"థాంక్స్‌రా! సమయానికి వచ్చి నా ప్రాణం కాపాడారు. మీ రుణం ఎలా తీర్చుకోవాలో నాకు అర్థం కావడంలేదు" అంటుండగా విజేష్ స్వరం రుద్ధమైంది.

ఈ థాంక్స్ మాకు కాదన్నా మన సుశీలమ్మకి దక్కాలి"

"సుశీలకా? " ఆశ్చర్యపోయాడు విజేష్.

"అవునన్నా! మన సుశీలమ్మే మాకు ఫోన్ చేసి షా ఇంటికి వచ్చి బెదిరించాడని దాంతో నానమ్మ అప్‌సెట్ అయ్యిందని, ఇదంతా తెలిసి డాడీ చాలా ఆవేశంగా బయల్దేరబోతుంటే నాన్నమ్మ ఆపేసిందని, నానమ్మ నిద్రపోగానే డాడీ బయల్దేరారని సుశీలమ్మ చెప్పింది. అంతే నువ్వు ఆ షా దగ్గరికే బయల్దేరి వుంటావని వూహించి మేమిలా బయల్దేరి వచ్చాం" అసలు విషయం చెప్పాడు వర్ధన్.

విజేష్ పెదవుల మీద సన్నటి చిరునవ్వు విరిసింది.

ఇంట్లో అందరూ పడుకున్నారనుకుని తను బయల్దేరాడు. షా మీద కోపంతో వర్ధన్ వాళ్లకి ఫోన్ చేసి రమ్మనమని చెప్పాలన్న సంగతి కూడా మర్చిపోయాడు. కానీ తన కూతురు మాత్రం ఆ సంగతి గుర్తుపెట్టుకుని వాళ్లకి ఫోన్ చేసింది. ఈ రోజు తన ప్రాణం కాపాడింది.

ఒకరకంగా తన కూతురు తనకి పునర్జన్మనిచ్చిన దేవత అనుకున్నాడు విజేష్ మనసులో.



"ఇప్పుడు మీ నానమ్మగారికి ఎలా ఉంది? " అడిగాడు అహ్మద్.

"పర్వాలేదు" అని నిట్టూర్చిందోసారి. "శారీరక అనారోగ్యంకన్నా మానసిక ఆందోళన ఎక్కువగా ఉంది. అది తగ్గితేకానీ బి.పి కంట్రోలు కాదంటారు డాక్టర్‌గారు. కానీ ఆ ఆందోళన రోజురోజుకి పెరుగుతోందేకానీ తగ్గడంలేదు"

అహ్మద్ ఆమె వంక సానుభూతితో చూశాడు.

దాదాపు వారంరోజుల తర్వాత ఆ రోజే సుశీల కాలేజీకి వచ్చింది.

ఆ వారంరోజులు సుశీలను చూడలేకపోయినందుకు అహ్మద్ పడిన బాధ వర్ణనాతీతం. ఒకప్పుడు సుశీల ఇదేమాట అంటే ప్రేమంటే ఎదుటివ్యక్తి గురించి ఆలోచిస్తూ కాలాన్ని వృథా చేసుకోవడం కాదని చెప్పాడు. గంటలు గంటలు శూన్యంలోకి చూస్తూ కూర్చునేకన్నా జీవితంలో సక్సెస్ అయ్యేందుకు ప్రయత్నం చేసి ఉంటే




సంతోషించేవాడినన్నాడు.

చిరుజల్లును, చిగురుటాకులను, చిరుగాలులను నీ గురించి అడిగాను అని చెప్తే భావుకత అని కొట్టిపారేశాడు. ప్రాక్టికల్‌గా ఆలోచించమన్నాడు. కానీ ఇప్పుడు తనదాకా వచ్చేసరికి అర్థం అవుతోంది అతనికి.

"పోనీ మీ నానమ్మగారిని కొన్ని రోజులపాటు ఎక్కడికైనా పంపిస్తే?"

"ప్చ్... లాభంలేదు" పెదవి విరిచింది సుశీల.

"ఏం వెళ్లనంటారా?"

"అనరనుకో"

"మరి ఇంక సమస్యేముంది?"

"అత్తయ్య తప్ప మాకెవ్వరూ బంధువులు లేరు అహ్మద్" సుశీల గొంతులో కొంచెం విషాదం తొంగిచూసింది. "బంధువులంతా భూకంపం వచ్చినప్పుడు చనిపోయారని నానమ్మ చెప్తుంటుంది"

"ఐయామ్ సారీ సుశీలా. నాకీ విషయం తెలీక ఆ మాట అన్నాను"

"ఇందులో సారీ చెప్పాల్సినంత తప్పేం చేశావ్? నిజానికి నువ్వన్నది మంచి ఆలోచనే కాకపోతే మాకెవ్వరూ బంధువులు లేరు. ఒకవేళ ఉన్నా కూడా నానమ్మ వెళ్లేది కాదేమో. ఎందుకంటే ఆ షా వచ్చి బెదిరించినప్పటినుంచి నానమ్మ బాగా డిస్టర్బ్ అయ్యింది. డాడీకి ఎలాంటి ఆపద ఎదురవుతుందోనని భయపడుతోంది. డాక్టర్లేమో ఆందోళన తగ్గితే కానీ బి.పీ కంట్రోలవదు అని అంటున్నారు. కానీ నానమ్మ ఆ మాట విన్పించుకుంటేగా?"

"మీ డాడీమీద హత్యా ప్రయత్నం జరిగినట్టు మీ నానమ్మకి తెలుసా?"

"అమ్మో" భయంగా అంది సుశీల. అసలే పెద్దవైన ఆ కళ్లు భయంవల్ల కాబోలు మరింత విశాలమయ్యాయి. "ఇంకేమైనా ఉందా? ఈ సంగతి తెలిస్తే నానమ్మ అసలు తట్టుకోలేదు. తన కొడుకుని రక్షించుకోవడానికి వెళ్లి ఆ షాని చంపినా చంపేస్తుంది" ఆ ఊహకే అమ్మాయి శరీరం చిగురుటాకులా వణికింది.

గత వారం రోజులుగా జరిగిన సంఘటనలన్నీ ఆమెని బాగా కలవరపరిచాయి. నానమ్మని వదిలి రావడం ఇష్టంలేక వారం రోజులపాటు కాలేజీ మానేసింది. కానీ ప్రాక్టికల్స్‌కు తప్పక ఎటెండ్ అవ్వాల్సి రావడంతో కాలేజీకి వచ్చింది.

తండ్రిమీద హత్యా ప్రయత్నం జరిగిందని తెల్సినప్పటినుంచీ పైకి ధైర్యం నటిస్తోంది. గానీ లోపల మాత్రం ఆమె నాయనమ్మ కన్నా ఎక్కువగా ఆందోళన పడుతోంది. ఇదంతా ఎవరికైనా చెప్పుకుని సేదతీరాలనుంది ఆమెకి. కానీ తండ్రి తన మీద జరిగిన హత్యాప్రయత్నం గురించి ఎవ్వరికీ ముఖ్యంగా నానమ్మకి తెలీకూడదని ఆమె నుంచి వాగ్దానం తీసుకున్నాడు.

పోనీ తల్లికి చెప్దామా అంటే ఆవిడా ఊరుకోదు. ఈ విషయం వినగానే వెంటనే వెళ్లి అత్తగారికి చెప్పేస్తుంది.

అందుకే అహ్మద్ దగ్గర తన మనసులో భారాన్ని దించేసుకుంది సుశీల. ఇప్పుడామె మనసుకి చాలా తేలికగా ఉంది.

"సుశీలా! ఇదంతా వింటుంటే నాకు చాలా బాధగా ఉంది. బట్ మంచివాళ్లకి దేవుడెప్పుడూ అన్యాయం చేయడు. మీ నానమ్మగారికిగానీ మీ డాడీకి గానీ ఏమీ కాదు. మీ నానమ్మగారిని నేను చూడకపోయినా నువ్వు చెప్పేదాన్నిబట్టి ఆవిడ ఎంతో మంచివారని అర్థం అవుతోంది. కలలో కూడా ఎవ్వరికీ అపకారం తలపెట్టని మనిషి మీ నానమ్మ. అలాంటి ఆవిడ మీద అల్లా మరింత దయచూపిస్తాడు" ధైర్యం చెప్పాడు అహ్మద్.

కూతుర్ని కాలేజీనుంచి తీసుకువెడదామని కాలేజీకి వచ్చిన విజేష్‌కి సుశీల, అహ్మద్‌లు సన్నిహితంగా కూర్చుని మాట్లాడుకోవడం కంటపడింది.

ముందు ఈ రోజుల్లో అదంతా మామూ



లేకదా అనుకున్నాడు.

అమ్మాయి, అబ్బాయి మధ్య స్నేహం, వారు కలిసి తిరగడాలు సహజమేగా అని సరిపెట్టుకోవాలనుకున్నాడు.

కానీ అతని మనసు మాత్రం అందుకు సమాధానపడలేదు.

వారిద్దరి మధ్య ఉన్నది స్నేహం కాదని, స్నేహం దాటి ప్రేమ ప్రాంగణంలోకి అడుగు పెట్టిందన్న సంగతి వారిద్దరి సాన్నిహిత్యాన్ని చూసిన వారెవరికైనా అర్థమవుతుంది.

ఒకపక్క మేనత్త కొడుకుతో పెళ్లి నిశ్చయమయ్యింది. మరోపక్క మరో అబ్బాయితో కూతురు సన్నిహితంగా మెలుగుతోంది. ఆ దృశ్యం అతనిలో ఆగ్రహం కల్గిస్తోంది. కానీ వయసు, అనుభవం మాత్రం ఆవేశపడటానికి ఇది తగిన సమయం కాదని హెచ్చరిస్తున్నాయి. నిదానంగా ఆచితూచి అడుగు వెయ్యమంటున్నాయి.

అంతే! నీరవ్‌షా కన్నా అతని ముందున్న పెద్ద సమస్య సుశీల.

వెంటనే వర్ధన్‌ని పిలిపించాడు.

వర్ధన్ మీద విజేష్‌కి ఎంతో నమ్మకం ఉంది. అందుకే చేయాల్సిన పనేమిటో వివరంగా చెప్పాడు.

ముందుగా సుశీల, అతను కేవలం స్నేహితులా! లేక అంతకన్నా ఎక్కువా! అది తెలియాలని చెప్పాడు.

అతని వివరాలు సేకరించమని చెప్పాడు.

అతను ఎంత గొప్పవాడైనా కానీ ఆఖరికి దేశ ప్రధాని కొడుకైనా విజేష్‌కి లెక్కలేదు.

అతని ఆశ, ఆశయం చెల్లెలి కొడుకు దినేష్‌తో కూతురి పెళ్లి జరిపించడమే.

ప్రస్తుతం అతని ప్రయారిటీస్‌లో అన్నింటికన్నా పైన ఉన్నది దినేష్, సుశీలల వివాహమే.

★ ★ ★

ఆరోజు రతీబెన్ గోవిందా నిద్రలేచేసరికి ఉదయం ఏడు గంటలు దాటింది.

ఆ సమయానికి ఆవిడ ఇంటిముందు చాల హడావుడిగా వుంది.

రణగొణధ్వనులు, గొడవలు, గలాభా అంటే ఆవిడకు చాలా చిరాకు. ప్రశాంతంగా ఉండటం ఆవిడకు ఇష్టం.

విజేష్ రతీబెన్ గోవిందాకు నెల రోజులు టైం ఇచ్చాడు. ఈలోపున ఆవిడ వేరే ఇల్లు చూసుకుని ఈ ఇల్లు విజేష్‌కు అప్పగించాల్సి ఉంది. అందువల్ల ఆవిడ ఇంకా అక్కడే ఉంటోంది. అంత పెద్ద ఇంట్లో పనిపిల్లను తోడు పెట్టుకుని ఒక్కత్తే ఉంటుంది. అందుకే ఆ ఇంట్లో మనుష్యులున్న అలికిడే ఉండదు.

"అమ్మగారూ" పనిపిల్ల పరిగెత్తుకుంటూ వచ్చింది.

"ఏమిటే ఏమిటీ హడావుడి? అక్కడ అంత మంది గుమిగూడారేమిటే! అసలు వాళ్లందరినీ లోపలికి ఎందుకు రానిచ్చావ్? " కేకలేసింది రతీబెన్.

"నేను నేను రానివ్వలేదమ్మా!" భయంతో గుటకలు మింగింది పనిపిల్ల.

"మరి... మరి ఎవరు రానిచ్చారు? " రతీబెన్ గొంతులో ఆగ్రహం తొంగిచూసింది.

"ఆళ్లే వచ్చారమ్మా!"

"ఎందుకు"

"అమ్మగారూ! మరి అక్కడ మనింటి ఆవరణలో 'అమ్మోరు' వెలిసినారమ్మా" తను చెప్పాలనుకున్నది చెప్పి తేలికగా ఊపిరి పీల్చుకుంది.

"ఏమిటీ అమ్మవారు వెలిశారా? " ఆవిడ స్థాణువైపోయింది.

నిన్న రాత్రిదాకా లేనిది తెల్లారేసరికి అమ్మవారు వెలవడమేమిటో ఆవిడకేమీ అర్థం కాలేదు.

గబగబా స్నానం చేసి రతీబెన్ బయటకు వచ్చింది.

అక్కడంతా జాతరలా ఉంది.

జనం తండోపతండాలుగా వచ్చేస్తున్నారు.

రతీబెన్ ఎలాగోలా సందు చేసుకుని





వెళ్ళి చూసింది. నిన్నటిదాకా ఉన్న కొండ మీద అమ్మవారి ఆకారం గీసి వెండి కళ్ళు పెట్టినట్టున్నాయి.

అప్పుడే అక్కడో పూజారి, హుండీ అన్నీ వెలిశాయి.

జనం భక్తిగా కళ్ళు మూసుకుని పారవశ్యంలో తేలిపోతున్నారు.

రతీబెన్‌ను చూసిన పూజారి ఆనందంగా ఆహ్వానించాడు. "రండమ్మా! రండి! మీరు చాలా అదృష్టవంతులు కనకనే మీ స్థలంలో అమ్మవారు వెలిశారు. ఆవిడ కృపాకటాక్షవీక్షణాలు మీమీద పుష్కలంగా ఉంటాయి. రండమ్మా వచ్చి తీర్థప్రసాదాలు తీసుకోండి" రతీబెన్ అన్యమనస్కంగానే నమస్కరించి తీర్థంప్రసాదం తీసుకుని ఇవతలకు వచ్చింది.

జరుగుతున్న సంఘటనలకు ఎలా రియాక్ట్ కావాలో ఆవిడకు అర్థం కావడం లేదు. నిజంగా అమ్మవారు వెలిశారా? లేక ఇదంతా ఎవరైనా కావాలని చేస్తున్నారా?

ఆవిడ మనసు చాలా అస్థిమితంగా ఉంది.

ఈ విషయం తెలిస్తే విజేష్ ఎలా రియాక్ట్ అవుతాడన్నది ప్రస్తుతం ఆమె ముందున్న మిలియన్ డాలర్ల ప్రశ్న.

★ ★ ★

"అన్నా చాలా ఘోరం జరిగిపోయిందన్నా! ఆ నీరవ్‌షా మనస్థలం కొట్టేయడానికి చాలా పెద్ద ప్లాన్ వేశాడన్నా" వసంత్ పరిగెత్తుకుంటూ వచ్చాడు.

అతను చెప్తున్నదేమిటో విజేష్‌కి ఎంత మాత్రం అర్థం కాలేదు.

వసంత్‌ని చూసేసరికి రాంభాయ్ ముఖం మారిపోయింది.

రతీబెన్ స్థలంలో అమ్మవారు వెలిసిన సంగతి గురించి, అక్కడ జనసందోహం గురించి పూసగుచ్చినట్టుగా చెప్పాడు.

వసంత్ చెప్పింది వినేసరికి విజేష్‌కి ఎలా రియాక్ట్ కావాలో అర్థం కాలేదు.

ఆవేశంతో అతని ముఖం ఎర్రబడింది. కానీ తన ఆవేశాన్ని కంట్రోలు చేసుకున్నాడు. అతన్నలా చూస్తుంటే వర్ధన్, రాంభాయ్‌లకు ఖంగారుగా ఉంది.

వసంత్ చెప్పింది విన్నాక అతనలా కామ్‌గా, తన ఫీలింగ్స్‌ని కంట్రోలు చేసుకోడానికి ప్రయత్నిస్తుండటం వాళ్ళిద్దరికీ భయాన్ని కల్గిస్తోంది.

విజేష్‌ని చూస్తుంటే వారికి తుఫాన్ ముందు ప్రశాంతత గుర్తుకు వచ్చింది.

"వర్ధన్! నువ్వు నా వెంటరా. రాంభాయ్ నువ్వు అన్నని చూసుకో. ఆ షాకి ఎలా బుద్ధి చెప్పాలో నాకు తెలుసు" అన్నాడు వసంత్.

వర్ధన్ విజేష్ వైపు చూశాడు.

అతనేమీ మాట్లాడక పోవడంతో మౌనం అంగీకారంగా భావించి వసంత్ వెంట నడిచాడు.

"వద్దు అతనితో వెళ్ళద్దు" అని రాంభాయ్ అందామనుకున్నాడు. అన్నాననే అనుకున్నాడు కానీ మాటలు మాత్రం బయటకి రాలేదు. అందుకే వాళ్ళు వెళ్తుంటే శిలా ప్రతిమలా నిలబడి చూస్తుండిపోయాడు.

★ ★ ★

వర్ధన్, వసంత్‌లు రతీబెన్ ఇంటికి వెళ్ళేసరికి అక్కడ జనం బారులు తీరి కన్పించారు. అప్పుడే అక్కడ చిన్నచిన్న అంగళ్ళు వెలిశాయి.

అమ్మవారి మహిమ గురించి జనం కథలు కథలుగా చెప్పుకుంటున్నారు.

"రేయ్! ఏం. జరుగుతోందిరా ఇక్కడ? మీ అందరికి అయిదే నిముషాలు టైం ఇస్తున్నాను. ఇక్కడినుంచి వెళ్ళిపోవాలి. లేదంటే మీ శాల్తీలు గల్లంతైపోతాయి" వసంత్ మాట పూర్తికాకముందే ఓ భక్తుడు రాయి విసిరేశాడు. అది సూటిగా వచ్చి వసంత్ నుదుటికి తగిలింది.

"మేం కాదురా వెళ్లాల్సింది. నువ్వు నీ వాళ్లూనూ. లేదంటే మీ శాల్తీలే గల్లంతై



పోతాయి"

"ఏంట్రా వాగుతున్నావ్? ఈ వసంత్‌ని అంత మాటంటావా?" అంటూ అతని కాలర్ పట్టుకున్నాడు. "నాకు తెలుసురా. మీరంతా ఎవరు పంపితే వచ్చారో నాకు తెలుసు. మర్యాదగా అమ్మోరి నాటకం ఆపేసి మీ బిచాణా అంతా సర్దేయండి"

"తప్పు బాబూ అలా అనకూడదు" అంటూ వచ్చాడు పూజారి.

"తప్పా ఎవరిది తప్పో తెలుస్తూనే ఉంది. సైట్ తనది కాలేదని మీ బాస్ ఈ నాటకం మొదలు పెట్టాడన్నమాట. చూడండి దొంగ పూజారిగారూ! వెళ్లి మీ బాస్‌కు చెప్పండి ధైర్యముంటే, దమ్ముంటే డైరెక్టుగా తలపడాలే గాని ఇలాంటి చీప్ ట్రిక్కులు ప్రయోగించద్దని చెప్పండి. మీ భక్తులను తీసుకుని ఈ నాటకానికి తెరదించి ఇక్కడ్నించి వెళ్లిపొండి. లేదంటే" అని వెనక్కి తిరిగి "రేయ్! రండ్రా" అని అరిచాడు.

దాదాపు ఇరవైమంది యువకులు చేతిలో ఆయుధాలతో సిద్ధమయ్యారు.

అదంతా చూస్తుంటే వసంత్ గొడవని పెంచడానికి వచ్చాడేమోనన్పించింది వర్ధన్‌కు.

"అన్నా ఈ గొడవని ఇంతటితో ఆపేయ్. విజేష్ అన్న చూసుకుంటాడు. దయచేసి ప్రాబ్లమ్‌ని మరీ పెంచకు" రిక్వెస్టింగ్‌గా అన్నాడు వర్ధన్.

విజేష్‌కి చెప్పకుండా ఇలా రాకుండా ఉండాల్సిందన్పించసాగింది అతనికి.

"నువ్వుండు వర్ధన్! వీళ్లని ఎలా బయటకు పంపాలో నాకు బాగా తెలుసు. వీళ్లలాంటి వాళ్లని నా జీవితంలో ఎంతోమందిని చూశాను. అవతల వాళ్లు విసిరేసే పైసలకు ఆశపడి వాళ్లు చెప్పినట్టల్లా ఆడతారు. మనం భయపడ్డామా వాళ్లలా మొరుగుతూనే ఉంటారు. నువ్వెళ్లి అలా నిలబడు. మిగిలినదంతా నేను చూసుకుంటాను" అని తన మనుష్యులవైపు తిరిగి అన్నాడు. "ఒక్కొక్కర్నీ ఈడ్చి అవతల పారేయండి. ఎవరడ్డం వస్తారో చూస్తాను.

"బాబూ నేను చెప్పేది వినండి. మీకూ మీకూ గొడవలేవైనా ఉంటే బయటకెళ్లి చూసుకోండి" అతని మాటలు పూర్తికాకుండా వసంత్ మనుషులు పూజారిని బయటకు ఈడ్చుకెళ్లసాగారు. దాంతో అక్కడున్న భక్తులలో ఆవేశం పెల్లుబికింది.

చేతికి ఏది అందితే దాంతో ఎదురుతిరిగారు.

దెబ్బలు తగిలిన వారి హాహాకారాలు, ప్రాణభయంతో పరుగులు తీస్తున్న భక్తుల హాహాకారాలతో ఆ ప్రాంతమంతా హోరెత్తిపోయింది.

వర్ధన్ మాత్రం ఏం చేయాలో అర్థంకానట్టుగా నిలబడిపోయాడు.

అంతలో ఒక వైపునుంచి పోలీసులు, మరోవైపునుంచి అంబులెన్స్ వచ్చి ఆగాయి. పోలీసులను చూసి అక్కడున్న వారిలో చాలామంది పరుగులు తీశారు. వర్ధన్, వసంత్ మరికొందరిని పోలీసులు వాన్ ఎక్కించారు.

★ ★ ★

"హ్హా...హ్హా...హ్హా..." చాలారోజుల తర్వాత నీరవ్‌షా గట్టిగా నవ్వాడు.

"రెండు కోట్లు... అక్షరాలా రెండు కోట్లు పెట్టి కొన్న స్థలంలో ఇప్పుడా విజేష్ అమ్మవారి గుడి కట్టిస్తాడన్నమాట" తలుచుకుంటుంటే షాకి ఎంతో సంతోషంగా ఉంది.

"నువ్వు చెప్తున్నదేమిటో నాకు అర్థం కావడంలేదన్నా" అన్నాడు దేశాయ్.

"ఆరోజు రతీబెన్ సైట్ మనం తీసుకోలేకపోయామని చాలా ఫీలయ్యాం గుర్తుందా'

గుర్తుందన్నట్టు తలాడించాడు దేశాయ్.

"అయితే ఇప్పుడేమైందన్నా" ఆత్రుతపడ్డాడు బిక్కూ.

"ఆ స్థలంలో అమ్మవారు వెలిశారు"

"అయితే మంచిదేగా అన్నా" అన్నాడు దేశాయ్.




ఎంతో పుణ్యం చేసుకుని ఉండాలి అంతటి భాగ్యం పట్టడానికన్నది దేశాయ్ అభిప్రాయం.

"మంచిదే తమ్ముడూ! కానీ ఆ సైట్ మీద మనవాడు చాలా ఆశలు పెట్టుకున్నాడే. నాకు పోటీగా అక్కడో ఆకాశ హర్మ్యం కట్టాలని ఎంతో ఉబలాటపడ్డాడు కూడా. కానీ ఇప్పుడా ప్లాన్స్ అన్నీ తల్లకిందులయ్యాయి. అక్కడ అమ్మవారు వెలిసిందిట. భక్తులు తండోపతండాలుగా వస్తున్నారు. ఓ చిన్న సైజు జాతరని తలపిస్తోంది అక్కడి వాతావరణం. ఇదంతా ఏంటని అడగడానికి వెళ్లిన వర్ధన్‌ని అతని మనుషుల్ని భక్తులంతా చితకతన్నారట. పోలీసులొచ్చి వాళ్లని తీసుకుపోయారు. అమ్మవార్ని అక్కడ్నించి ఏమాత్రం కదిపినా తలలు పుచ్చకాయల్లా ఎగిరిపోతాయంటున్నారు భక్తులంతా. అంతేకాదు అక్కడ అమ్మవారికి గుడి కట్టించేందుకు అప్పుడే ఏర్పాట్లు కూడా జరుగుతున్నాయి. సో! విజేష్ ఇప్పుడు అక్కడ అమ్మవారి గుడి తప్ప మరేం కట్టినా భక్తులు ఊరుకోరు" జరిగినదంతా వివరించాడు నీరవ్‌షా.

"ఫోన్ ఇదిగోనన్నా! చెయ్యి ఆ విజేష్‌కి ఫోన్ చేసి మనమెంతో హాపీగా ఉన్నామని చెప్పు" ఫోన్ అందించాడు బిక్కూ.

"అవునన్నా! ఫోన్ చెయ్యి" ఉత్సాహంగా అన్నాడు చందు.

"బిక్కూ నెంబర్ చెప్తుంటే చందు ఫోన్ తీసుకుని డయల్ చేశాడు.

వర్ధన్, వసంత్‌లను విడిపించడానికి పోలీసుస్టేషన్‌కు వెళ్తుండగా ఫోన్ రింగయ్యింది. షా తరచూ నెంబర్ మారుస్తుంటాడు కాబట్టి ఫోన్ చేసింది షా అని విజేష్ గుర్తించలేకపోయాడు.

రెండుసార్లు రింగయ్యాక ఫోన్ లిఫ్ట్ చేశాడు విజేష్.

"అన్నా! ఇదిగో మాట్లాడు" అంటూ ఫోన్ షా చేతికిచ్చాడు చందు.

ఫోన్ తీసుకున్నాడు షా.

"హల్లో! నమస్తే అన్నా! మంచిగున్నావా"

"ఎవరు మాట్లాడేది? " విజేష్ గొంతులో చికాకు స్పష్టంగా వ్యక్తమైంది.

"నేనన్నా! గుర్తుపట్టలేదా? " కావాలని అతన్ని ఏడ్పించడానికి షా గొంతు మార్చి మాట్లాడాడు.

"నేను అనేది నీ పేరైతే ఆ పేరుగల వాళ్లు నాకెవ్వరూ తెలీదు. లేదూ నీకో పేరుంటే అదేంటో చెప్తే నువ్వు తెలుసో లేదో చెప్తాను"

"ఏంటన్నా ఇది! ఎవరినైనా మర్చిపోవచ్చుకాని శత్రువుని మరవచ్చా తప్పుకాదూ. సర్లే నువ్వసలే పరేషాన్ అవుతున్నావ్, నిన్నింకా ఇబ్బంది పెట్టడం భావ్యంకాదు గానీ నా పేరు చెప్పేస్తాన్లే! నన్ను నీరవ్‌షా అంటారు"

"ఎందుకు ఫోన్ చేశావ్? " షా పేరు వినగానే విజేష్ గొంతు మారిపోయింది.

"నా సహాయం ఏమైనా కావాలేమో కనుక్కుందామని. ఎంతైనా నాకన్నా అనుభవం తక్కువకదా! ఈ సమస్యల్లోంచి బయటపడటానికి నన్నేమైనా హెల్ప్ చేయమంటావేమో అడగడానికి ఫోన్ చేశాను"

"అవసరంలేదు. నీ నటన ఇంకెవరి దగ్గరైనా ప్రదర్శించు. మెచ్చుకుని అవార్డులిస్తారు. చూడు షా! నీకు ధైర్యముంటే నాతో డైరెక్టుగా పోటీపడు. అంతేకానీ ఇలా అమాయక ప్రజల భక్తి, విశ్వాసాలతో మాత్రం ఆడుకోకు.

నువ్వన్నట్టు నీకన్నా నాకు అనుభవం తక్కువే కానీ నువ్వు మా ఇంటికి వచ్చి మరీ చెప్పావుగా నాకు నీకన్నా బుర్ర ఎక్కువని. దాంతోనే నా సమస్యని సాల్వ్ చేసుకుంటాను" అని ఫోన్ ఆఫ్ చేశాడు విజేష్.

విజేష్ మాటలకు షా విస్తుపోయాడు.

"ఏమన్నాడన్నా" కూతుహలంగా అడిగాడు చందు.

దేశాయ్ బిక్కులు కూడా విజేష్ ఏమన్నాడో తెలుసుకునేందుకు ఆరాటపడ్తు

న్నారు.

"ఒరేయ్ నేనో విషయం అడుగుతాను మీరు నిజం చెప్పాలి"

"అడుగన్నా" ముగ్గురూ ఒకేసారి కోరస్గా అన్నారు.

"ఈ పని అదే విజేష్ కొన్న స్థలంలో అమ్మవారు వెలపడంలో మీ పాత్రేం లేదు కదా" వాళ్లవంక నిశితంగా చూస్తూ అడిగాడు షా.

"మా పాత్రా! మేమేం చేశామన్నా! కొంప తీసి అమ్మవార్ని మేమే సృష్టించామని ఆ విజేష్ అన్నాడా ఏంటి? "

"రేయ్ చందూ! నేనో ప్రశ్న అడిగితే అవునో కాదో సమాధానం చెప్పకుండా తిరిగి నన్నే ప్రశ్నిస్తావేంటి? ముందు నేను అడిగినదానికి జవాబు చెప్పండి. ఒకవేళ మీరుకానీ ఆ పని చేసుంటే ముందే ఒప్పుకోండి. ఏదో తెలీక చేశారని క్షమించేస్తాను. మనం నోరిప్పకపోతే అన్నకి ఎలా తెలుస్తుందని మాత్రం అనుకోకండి. మీ అంతట మీరు చెప్పకుండా నాకు నేనుగా తెలుసుకున్నాననుకో పరిణామాలు చాలా తీవ్రంగా ఉంటాయి" షా మాటలలో బుజ్జగింపు, హెచ్చరింపు రెండూ వ్యక్తమయ్యాయి.

"ఏంటన్నా! నువ్వు మమ్మల్నే అనుమానిస్తున్నావా? " అప్పటికే బిక్కు కళ్లు నీళ్లతో నిండిపోయాయి. నీకు చెప్పకుండా మేము ఏనాడన్నా కాలు బయట పెట్టామా? ఒక్క పని ఒక్కటంటే ఒక్కపనైనా నీకు చెప్పకుండా చేశామా? నువ్వు ఊళ్లో లేకపోయినా నీకు ఫోన్ చేసి నువ్వు ఊ అంటే కదా మేము ముందు కడుగు వేసేది. అలాంటిది విజేష్ ఈ రోజు ఏదో అన్నాడని..." ఆపైన ఇక మాట్లాడలేకపోయాడు.

అప్పటికి గానీ షాకి తను చేసిన పొరపాటు ఏమిటన్నది అర్థం కాలేదు. అంతే వెంటనే లేచి బిక్కూని దగ్గరకు తీసుకున్నాడు. "సారీరా. నేనే పొరపడ్డాను. ఆ విజేష్ ఈ గొడవంతటికి నేనే కారణమని అనేసరికి మీరేమైనా నాకు తెలీకుండా ఈ పని చేశారేమోనని అడిగానంతే! వదిలెయ్"

"ఏంటన్నా నువ్వు చెప్పేది ఈ గొడవకి మనం కారణమన్నాడా? " అడిగాడు దేశాయ్.

"అవునురా. అదే నాకూ అర్థం కావడం లేదు. రతీబెన్ గోవిందా స్థలంలో మనమే అమ్మవారిని సృష్టించామని అతననుకుంటున్నాడు. నా జీవితంలో ఇంతవరకు నేనెప్పుడూ అలాంటి పన్లు చెయ్యలేదు. మన్ని పుట్టించిన దేవుడితో ఆటలాడతామా?

ఆయన్ని అడ్డుపెట్టుకుని పాడుపనులు చేస్తామా చెప్పు..."

అక్కడున్నవారెవ్వరూ మాట్లాడలేదు.

ఒక్కక్షణం తర్వాత "అన్నా! నీకీ సంగతి ఎవరు చెప్పారు? " అడిగాడు చందూ.

"ఏ సంగతిరా? "

"అదేనన్నా! రతీబెన్ స్థలంలో అమ్మవారు వెలిశారన్న సంగతి..."

"అదా! మన మిత్రుడు వసంత్‌భయ్యా ఫోన్‌చేసి చెప్పాడు. నిన్ను కాదన్నందుకు ఆ రతీబెన్‌కు, నీతో పోటీపడినందుకు ఆ విజేష్‌కు తగిన శాస్తి జరిగిందంటూ జరిగినదంతా చెప్పుకొచ్చాడు" చెప్పాడు షా.

వసంత్‌పేరు అక్కడ ఎవ్వరికీ కొరుకుడు పడలేదు.

ఆరోజు విజేష్ షా పేరుతో రతీబెన్ గోవిందాకు ఫోన్‌చేశాడన్న సంగతి కూడా వసంత్ ఫోన్‌చేసి చెప్పాడు. అసలు ఈ విషయం వసంత్‌కి ఎలా తెలిసింది. విజేష్ చెప్పే అవకాశంలేదు. విజేష్ తాలూకు వ్యక్తులు ఎవరైనా చెప్పి ఉంటారా? విజేష్ గ్రూపులో రాంభాయ్, వర్ధన్ ముఖ్యులు. వాళ్ళిద్దరూ ప్రాణంపోయినా విజేష్‌కి ద్రోహం చేయరు. మరి...? వసంత్ డబుల్ గేమ్ ఆడుతున్నాడా?

చందూ ఎటూ తేల్చుకోలేకపోయాడు.

అతను తన అనుమానాలు, సందేహాలు అన్నీ నీరవ్‌షా ముందు బయటపెట్టుంటే





ఈ కథ ఎలా ఉండేదో కానీ అతనలా చేయకపోవడం భవిష్యత్తులో చాలా అనర్థాలకు దారితీసింది.

★ ★ ★

విజేష్ షాను ఎలా దెబ్బకొట్టాలా అని తీవ్రంగా ఆలోచిస్తున్నాడు.

చాలాసేపు దాని గురించే ఆలోచిస్తుండిపోయాడు.

అసలు తన పేరు వాడుకుని సైట్ పొందిన సంగతి షాకి ఎలా తెలిసింది?

ఈ సంగతి తనకు, వర్ధన్, రాంభాయ్ లకు మాత్రమే తెలుసు. వారిద్దరూ ప్రాణం పోయినా ఈ విషయాన్ని బయటపెట్టరు. మరి వసంత్?

అవును అతని ద్వారానే మ్యాటర్ లీక్ అయివుండవచ్చు కాని అతను ఈ పని చేస్తాడా?

చాలాసేపటివరకూ విజేష్ ఆలోచిస్తూనే ఉన్నాడు.

★ ★ ★

స్మృతి అపార్ట్‌మెంట్స్ అన్న బోర్డు ఎంతో హుందాగా నిలబడి స్వాగతం ఇస్తున్నట్టుగా ఉంది.

'స్మృతి' గురించి చెప్పేముందు మనం కొంచెం గతంలోకి వెళ్లాలి.

ఒకప్పుడు గుజరాత్‌లో వచ్చిన భయంకర భూకంపం కారణంగా అపార్ట్‌మెంట్స్ నిర్మాణం గణనీయంగా తగ్గింది.

అప్పట్లో కూలిన భవనాలు కూలగా మిగిలిన భవనాలలో నివసించడానికి ఎవ్వరూ ముందుకి రాలేదు. భవనాలలో ఉండకపోయినా ఫర్వాలేదుగానీ ప్రాణాలుంటే చాలనే నిర్ణయానికి వచ్చేశారు అంతా. పాకలో, లేదంటే గుడారంలో ఉండటానికైనా జనం సిద్ధపడ్డారు కానీ అపార్ట్‌మెంట్‌లు ఊరికే ఇస్తామన్నా ఎవ్వరూ దానివంక కూడా చూడలేదు.

ఆకాశహర్మ్యాలపట్ల ఎప్పుడైతే ప్రజల నమ్మకం చెదిరిపోయిందో అప్పటినుంచి వాటి నిర్మాణం దాదాపుగా ఆగిపోయిందనే చెప్పాలి.

అలాంటిది ఇప్పుడు నీరవ్‌షా తిరిగి అపార్ట్‌మెంట్స్‌కు శ్రీకారం చుట్టాడు.

భూకంపం వచ్చి చాలా ఏళ్ళు అవుతుండటంతో జనం కూడా ఆనాటి చేదు జ్ఞాపకాలనుంచి చాలావరకు బయటపడ్డారు.

డబ్బుకన్నా ప్రాణం ముఖ్యమనుకున్న జనం నేడు ఉన్న స్థలాన్నో, ఇంటినో అపార్ట్‌మెంట్స్ కన్‌స్ట్రక్షన్‌కు ఇచ్చేసి సొమ్ము చేసుకోవాలనుకుంటున్నారు.

భూకంప సమయంలో జరిగిన విధ్వంసం తాలూకు ప్రభావంనుంచి జనం చాలావరకు తేరుకున్నారు. మళ్ళీ అపార్ట్‌మెంట్స్ పట్ల మక్కువ మొదలైంది.

ఏ వ్యాపారంలోనైనా ఫోర్‌కాస్టింగ్ అనేది చాలా ప్రభావం చూపుతుంది. నిజానికి దానిని రియల్ఎస్టేట్స్ వ్యాపారస్థులుకన్నా ఫ్యాషన్ డిజైనర్స్ ఎక్కువగా ఉపయోగిస్తారు. కానీ నీరవ్‌షా మాత్రం తన రియల్ ఎస్టేట్స్ వ్యాపారానికి దీనిని వర్తింపచేశాడు. ఎప్పటికప్పుడు మారిపోయే జనం ఆలోచనలు అర్థంచేసుకుని ఆవిధంగా ఇళ్ళు నిర్మిస్తుంటాడు షా. అతని విజయరహస్యాలలో ఇది కూడా ఒకటని చెప్పచ్చు

అందుకే స్మృతి అపార్ట్‌మెంట్స్‌కి శంఖుస్థాపన చేశాడు.

అతి తక్కువ ధరకు ఇంద్రభవనాన్ని తలపించే రీతిలో అపార్ట్‌మెంట్ ఇస్తారనేసరికి జనం ఎగబడ్డారు.

పది అంతస్థులతో, 4 టవర్లలో ఒక్కొక్క టవర్లో 40 ఫ్లాట్స్‌తో స్మృతి రూపుదిద్దుకుంటోంది.

స్మృతి నిర్మాణంకోసం ఎంతోమంది ఇంజనీర్లతో సంప్రదింపులు జరిపిన మీదట ఆనంద్‌స్వరూప్‌ని ఎన్నుకున్నారు. ఇప్పుడతని పర్యవేక్షణలోనే స్మృతి నిర్మాణం జరగబోతోంది.

స్మృతి ఒకరకంగా షా డ్రీమ్ ప్రాజెక్ట్

అని చెప్పచ్చు

భూకంపం వచ్చినా తట్టుకుని నిలబడగల టెక్నాలజీతో నిర్మించేందుకు సిద్ధమైన షా భవన నిర్మాణానికయ్యే ఖర్చు గురించి ఆలోచించడంలేదు. తాను రేపు ఈ వ్యాపారం వదిలేసినా తను సగర్వంగా చెప్పుకునేలా స్మృతి నిర్మాణం జరగబో తోంది.

ఎన్నిపనులున్నా అవన్నీ పక్కనపెట్టి రోజులో కొంతసేపైనా నీరవ్‌షా స్మృతి దగ్గర గడుపుతాడు... అంత ప్రేమ అత నికా భవనంపైన.

★ ★ ★

"ఆనంద్‌స్వరూప్ అంటే...? "

"నేనేనండీ..." వచ్చిన వ్యక్తి ఎవరో తనకు తెలీకపోయినా గుమ్మందాక వచ్చిన వ్యక్తిని లోపలికి ఆహ్వానించడం మర్యాద కాబట్టి అడ్డు తొలుగుతూ

"లోపలికి రండి" అన్నాడు.

వచ్చినవాళ్ళు లోపలికి నడిచారు.

ఆనంద్‌స్వరూప్ ఓ స్ట్రక్చరల్ ఇంజనీరు. దాదాపు యాభై ఏళ్ళుంటాయి. నీతినిజాయి తీలు ఉన్నవాడు కావడంతో మొదట్లో చాలా ఇబ్బందులు పడ్డాడు. గుజరాత్‌లో స్ట్రక్చరల్ ఇంజనీర్లకు అప్పట్లో డిమాండ్ చాలా తక్కువగా ఉండేది. అదీగాక ఆనంద్ స్వరూప్ డిక్షనరీలో ఎంత వెతికినా రాజీ అన్నమాట మాత్రం కన్పించదు.

ఏ బిల్డర్ అయినా తాను తక్కువ ఖర్చు పెట్టి ఎక్కువ లాభాలు పొందాలనుకుం టాడు. అలాంటప్పుడు భవన నిర్మాణంలో నాణ్యత విషయంలో రాజీపడక తప్పదు. అలాంటి వారికీ అవకాశాలొస్తాయి. కానీ భవనం అంటే రాళ్ళు, ఇటుకలు, సిమెంటే కాదు. మనుష్యుల కోరికల రూపం అది. ఎక్కడోతప్ప చాలామంది జీవితకాలంలో కూడబెట్టినదంతా ఖర్చుపెట్టి తమకంటూ ఓ సొంత గూడు ఏర్పరుచుకోవాలనుకుంటారు. అన్నింటినీ మించి ఇల్లంటే ప్రకృతి వైపరీత్యా లనుంచి తమ ప్రాణాలకు రక్షణ కల్పిస్తుం దని భావిస్తారు. నాణ్యత విషయంలో రాజీ పడి ప్రజల ప్రాణాలతో చెలగాటమాడటం, వారి కోరికలు, ఆశలు నేలరాల్చటం ఆనంద్ స్వరూప్ విషయంలో చాలా పెద్ద పాపం. ఏ ఇంజనీరు అలాంటివాటికి సిద్ధపడకూడదం టాడు. ఇంజనీరన్నవాడు ఆకలితో చచ్చిపో యినా ఫర్వాలేదుగానీ కేవలం తన ఒక్కడి ఆకలి తీర్చుకోవడం కోసం ఎంతోమంది ప్రాణాలు బలితీసుకోకూడదన్నది అతని సిద్ధాంతం. అందుకే చాలామంది అతనికే దైనా ప్రాజెక్టు అప్పజెప్పాలంటే వెనకాడతారు.

ఎప్పుడైతే భూకంపం వచ్చి భవనాలన్నీ పేకమేడల్లా కూలిపోయాయో అప్పుడు వాటి నిర్మాణంలో చోటుచేసుకున్న అవకతవకలు బయటపడ్డాయి. దాంతో నాణ్యత విష యంలో రాజీకి ఒప్పుకోని ఆనంద్‌స్వరూప్ వంటి ఇంజనీర్లకు డిమాండ్ పెరిగింది.

"మీరు కూర్చోండి..." అంతవరకు నిల బడి ఉన్న ఆనంద్ స్వరూప్‌ని ఉద్దేశించి అన్నాడు.

"సర్! మీరు..."

"నా పేరు విజేష్..."

ఆ పేరు వినగానే ఆనంద్ స్వరూప్ ముఖంలో ఆశ్చర్యం కొట్టొచ్చినట్టు కనబ డింది.

"చెప్పండి సర్! మీ పేరు విన్నాను. మిమ్మల్ని చూడటం ఇదే మొదటిసారి. అందుకే ఎవరనేది పోల్చుకోలేకపోయాను" ఒకరకమైన ఎక్సైట్‌మెంట్‌తో అన్నాడు.

రియల్ ఎస్టేట్స్ అంటే గూండాలు చేసే వ్యాపారం అన్న ఇమేజ్ తీస్కొచ్చాడు నీర వ్‌షా. కానీ విజేష్ ఎంటరయ్యాక ఆ పరి స్థితే మారిపోయింది. ఇళ్ళస్థలాలకోసం బెది రింపులు, ప్రాణాలు తీయడాలు లాంటివి చేయకుండా ఆ రంగానికి గౌరవాన్ని తెచ్చి నవాడు విజేష్. అందుకే అతన్ని అలా గౌర విస్తారు. విజేష్‌తో కలిసి పనిచేయాలని ఉత్సాహపడతారు.





"ఏంలేదు. మీరేదో కొత్త ప్రాజెక్ట్ చేపట్టి నట్టున్నారు" అడిగాడు విజేష్.

ఆనంద్ క్షణంసేపు తటపటాయించాడు. తర్వాత నెమ్మదిగా "అవునండీ!" అన్నాడు. ఒక్క ఫోన్ చేస్తే అది కూడా అసిస్టెంట్‌తో ఫోన్ చేయిస్తే తనలాంటి వాళ్ళెందరో విజేష్ ఆఫీసుముందు క్యూకట్టి నిలబడ తారు. అలాంటిది విజేష్ స్వయంగా తనను వెతుక్కుంటూ వచ్చాడంటే కారణమేంటో అతనికి అర్థంకాలేదు.

"ఏంటది..."

విజేష్ అడిగిన తీరు ఆనంద్ స్వరూప్‌కి నచ్చలేదు.

నిజానికి విజేష్ గురించి అతను ఊహిం చుకున్నది వేరు. ఇలా నలిగిన దుస్తులు, నిర్లక్ష్యంగా కట్టుకున్న బట్టలు, నోటిలో కిళ్ళీ అదంతా బాహ్య స్వరూపం. దాన్ని బట్టి మనిషిని అంచనా వేయకూడదు. అతన్ని చూస్తుంటే ఆనంద్‌కి ఎందుకో గౌరవం కల గడంలేదు. ముఖ్యంగా అతని మాటతీరు ఏదోలా ఉంది.

"సర్! అది..." ఇబ్బందిగా చూశాడు ఆనంద్.

విజేష్ ఒక్కసారి పెద్దగా నవ్వాడు.

"సరే... సరే... అది కూడా నేనే చెప్తా నులెండి. నీరవ్‌షా స్మృతి పేరిట ఓ పదం తస్థుల భవన నిర్మాణం చేయబోతున్నాడు. అది మీ పర్యవేక్షణలో సాగుతోంది, రైట్"

ఆనంద్ సందిగ్ధంగా తలూపాడు.

"ఇంజనీర్‌గారూ! ఓ భవనం కట్టగానే కూలిపోవాలంటే ఏంచేయాలి? "

విజేష్ అడిగిన ప్రశ్న ఆనంద్‌కి సరిగా అర్థం కాలేదు.

"అర్థం కాలేదా? నువ్వేం ఇంజనీరు వయ్యా బాబు..." విజేష్ స్వరంలో వెట కారం ధ్వనించింది.

"ఇప్పుడు... ఓ బిల్డింగ్ తొందరగా అయి పోవాలి. నిర్మాణవ్యయం తక్కువ కావాలి అంటే ఏం చేయాలని అడుగుతున్నాను"

"అంటే నిర్మాణ భాగాలన్నీ సరిగా ఆర కుండా కట్టుకుంటూ వెళ్ళిపోతే త్వరగా పూర్తయిపోతుందండీ. అలాగే కట్టడాలను తడపడం మానేస్తే వ్యయం, టైమ్ రెండూ ఆదా అవుతాయి. అయితే దీనివల్ల కట్ట డంలో గట్టితనం లోపిస్తుంది. నీరుపోసి తడిపితే కట్టడాలలో సిమెంట్ గట్టిపడి భవనం పటిష్టంగా ఉంటుంది. దీనికి కూలీ లకు అదనంగా చెల్లించాలి. అలాగే నిర్మాణం కూడా కొద్దిరోజులు ఆగాల్సి ఉం టుంది. ఇంకా భవన నిర్మాణంలో ఉక్కు తక్కువగా అమర్చినా, సిమెంట్ కాంక్రీట్ నిర్మాణంలో అమర్చిన ఉక్కుకడ్డీల మధ్య దూరం బాగా ఎక్కువైనా కూడా కట్టడం బలంగా నిలబడలేదు. చాలామంది వ్యయం తగ్గించాలని అవసరమైన దాని కన్నా తక్కువ సంఖ్యలో పిల్లర్స్ ఉపయోగి స్తుంటారు. పిల్లర్స్ కూడా లోతులోకి దింపరు"

ఆగమన్నట్టుగా సైగ చేశాడు విజేష్.

"మీరిప్పుడు చెప్పినవన్నీ చేయబోతు న్నారు" అని ఆగి "స్మృతి విషయంలో" అని పూర్తిచేశాడు విజేష్.

"సర్..." ఉలికిపాటుతో లేచినిలబడ్డాడు ఆనంద్ స్వరూప్.

అతని ముఖం కోపంతో ఎర్రబడింది.

అతికష్టంమీద ఆవేశాన్ని ఆపుకుంటున్న ట్టుగా అతని దవడ కండరం బిగుసుకుంది.

"మీరు చాలా రాంగ్ అడ్రస్‌కి వచ్చారు విజేష్. నేను గెటవుట్ అని అనకముందే మీరిక్కడనుంచి వెడితే ఇద్దరికీ మర్యాదగా ఉంటుంది" ఆనంద్ మాటలకు విజేష్ ఏమాత్రం ఫీలవలేదు సరికదా మరింత రిలాక్స్‌డ్‌గా కూర్చున్నాడు.

"ఏంటి ఊరుకుంటున్నాంకదా అని చాలా ఎక్కువ మాట్లాడుతున్నావ్? " విజేష్‌వెంట వచ్చినవారిలో ఒకడు ఆనంద్‌స్వరూప్ మీదకు వెళ్ళాడు.

ఆనంద్ భయంభయంగా వెనక్కి అడు

గులు వేశాడు.

"తమ్ముడూ!" వారించాడు విజేష్.

"తప్పు తమ్ముడూ. మనం ఈ ఇంటికి అతిథులుగా వచ్చాం. అలా చెయ్యొత్తచ్చా తప్పు... తప్పు..."

విజేష్ చెప్పడంతో తిరిగి అతను తన సీట్లో కూర్చున్నాడు.

"ఏమనుకోకన్నా. మా వాడికి తొందర ఎక్కువ. సరే ఇప్పుడు అసలు విషయానికి వద్దాం. మేం చెప్పింది గుర్తుందిగా. మీరు కట్టే పదంతస్థుల బిల్డింగ్ పేకమేడలా కూలిపోవాలి"

ఆనంద్ స్వరూప్ కోపంగా ఏదో అనబో తుంటే విజేష్ చేత్తో ఆగమన్నట్టుగా సైగ చేశాడు.

"చూడు ఆనందన్నా. నీ నిజాయితీ గురించి మళ్ళీ రికార్డు మొదలుపెట్టమాకు. అదంతా మాకు తెలుసు. తెలిసేకదా మేం చెప్పిన పని సిన్సియర్‌గా చేస్తావని నీ దగ్గ రకు వచ్చాం. ఇప్పుడు మేం చెప్పేదేంటంటే నువ్వు మామాట వినలేదనుకో నీ కొడుకు కాలేజీనుంచి ఇంటికి రాడు. నీ కూతురు, అదేనయ్యా, మొన్నీమధ్యన పెళ్ళి కుదిరింది చూడు, ఆ అమ్మాయి ఓ రాత్రంతా ఇంటికి రాదు. మర్నాడు పేపర్లో గ్యాంగ్ రేప్‌కు గురైన అమ్మాయిగా మీ అమ్మాయి ఫొటో మాత్రం కన్పిస్తుంది. అరే... ఆగన్నా. అంత తొందరైతే ఎలా? ఇంకా మేం చెప్పా ల్సింది పూర్తికాందే. ఇకపోతే నువ్వు కొత్తగా కట్టిన భవనం కూలిపోతుంది. సిమెంటు బదులు మట్టి, ఇసుకతో కట్టేశావని రిపోర్టు వస్తుంది. అంతే... ఇంతవరకూ నువ్వు కాపాడుకుంటూ వస్తున్న నీ నీతినిజాయి తీలు తుడిచి పెట్టుకుపోతాయి. అప్పుడిక మీ కుటుంబమంతా ఆత్మహత్య చేసుకోవాల్సి వస్తుంది" అని సోఫాలోంచి లేచాడు విజేష్.

ఆనంద్‌స్వరూప్ దిగ్భ్రాంతిగా చూస్తుండి పోయాడు.

"చూడన్నా... ఇకనుంచి ఈ చంటిగాడు నీతోపాటు ఉంటాడు" అని చంటి అనే అతన్ని చూపిస్తూ అన్నాడు విజేష్.

చంటి అనే అతన్ని చూసి ఉలిక్కిపడ్డాడు ఆనంద్. అంత భయంకరంగా ఉంది అతని ఆకారం. అచ్చంగా హిడింబికి అన్న య్యలా ఉన్నాడు.

"ఇదిగో ఇతనే మా చంటిగాడు, వీడు నీతోపాటే ఉంటాడు. ఖంగారుపడకు. మరీ ఎక్కువరోజులు కాదులే జస్ట్ మా పని అయ్యేదాకా అంతే... ఈడు మావాడని ఎవ రికీ తెలీనీయక... మరట్టా తెలీకుండా ఉండాలంటే ఏం చేయాలో తెలుసా? వీడికి నీ సైట్‌లో పనిప్పించాలి. పనంటే మరీ కష్టమైంది కాదు సుమా.

"మా చంటాడి ఆకారం ఇలా ఉంది కానీ పాపం అసలు కష్టానికి ఏమాత్రం ఓర్చుకో లేడు. అలా అని తిండి విషయంలో చంటా డనుకునేరు... కాదు... పాపం మనవాడు కొంచెం తిండి పుష్టి ఉన్నవాడనే చెప్పాలి. మరి ఎలా చూసుకుంటావో ఏమో..."

ఆనంద్ భుజంమీద చెయ్యివేసి తట్టాడు. "అన్నట్టు మరో ముఖ్యవిషయం చెప్పడం మర్చిపోయాను. నువ్వీ సంగతి ఎవ్వరికీ చెప్పకూడదు. ఆఖరకు నీ భార్యాపిల్లలకైనా సరే... చెప్పావనుకో... మా వాళ్ళకి పని చెప్పాల్సివస్తుంది. వీళ్లందరినీ రోజుల తర బడి మేపుతున్నానేగానీ వీళ్ళకి ఇంతవరకూ నేను సరైన పని చెప్పలేదు. దాంతో వీళ్ళకి బాగా చేతులు దురద పెడుతున్నాయట. పాపం నేనొక్క సైగ చేస్తే చాలు. వీళ్ళు మనుష్యులమీద పడి రక్తం తాగేస్తారు. అంతటి నరరూప రాక్షసులు... ఒక్కొక్కడి లిస్టులో ఓ పాతికదాకా మర్డర్లు చేసిన అను భవం ఉంది. మరి వెళ్ళొస్తానన్నా" అని చెప్పి, "చంటీ! జర అన్నని జాగ్రత్తగా చూసుకో" అని చెప్పాడు విజేష్.

"అలాగేనన్నా" అన్నాడు ఆ చంటి అన బడే హిడింబాసురుడు.

డబ్బాలో గులకరాళ్ళు పోసి గిలకరించిన





ట్టుగా ఉంది అతను మాట్లాడుతుంటే.

విజేష్ వెళ్ళిపోతుంటే ఆనంద్‌స్వరూప్ నిస్సహాయంగా చూస్తూ నిలబడిపోయాడు.

★ ★ ★

మధుజైన్ రమ్మందని చెప్పడంతో శాంతి దినేష్ ఇంటికి వచ్చింది.

కాసేపు అవీఇవీ కబుర్లు చెప్పాక మధుజైన్ అసలు విషయంలోకి వచ్చింది.

ఆవిడ ప్రశ్నకు ఏం సమాధానం చెప్పాలో అర్థంకానట్టుగా ఉండిపోయింది శాంతి.

నిజానికి ఆమె కోరుకున్నది కూడా అదే. వాళ్ళకెలా చెప్పాలా అని ఆమె సతమతపడిపోతోంది. ఇప్పుడు మధుజైన్ తనే అడిగేసరికి శాంతికి రిలీఫ్‌గా అన్పించింది.

"చెప్పమ్మా... దినేష్‌ని పెళ్ళి చేసుకోవడం నీకిష్టమేనా? " అడిగింది మధుజైన్.

"ఆంటీ! దినేష్‌ని పెళ్ళి చేసుకోవడం ఇష్టమో, కాదో చెప్పేముందు మీకు నా గురించి చెప్పాలి" అంది శాంతి.

"నీ గురించి తెలుసుకోవడానికేముంది? ముందు నువ్వు నా ప్రశ్నకి జవాబు చెప్పు. ఆ తర్వాత నువ్వేం చెప్పినా వింటాను"

"ఆంటీ! ప్లీజ్" రిక్వెస్టింగ్‌గా అంది శాంతి.

"నా గురించి మీరు తెలుసుకోవాల్సింది చాలా ఉంది ఆంటీ! పెళ్ళికిముందు మీరు తప్పకుండా నా గురించి తెలుసుకోవాలి" స్థిరంగా చెప్పింది శాంతి.

"శాంతీ..."

"అవునాంటీ. దయచేసి నేను చెప్పేది వినండి" అని తన గురించి మొత్తం చెప్పింది శాంతి.

అంతా విన్నాక మధుజైన్‌కి ఏం మాట్లాడాలో అర్థంకాలేదు.

"ఆంటీ! దినేష్ మా మొదటి పరిచయంలోనే సుశీల ఫోటో చూపించి తను విజేష్ గారి కూతురని చెప్పారు. మా నాన్నగారి పేరు నీరవ్‌షా అని అప్పుడే చెప్పాను. కానీ మీకు మా నాన్నగారికీ విజేష్‌గారికి మధ్యనున్న గొడవల గురించి తెలీదు. కానీ ఇప్పుడు కూడా చెప్పకపోతే మిమ్మల్ని మోసం చేసినట్లు అవుతుందాంటీ... నిజానికి నా మనసులో మాట చెప్పేస్తున్నాను" అంటూ ఒక్కక్షణం ఆగింది శాంతి.

మధుజైన్ ఇంకా విభ్రాంతినుంచి తేరుకోలేదు.

"ఆంటీ! నేను దినేష్‌ని పెళ్ళి చేసుకుంటే మా నాన్నగారికీ, విజేష్‌గారికీ మధ్యనున్న గొడవలు తగ్గిపోతాయన్నది నా నమ్మకం. ఇప్పుడు చెప్పండి నన్ను మీ కోడల్ని చేసుకుంటారా? "

శాంతి ప్రశ్నకు మధుజైన్ సమాధానం చెప్పలేకపోయింది.

తన కూతుర్ని కాదని వేరే అమ్మాయిని కోడల్ని చేసుకుంటే అన్నయ్య పడే బాధ, ఆవేదన తను ఊహించగలదు. అంతేకాదు మాట తప్పినవాళ్ళని, మాటమీద నిలబడని వాళ్ళని అన్నయ్య క్షమించడు. ఇక జీవితంలో తన ముఖం చూడడు. కానీ నిజం తెలిశాక సుశీలకోసమే దినేష్ ఈ త్యాగం చేశాడని అర్థం అయ్యాక తనని క్షమిస్తాడు. అందుకే ధైర్యంచేసి శాంతి అభిప్రాయం అడిగింది. తీరాచూస్తే శాంతి తండ్రికీ, అన్నయ్యకూ మధ్య ఇంత శత్రుత్వం ఉందనీ, మరో సమస్య ఎదురవుతుందని మధుజైన్ ఊహించలేకపోయింది.

ఇప్పుడేం చేయాలి?

శాంతి అన్నట్టు నిజంగా ఈ పెళ్ళివలన వారిద్దరూ ఒకటవుతారా? అన్నయ్య తనను క్షమిస్తాడా?

"సారీ అంటీ! మిమ్మల్ని బాధపెట్టినట్టున్నాను"

"లేదమ్మా! నిజం చెప్పి నువ్వు చాలా మంచి పని చేశావు. నువ్వు నాకొకమాట ఇవ్వగలవా? " అడిగింది మధుజైన్.

"చెప్పండాంటీ..."

"ఈ విషయం మనిద్దరిమధ్యే ఉండాలి"

"ఆంటీ..." విస్తుబోయింది శాంతి.

"అవునమ్మా... నీ అనుమానం నాకు అర్థం అయ్యింది. నేను దినేష్‌కి చెప్పనన డంలేదు. టైం చూసి చెబ్దామంటున్నాను. అలాగే మీ నాన్నగారికి కూడా ఈ విషయం ఇప్పుడు చెప్పొద్దు"

"ఓ. కే... ఆంటీ! మీరు చెప్పినట్టే చేస్తాను. ఒకళ్ళమీద ఒకళ్ళు కత్తులు దూసుకుంటూ, ఇద్దరిలో ఎవరో ఒకరు మాత్రమే మిగలా లని, మరొకరు నాశనం కావాలని అనుకుం టున్నారు. మా పెళ్ళితో వారిమధ్య శ త్రుత్వం నశించాలన్నది నా కోరిక ఆంటీ!" ఎమోషనల్‌గా చెప్పింది శాంతి.

ఆ తర్వాత శాంతి, మధుజైన్‌లు ఇద్దరూ ఈ విషయం గురించి చాలాసేపు తర్జనభ ర్జనలు పడ్డారు. కానీ ఓ నిర్ణయానికి రాలే కపోయారు.



స్మృతి అపార్ట్‌మెంట్స్ నమూనా చూస్తుంటే ఆనంద్‌స్వరూప్‌కి దుఃఖం తన్ను కొస్తోంది. అటు వృత్తి, ఇటు కుటుంబం రెండింటిలో దేనికి న్యాయం చేయాలో అత నికి అర్థం కావడంలేదు.





నీతినిజాయితీలకు ఎంతో విలువ ఉందని; జీవితాంతం వాటిని నిలుపుకోవ డమే నిజమైన సక్సెస్ అనీ, అదే జీవితానికి సార్థకత అని చిన్నతనంలో అతని తండ్రి చెప్పేవాడు. దాని ప్రతిఫలం ఈ విధంగా ఉంటుందని ఆనంద్‌స్వరూప్ ఎన్నడూ ఊహించలేదు. ఆర్థికంగా ఎన్ని ఇబ్బందులు ఎదురైనా ఇన్నాళ్ళుగా నీతినిజాయితీలు పణంగా పెట్టలేదు. ఉన్నంతలో కుటుంబ అవసరాలు తీర్చడానికే పాటుపడ్డాడు. అతని భార్య కూడా భర్తకి తగిన ఇల్లాలు. పంటి బిగువున కష్టాలను ఓర్చుకుందేగానీ ఏనాడూ అతన్ని పన్నెత్తిమాట అనలేదు.

"ఏవండీ..." అన్న భార్య పిలుపుతో ఈ లోకంలోకి వచ్చాడతను.

"ఏమిటి అంత దీర్ఘంగా ఆలోచిస్తున్నారు' అడిగింది వీణాదేవి.

"ఏంలేదు" అంటూ ముఖం పక్కకు తిప్పుకుని కళ్ళు తుడుచుకున్నాడు. విజేష్ వచ్చి తనను బెదిరించిన సంగతి భార్యతో చెబ్దామా అనుకున్నాడు. మళ్ళీ అంతలోనే ఇప్పట్నించీ భార్యను బాధపెట్టడం ఎందుక న్పించింది అతనికి.

టైం చూసుకుంటూ అడిగాడు "అబ్బాయి వచ్చాడా?"

"లేదండీ... ఇంకా రాలేదు... నేనూ వాడికోసమే చూస్తున్నాను" అంది వీణా దేవి.

"రాలేదా? అదేంటి వీణా. కాలేజీ వదిలి గంట అవుతోందికదా!"

"నిజమేనండీ... కానీ మునుపటిలా వాడు బండిమీద వెళ్ళడంలేదు. బస్‌లో వెళ్తున్నాడు. మరి బస్ అంటే వచ్చేసరికి లేటవుతుంది" అంది వీణ.

మొన్నటిదాకా అంటే విజేష్ వచ్చి బెది రించే ముందుదాకా ఆనంద్ కొడుకు బండి మీదే కాలేజీకి వెళ్ళేవాడు. మొదట్లో బండి కొంటానన్నప్పుడు వీణ చాలా అభ్యంతరపె ట్టింది. అంత చిన్నపిల్లాడికి బండి ఎందు కంది. ఈ వయసులో బండి చేతికిస్తే రెక్క

లొచ్చిన పక్షుల్లా ఎగిరిపోతారే తప్ప చదువు మీద దృష్టి ఉండదని కూడా చెప్పింది. కానీ ఆనంద్ ఆ మాటలేవీ విన్పించుకోలేదు. కొడుకు తెలివితేటలమీద అతనికి ఎంతో నమ్మకం ఉంది. కొడుకు బుద్ధిమంతుడని కూడా అతడికి తెలుసు. కాలేజీకి బస్‌లో వెళ్ళి రావడం అంటే బోలెడంత సమయం వృథా అవుతుందని కొడుకు అడగకుండానే బండి కొనిచ్చాడు. విజేష్ వచ్చి బెదిరించాక ఎక్కడ కొడుకు బండిమీద వెళ్తుండగా యాక్సిడెంట్ చేసి చంపేస్తారోనని అతనికి భయం పట్టుకుంది. అందుకే కావాలని కొడుకుతో గొడవ పెట్టుకున్నాడు.

బండి వేసుకుని ఊరంతా తిరగడమే తప్ప చదువుమీద శ్రద్ధ లేదన్నాడు. బండి కొనిచ్చి తప్పుచేశానన్నాడు. ఇకనుంచి బుద్ధిగా బస్‌లో వెళ్ళిరమ్మని చెప్పాడు.

తండ్రి చెప్పింది విని కొడుకు ఎంతో ఫీలయ్యాడు. తండ్రికి నచ్చచెప్పడానికి ఎంతో ప్రయత్నించాడు. కొడుకు ఎన్నిరకాలుగా చెప్పినా ఆనంద్ విన్పించుకోలేదు. ఎక్కడ అసలు విషయం చెప్పేస్తానోనని ఇంట్లో మాట్లాడడం కూడా తగ్గించేశాడు ఆనంద్‌స్వరూప్.

"ఏమిటండీ... ఈమధ్య మీరు అదోలా ఉంటున్నారు. పది మాటలకు ఒక్కమాట మాట్లాడుతున్నారు. ఇదివరకులా పిల్లలతో సరదాగా మాట్లాడడంగానీ, వాళ్ళని బయటికి తీసుకువెళ్ళడంగానీ ఏమీ చేయడంలేదు. ఏమిటండీ... మీ సమస్య ఏమిటో నాతో చెప్పరూ..." అనునయించింది వీణాదేవి.

భార్య అలా అడుగుతుంటే ఆనంద్‌కి దుఃఖం మరింత ఎక్కువైంది. తన బాధను చేతనైనన్ని రోజులు తన మనసులోనే దాచుకోవాలి. అది చెప్పి అందరినీ బాధ పెట్టకూడదు అనుకుని, "ఏం లేదు వీణా! వర్క్ టెన్షన్ అంతే... అంతకంటే ఏమీ లేదు..." అని బయటకు వెళ్ళబోయాడు.

ఇంకా అక్కడే ఉంటే భార్యముందు బయటపడిపోతానేమోనని భయం వేసింది ఆనంద్‌కి.

అతను వెళ్ళబోతుండగా పిల్చింది వీణ.

ఆనంద్ స్వరూప్ ఆగి వెనక్కి తిరిగి చూశాడు.

"ఆ రాక్షసుడిని ఇంకా మనం ఎన్నాళ్ళు భరించాలి? వాడలా ఇంట్లో తిరుగుతుంటే చాలా ఇబ్బందిగా ఉందండీ"

భార్య అడిగిన ప్రశ్నకు అతని దగ్గర సమాధానం లేదు.

ఆ విషయంలో అతను అశక్తుడు.

"వీణా! నీకు ఇంతకుముందు చెప్పాను. ఇప్పుడు మరోసారి చెప్తున్నాను. చంటి చూడటానికి అలా ఉన్నాడు కానీ మనిషి ప్రమాదకరం కాదు. నా చిన్నతనంలో వాళ్ల నాన్నగారు నాకు ఎంతో సహాయం చేశారు. ఆ కృతజ్ఞత చూపాలికదా! అందుకే మనం కొన్నాళ్ళు అతన్ని భరించక తప్పదు" అని ముందుకి నడిచాడు.

భార్య తను చెప్పిన సమాధానం ఎంతవరకు నమ్మిందో అతనికి తెలీదు. తెలుసుకోవాలని కూడా అతను అనుకోవడంలేదు.

★ ★ ★

సమస్యలన్నీ ఒక్కసారిగా చుట్టుముట్టడంతో విజేష్ చాలా టెన్షన్ పడుతున్నాడు.

రోజురోజుకీ ల్యాండ్‌డీలింగ్ కాంప్లికేట్ అవుతోంది.

జనానికి భక్తి ఉంటుందని తెలుసుగానీ మరీ ఇంత మూఢ భక్తి ఉంటుందని అతను ఊహించలేదు. రోజురోజుకీ జనసందోహం ఎక్కువ అవుతోందేగానీ తగ్గడం లేదు.

ఈ ప్రభావం మిగతా డీలింగ్స్‌మీద కూడా ఎఫెక్ట్ చూపుతోంది.

ఈ రంగంలో ఉన్నవారందరికీ తెలుసు అది షా పని అయివుంటుందని. కానీ ఎవ్వరూ నోరు మెదపటంలేదు. పైపెచ్చు విజేష్‌తో డీల్ సెటిల్ చేసుకోవడానికి భయపడుతున్నారు. తీరా సైట్ అమ్మేశాక

ఇలాంటివి ఏదైనా జరిగితే! అందుకే అప్పటివరకు స్థలాలు అమ్మదలచిన వారు, కొనదలచినవారు సారీ చెప్పి పక్కకు తప్పుకోవడం మొదలుపెట్టారు. గట్టిగా అడిగితే వాళ్లకి ఆ ఉద్దేశ్యం లేదని కచ్చితంగా చెప్పేస్తున్నారు.

మరోపక్క తల్లి ఆరోగ్యం కూడా విజేష్ మనసుని కలవరపరుస్తోంది.

వాటికి తోడు కూతురి విషయం

వర్ధన్ పిలుపుతో తన ఆలోచనల్లోంచి బయటకు వచ్చాడు విజేష్.

"చెప్పరా! నువ్వెళ్లిన పని ఏమైంది? "

వర్ధన్ సమాధానం చెప్పలేదు.

"నిన్నేరా? అతనెవరో తెలుసుకున్నావా! అని అడుగుతున్నాను" ఈసారి కొంచెం స్వరం పెంచి అడిగాడు.

"తెలుసుకున్నానన్నా" అన్నాడతను అస్పష్టంగా.

"ఎవరతను? సుశీలకి, అతనికి ఏమిటి సంబంధం? " అడిగాడు ఊపిరి బిగపట్టి.

క్షణంసేపు వర్ధన్ తటపటాయించాడు.

అబద్ధం చెప్పడం అతనికి ఇష్టంలేదు. అలాగని నిజం చెప్తే సుశీల జీవితం విషాదమైపోతుంది. అయినా సరే చెప్పక తప్పదు అనుకుంటూ "అన్నా! అతను... అతని పేరు అహ్మద్" నెమ్మదిగా చెప్పాడు.

"ఆహా!" అన్నాడు.

"అతను... సుశీల..." అంటూ ఆగిపోయాడు.

వర్ధన్ ముఖం చూస్తుంటే అతనేదో చెప్పడానికి సందేహిస్తున్నాడనిపించింది విజేష్‌కి.

"ప్రేమించుకుంటున్నారు" ఎలాగో గొంతు పెగుల్చుకుని చెప్పేసి ఆ తర్వాత తేలికగా ఊపిరి పీల్చుకున్నాడు వర్ధన్.

విజేష్ షాక్ తిన్నట్టు దిగ్భ్రాంతితో వర్ధన్ వైపు చూశాడు.

వారిద్దరిమధ్య నిశ్శబ్దానిదే రాజ్యం అయ్యింది.

సుశీల అహ్మద్‌ని ప్రేమించడమా! ఇదెలా సాధ్యం?

'ప్రేమ' అన్న పదమే విచిత్రంగా అన్పిస్తుంటుంది విజేష్‌కి.

కని, పెంచి పెద్ద చేసిన వారిని కాదనగలిగేంత గొప్పదా ప్రేమ! అని అనుకుంటాడతను. చిన్నతనం నుంచి అన్నీ చేసిన వారు పెద్దయ్యాక పెళ్లి చేయరా! ఈ లోపల వాళ్ల కిష్టం లేని పని ఎందుకు చేయాలి? అయినా అప్పటిదాకా మనసులో రహస్యాలనేవి లేకుండా అన్ని విషయాలూ కుటుంబ సభ్యులతో పంచుకున్నవారు ఒక్క ప్రేమ విషయం మాత్రం ఎందుకు దాస్తారు?

అయినా తను సుశీలకేం లోటు చేశాడని? మిగతా పిల్లలకన్నా కూడా అపురూపంగా చూసుకున్నాడు. సుశీల నవ్వితే తను నవ్వాడు. ఏడిస్తే తను ఏడ్చాడు. ఆకాశమంత పందిరివేసి పెళ్లి చేద్దామనుకున్నాడు. తన కలలన్నీ నేలరాసి ఎవరో పరాయి మతం వాడితో ప్రేమలో కొట్టుకుపోతోంది.

చిన్నప్పటినుంచి అనుకున్న మేనత్త కొడుకుని కాదని ఆ అహ్మద్ ప్రేమలో పడిందంటే ఏమిటి అతని గొప్పతనం? దినేష్ కన్నా అందగాడా? ఐశ్వర్యవంతుడా? అంటే కాదని తెలిసిపోతూనే ఉంది. చదువుకూడా దినేష్‌కన్నా తక్కువే. మరి ఏమిటి అతనిలోని గొప్పదనం?

తనిప్పుడు ఏం చేయాలి? ఇంట్లో వాళ్లకి తెలిస్తే వాళ్లేమంటారో?

"నువ్వు అతనితో మాట్లాడావా? " అడిగాడు వర్ధన్‌ని.

"లేదన్నా!" చెప్పాడు వర్ధన్. అతనెందుకోగానీ నిజం దాచిపెట్టాడు.

"సరే నువ్వెళ్లు" చెప్పాడు విజేష్.

వర్ధన్ సందిగ్ధంగా నిలబడిపోయాడు.

అతనేదో చెప్పాలనుకుంటున్నాడని చెప్పలేక సంశయిస్తున్నాడని విజేష్‌కి అర్థమైంది.

"చెప్పరా... సంశయిస్తావెందుకు? "

"అన్నా! అదీ..."

"ఏది...? "

"మరేం లేదన్నా! సుశీల చిన్నపిల్ల. ఈ వయసులో ఇదంతా సహజమేకదన్నా! పైగా ఇందులో మన సుశీల తప్పేం లేదన్నా! చిన్నపిల్ల... అమాయకురాలు. ఆ అబ్బాయే ఏదో మాయ చేసుంటాడు. నేను మాట్లాడతానన్నా! అతనితో మాట్లాడతాను. మా సుశీల జోలికి రావద్దని చెప్తాను. మాట వినలేదనుకో నాలుగు తగిలిస్తాను. నువ్వు మాత్రం సుశీలని ఏమీ అనకన్నా"

అంత టెన్షన్‌లో కూడా విజేష్‌కి నవ్వొచ్చింది.

వర్ధన్ కూడా సుశీలని సొంత చెల్లెలుగా భావిస్తాడు. అందుకే ఆమె ప్రేమ సంగతి తెలిసి విజేష్ ఏమంటాడోనని భయపడ్తున్నాడు.

"నువ్వెళ్లరా... వెళ్లి పని చూసుకో"

"అన్నా"

"సుశీల నా కన్న కూతురురా...! నా అరచేతుల మీద నడిపించాను. కంటికి రెప్పలా పెంచుకున్నాను. వెళ్లరా. సుశీలని నేనేమీ అనను. అలాగే నువ్వు కూడా తొందరపడి అతన్నేమీ చేయకు... ఒకవేళ నువ్వు ఇంటికి వెడితే నీకు ఈ విషయం తెలియనట్టే ఉండు" చెప్పాడు విజేష్.

"అలాగేనన్నా" విజేష్ మాట ఇచ్చాక వర్ధన్ రిలీఫ్‌గా ఫీలయ్యాడు.

"తర్వాత... రాంభాయ్‌తో చెప్పి ఆ పూజారిని రమ్మన్నానని చెప్పు"

"సరే అన్నా" అంటూ వర్ధన్ వెళ్లిపోయాడు.

ఒకవేళ సుశీల తన మాట వినకపోతే చెల్లెలికేం చెప్పాలి?

చిన్నప్పటినుంచి సుశీల తన ఇంటి కోడలవుతుందని అనుకుంటున్న చెల్లెలు ఈ విషయం వింటే ఎంతో బాధ పడ్తుంది. ఎలా? ఏం చేయాలిప్పుడు?

కుర్చీలో వెనక్కి వాలి కళ్లు మూసుకున్నాడు.

చెల్లెలికిచ్చిన మాటా! కూతురి ప్రేమా! ఎటువైపు మొగ్గుచూపాలో విజేష్‌కి అర్థం కావడంలేదు.

★ ★ ★

బస్‌స్టాపులో నిలబడి అసహనంగా వాచ్ చూసుకుంటోంది సుశీల.

దాదాపు అరగంటనుంచి బస్‌కోసం ఎదురుచూస్తోంది కానీ ఆమె ఎక్కాల్సిన బస్ మాత్రం అయిపులేదు.

అంతలో హోండాసిటీ కారు వచ్చి ఆగింది.

అందులోంచి ఓ మధ్య వయస్కురాలు దిగింది.

సరాసరి సుశీల దగ్గరికి నడిచింది.

అప్పటికి కూడా సుశీల ఆవిడ వంక చూడటంకానీ ఆవిడ్ని పట్టించుకోవడం కానీ చెయ్యలేదు.

"ఏమ్మా! బస్‌కోసం ఎదురు చూస్తున్నావా? " అడిగింది ఆవిడ. "అవునండీ" అంది సుశీల ముక్తసరిగా.

"రామ్మా! నేనూ అటే వెళ్తున్నాను. డ్రాప్ చేస్తాను రామ్మా" అందావిడ.

ఆవిడ పేరు భువనేశ్వరి.

ఓ రోజు సూపర్‌మార్కెట్‌లో ఆవిడ కళ్లు తిరిగి పడిపోతే అప్పుడు అక్కడే ఉన్న సుశీల ఆవిడ ముఖాన నీళ్లు చల్లి అడ్రస్ అడిగి తెలుసుకుని ఆవిడని ఇంటి దగ్గర దింపింది. ఆ తర్వాత మళ్లీ ఇక్కడ కలుసుకున్నారు.

"వద్దండీ! బస్ రావాలి. ఈపాటికి వచ్చేస్తుంటుంది" మొహమాటపడింది సుశీల.

నిజానికి ఆవిడ డ్రాప్ చేస్తాననగానే సుశీలకి ఎగిరి గంతేయాలన్పించింది. కానీ మొహమాటం అడ్డొచ్చింది.

"ఫర్వాలేదమ్మా! ఇందులో నేను కష్టపడేదేముంది? నేనేమైనా నిన్ను ఎత్తుకుని తీసుకు వెళ్తున్నానా? లేదుగా. మనిద్దరిని మోసేది ఆ కారేగా పద" అంది భువనేశ్వరి నవ్వుతూ.

సుశీల ఆవిడ వెనక నడిచింది.

కారు ఎక్కగానే మాట్లాడటం మొదలెట్టిన ఆవిడ నాన్‌స్టాప్‌గా అలా మాట్లాడుతూనే ఉంది. పైగా కారు తన ఇంటిముందు ఆపించింది.

సుశీలకి ఇదంతా చికాగ్గా అన్పించింది.

తను ఏమంత ఘనకార్యం చేసిందని. ఆవిడ కళ్లు తిరిగి పడిపోతే నీళ్లు చల్లి స్పృహ వచ్చాక అడ్రస్ కనుక్కుని వాళ్లింట్లో దింపింది. అంతేగా! దీనికే అక్కడికి తనేదో ప్రాణ త్యాగం చేసినట్టు బిల్డప్ ఇస్తుం దేంటి?

"రామ్మా!" మరోసారి అంది భువనేశ్వరి.

"అది కాదండీ! కాలేజీకి టైం అవుతోంది. నేను అర్జెంటుగా వెళ్లాలి. అసలే లేటయింది కూడాను" గొంతులోకి వీలైనంత సౌమ్యత తెచ్చుకుని చెప్పింది.

"ఎంతసేపమ్మా! ఒక్క అయిదు నిము షాలు అంతే. ఎలాగో ఇక్కడిదాకా వచ్చావు కదా! రామ్మా" ఆవిడ ప్రేమగా పలకరించే విధానం, ఆ ఆప్యాయత చూస్తుంటే సుశీలకి నో అనబుద్ధి కావడంలేదు.

"సరే వస్తాను. కానీ మీరు కాఫీ, టిఫిన్ అంటూ నన్ను కూర్చోబెట్టకూడదు"

ఆవిడ నవ్వుతూ తలూపింది.

ఇద్దరూ లోపలికి వెళ్లారు.

సుశీల మనసు ఎందుకో ఓ చిత్రమైన అనుభూతికి లోనైంది.

"ఉండమ్మా! ఆయన్ని పిలుస్తాను" అంటూ లోపలికి వెళ్లి భర్తను వెంటపెట్టు కొచ్చింది భువనేశ్వరి.

"ఈయనేనమ్మా మా వారు"

"నమస్కారమండీ" అంటూ తలెత్తిన సుశీల ఎదురుగా కనబడ్డ నీరవ్‌షాని చూసి తెల్లబోయింది.

తెరిచిన నోరు తెరిచినట్టే ఉండిపో యింది.

కళ్లు భయంతో, ఆశ్చర్యంతో మరింత విశాలమయ్యాయి.

అవతల షా పరిస్థితి కూడా అలాగే ఉంది.

విజేష్ కూతురు తన ఇంటికి రావడమే మిటో అతనికి అర్థం కావడంలేదు. వాళ్లిద్దరి ఫీలింగ్స్‌తో సంబంధం లేనట్టుగా భువనే శ్వరి తన మానాన తాను చెప్పుకుపో తోంది. "ఏవండీ! ఆరోజు సూపర్‌మార్కె ట్‌లో నేను కళ్లు తిరిగి పడిపోతే ఒక అమ్మాయి ఎంతో సహాయం చేసిందని చెప్పాను గుర్తుందా"

నీరవ్‌షా అన్యమనస్కంగానే 'ఊం' అన్నాడు.

"ఆ అమ్మాయే ఈ అమ్మాయి. పేరు సుశీల. చాలా మంచి పేరు కదండీ. ఈ రోజు నేను వస్తుంటే బస్‌స్టాప్‌లో కనబ డింది. కాలేజీ దగ్గర దింపుతాను రామ్మా అంటే ఒక పట్టాన వింటేనా? ఎంత మొహ మాట పడిందో. ఎంతో నచ్చజెప్తే కానీ విన లేదు. సరే కారు ఎక్కాక అన్పించింది. దార్లో నేకదా మన ఇల్లు, ఒకసారి మీకు పరిచయం చేద్దామని తీసుకొచ్చాను. ఎంత లక్షణమైన పిల్లో చూశారా! ఈ కాలం ఆడపిల్లల్లా కాదు. పెద్ద వాళ్లంటే ఎంతో వినయం, గౌరవం..." భువనేశ్వరి గలగలా మాట్లాడేస్తోంది.

సుశీలకి అతన్ని చూస్తుంటే మృత్యువును చూస్తున్నట్టుగా ఉంది. ఆరోజు ఇంటికి వచ్చి 'నీ కొడుకుని దూకుడు తగ్గించుకో మను. లేదంటే శాల్తీ గల్లంతై పోతుంది' అని బెదిరించిన అతని రూపమే గుర్తుకు వస్తోంది. అదే రోజు రాత్రి తండ్రి మీద హత్యా ప్రయత్నం చేయించిన వాడు తన ఎదురుగా వున్నాడు. కాదుకాదు తనే వాళ్లిం టికి వచ్చింది. ఇందులో తన తప్పేం ఉంది? ఆవిడ భర్త నీరవ్‌షా అని తనే మైనా కలకందా?

వెళ్లిపోవాలి... వెంటనే ఇక్కడ్నించి వెళ్లి పోవాలి. లేదంటే... తన ఆలోచనలను అక్కడే తెంపి తనను తాను సర్దుకుంది.

"నేను వెళ్లొస్తానండీ" అంటూ వెనక్కి తిరి





గింది.

"ఒక్క నిముషం ఉండమ్మా" అన్నాడు నీరవ్‌షా.

భార్య చెవిలో ఏదో చెప్పాడు. ఆ మాటకి భువనేశ్వరి ముఖం సంతోషంతో వెలిగిపోయింది.

"రామ్మా! ఒక్క నిముషం కూర్చో" అన్నాడు షా.

ఆ మాట విన్నా విననట్టే నిలబడిపోయింది సుశీల.

భార్య లోపలికి వెళ్లాక చెప్పాడు "చూడు తల్లీ! ఆరోజు మీ ఇంటికి వచ్చి బెదిరించినందుకు నామీద నీకు కోపంగా వుండి వుంటుంది. సహజమేకదా! మీ ఇంటికి వచ్చి నీ తండ్రిని చంపుతానని బెదిరిస్తే కోపం రాకుండా ఎలా వుంటుంది. కానీ తల్లీ! నీరవ్‌షా అంత దుర్మార్గుడుకాదు. విజేష్‌ని, మిమ్మల్ని చూసినప్పుడల్లా నా మనసు ఏదో తెలీని ఉద్వేగానికి లోనవుతోంది. మీరంతా నా వాళ్లు అనే భావన కలుగుతుంది" అంటుండగా భువనేశ్వరి వచ్చింది.

చీర, జాకెట్టు, పళ్లు తీసుకొచ్చింది.

"ఒక్క నిముషం అలా కూర్చోమ్మా" అంది సుశీలతో.

"ఇప్పుడు ఇవన్నీ ఎందుకండీ. నేను వెళతాను" గట్టిగా తిరస్కరించాలనుకుంది కానీ కుదరలేదు.

ఎందుకో ఆమె కూడా వారిపట్ల అంత కఠినంగా వ్యవహరించలేకపోతోంది.

"తప్పమ్మా! అలా అనకూడదు. కూతురు లాంటి దానివి. కాదనకు" వారించాడు నీరవ్‌షా.

సుశీలకి కూర్చోక తప్పలేదు.

బొట్టుపెట్టి, చీరపెట్టాక ఇద్దరూ సుశీలని ఆశీర్వదించారు. ఆ తర్వాత కాలేజీలో దింపి రమ్మని డ్రైవర్‌కి చెప్పింది భువనేశ్వరి... సుశీల వెళ్లాక చెమర్చిన కళ్లను కొంగుతో అద్దుకుంది ఆవిడ.

"ఏమిటండీ! మీ కళ్లల్లో కూడా నీళ్లు" భర్తవంక చూసి ఆశ్చర్యపోయింది.

"ఆ అమ్మాయిని చూస్తుంటే నా చెల్లెలు గుర్తుకు వచ్చింది భువనా! అదే రూపం. అదే నడక. అదే మాట తీరు. భూకంపం వచ్చినప్పుడు ఇల్లు కూలి చనిపోయిన చెల్లెలు తిరిగి ఇలా కన్పించడం నాకు చాలా ఆశ్చర్యంగా ఉంది"

"నిజమా" భువనేశ్వరికి ఎంతో విస్మయం కలిగింది.

"అవును భువనా! మనుషుల్ని పోలిన మనుషులు ఉంటారని ఎంతగా మనసుకి సర్ది చెప్పుకున్నా మరీ ఇన్ని పోలికలా? ఆ విజేష్‌ని చూస్తే తప్పిపోయిన నా తమ్ముడే గుర్తుకు వస్తాడు. ఇంతకూ సుశీల ఎవరో నీకు తెలుసా? "

"లేదే"

"సుశీల ఆ విజేష్ కూతురు..."

మరోసారి ఆశ్చర్యపోవడం భువనేశ్వరి వంతయ్యింది.

అంటే శత్రువు కూతుర్ని ఇంటికి తీసుకు వచ్చి తాము మర్యాద చేశారన్నమాట. చీర పెట్టి పంపారన్నమాట. తల్చుకుంటేనే ఆవిడకి ఎంతో ఆశ్చర్యంగా అన్పిస్తుంది. ఈ గొడవలు ఇంతటితో ఆగిపోయి వాళ్లిద్దరూ అన్నదమ్ముల్లా ఉండగలిగితే ఎంత బాగుండు? అన్పించింది భువనేశ్వరికి.

సరిగ్గా నీరవ్‌షా కూడా అదే అనుకుంటున్నాడు.

ఆరోజు విజేష్ ఇంటికి వెళ్లినప్పుడు తను గమనించలేదుకానీ ఆ సుశీల అచ్చంగా తన చెల్లెలు లానే ఉంది. అంతకన్నా ఆశ్చర్యకరమైన విషయం ఏంటంటే తన కూతురు శాంతికీ, సుశీలకి చాలా పోలికలున్నాయి.

ఆ విజేష్‌ని, తనని పక్కపక్కన నిలబెడితే ఎవ్వరైనా తామిద్దరినీ అన్నదమ్ములని ఒప్పుకు తీరాల్సిందే. ఒకవేళ ఆ విజేష్ తప్పిపోయిన తన తమ్ముడా? ఎలా అవుతాడు. ఆ భూకంపం తరువాత బతికిన వాళ్లెంతమంది? తమ్ముడు, చెల్లెలు ఆ తరు

వాత కనిపిస్తేగా...

పోనీ ఆ విజేష్ దగ్గరకు వెళ్లి ఈ గొడవలను ఇంతటితో మర్చిపోదాం అని చెప్తే? ఊహూ ఇంతదూరం వచ్చాక అది జరిగే పనేనా?

ఈ పోరాటం కొనసాగక తప్పదు.

ఏదో అద్భుతం జరిగితేగానీ ఈ పోరాటం ఆగదు.

అంతవరకూ విజేష్ని, సుశీలని చూసినప్పుడల్లా తనిలా బాధపడుతూ ఉండాల్సిందే. అసలు అంతా కలిసుండే రోజు వస్తుందా. అప్పటికి తామిద్దరూ బతికి ఉంటారా?

నీరవ్‌షా మెదడు ఆలోచనలతో వేడెక్కిపోయింది.

సుశీల రాక అతని మనసులో తీవ్ర సంచలనం కలిగించింది.

★ ★ ★

"ఇప్పుడు టైం ఎంతయ్యింది? " అడిగాడు అహ్మద్.

ఆ మాట విన్పించుకోకుండా "ఈరోజు ఏమైందో తెలుసా? " నేను నీరవ్‌షా ఇంటికి వెళ్లాను" అంది సుశీల.

అహ్మద్ ఉలిక్కిపడ్డాడు.

సుశీల చెప్తున్న దేమిటో అతనికి సరిగా అర్థం కాలేదు.

"ఆశ్చర్యంగా వుందికదూ! నాకూ అంతే. అసలు సంగతేంటంటే వెళ్లేదాకా ఆ సంగతి నాకే తెలీదు"

"ఈ విషయం మీ న్నాన్నగారికి తెలిస్తే" కొంచెం కోపంగానే అన్నాడు.

"అమ్మో! ఇంకేమైనా ఉందా? డాడీ చంపేస్తారు" భయంగా అంది.

"అంత భయపడేదానివి వాళ్లింటికి ఎందుకు వెళ్లావ్? "

"నేనేమీ కావాలని ఆ నీరవ్‌షా ఇల్లు వెతుక్కుంటూ వెళ్లలేదు. అసలు వెళ్లేదాకా ఆ ఇల్లు షాది అని నాకు తెలీనే తెలీదు"

సుశీల మాటలకి అతను కన్‌ఫ్యూజ్ అయ్యాడు.

"ఏంటో అంతా గందరగోళంగా వుంది కదూ! అసలేం జరిగిందో వివరంగా చెప్తాను విను"

సుశీల కథంతా పూసిగుచ్చినట్లు చెప్పింది.

"అహ్మద్! నిజంగా ఆ నీరవ్‌షాని చూస్తే మనం అనుకుంటున్నంత దుర్మార్గుడు కాదే మోనన్పించింది. కూతురులాంటిదానివి కాదనకమ్మా అంటూ ఈ చీరాజాకెట్టు పెట్టారు" అంటూ బ్యాగ్‌లోంచి తీసి చూపించింది."

జరిగింది విని అహ్మద్‌కి ఎలా రియాక్ట్ కావాలో అర్థంకావడం లేదు.

"సర్లే కానీ! ఈ రోజు డాడీతో మాట్లాడతానన్నావు కదా! పద డాడీ దగ్గరికి వెళ్దాం" అంది కూర్చున్న చోటునుంచి లేస్తూ.

"ముందు నువ్వు కూర్చో..." ఆమె చెయ్యి పట్టుకుని కూర్చోబెడుతూ "సుశీలా! ఇప్పుడు మీ నాన్నగారిని కలిసి మాట్లాడాల్సిన అవసరంలేదు" నెమ్మదిగా అన్నాడు అహ్మద్.

"ఏం? " భృకుటి ముడిచింది సుశీల.

"మీ నాన్నగారికి మన విషయం తెలిసిపోయింది"

"వ్వాట్" దిగ్భ్రాంతిగా అరిచింది సుశీల. "నువ్వు... నువ్వు చెప్పేది" ఆమెకి మాటలు తడబడ్డాయి.

"అవును సుశీ! మీ డాడీకి మన సంగతి తెలిసిపోయింది? "

"కానీ ఎలా? " ఆమె గొంతు సన్నగా వణికింది.

"ప్లీజ్ సుశీ! అంత టెన్షన్ పడకు. ముందు నువ్వు రిలాక్స్ అవ్వు" అనునయించాడు అహ్మద్.

"ఎలా రిలాక్స్ అవమంటావ్? మనం చెప్తే డాడీ అంత ఫీలయ్యేవారు కాదు. ఇప్పుడేమనుకుంటారు. నా కూతురు అన్ని విషయాలు చెప్పి పెళ్ళి దగ్గరకు వచ్చేసరికి తన ప్రేమ విషయం మన దగ్గర దాచిపె





ట్టింది అని అనుకోరూ! అసలైనా ఈ సంగతి డాడీకి చెప్పిందెవరు? " ఆమె స్వరంలో ఆగ్రహం వ్యక్తమైంది.

"ఎవ్వరూ చెప్పలేదు సుశీ! మనిద్దరం మాట్లాడుకుంటుండగా మీ డాడీ చూశారు. ఆ తర్వాత నేనెవరనేది కనుక్కోమని వర్ధన్‌కి పురమాయించారు. వర్ధన్ అంటే తెలుసుగా!? "

"తెలుసు డాడీ దగ్గర పనిచేస్తాడు"

"ఊ అతనే... అతను సరాసరి నన్ను వెతుక్కుంటూ వచ్చాడు. అన్ని విషయాలు అడిగాడు. నిర్భయంగా చెప్పాను."

తండ్రి ఈ సంగతి తెలిసి ఈ పని చేశాడో లేక ముందే ఈ ఏర్పాట్లు చేశాడో తెలీదుగానీ సుశీల ఇంటికి వెళ్లేసరికి అంతా ఆమెకోసమే ఎదురుచూస్తున్నారు.

★ ★ ★

ఇంటికి వెళ్లేసరికి తండ్రి ఉంటాడేమో, అహ్మద్ గురించి అడుగుతాడేమోనని భయపడింది సుశీల.

అదృష్టవశాత్తు విజేష్ అప్పుడే ఏదో ఫోన్ కాల్ రావడంతో బయటకి వెళ్ళాడు. ఆ విషయం తెలిసి తేలికగా ఊపిరిపీల్చుకుంది సుశీల.

ముందీ సంగతులన్నీ నానమ్మకి చెప్పాలి అనుకుంటూ శారదమ్మగారి గదిలోకి వెళ్ళింది.

నీరవ్‌షా వచ్చి బెదిరించిన దగ్గరినుంచి శారదమ్మగారు ఎక్కువగా తన గదిలోనే ఉండిపోయి భగవంతుని ప్రార్థిస్తూ రోజులు గడిపేస్తున్నారు. ఇదివరకటి ఉత్సాహం, సంతోషం ఇప్పుడు ఆవిడలో మచ్చుకైనా కన్పించడంలేదు.

"నానమ్మా! నీతో ఓ ముఖ్యమైన విషయం మాట్లాడాలి" అంది సుశీల.

"చెప్పమ్మా! ఏంటది? " అనునయంగా అడిగారు శారదమ్మ.

"డాడీ... డాడీ ఎలా వున్నారు? "

"మామూలుగానే ఉన్నాడు"

"నన్నేమీ అనలేదా? "

"లేదే... ఏం... ఏమైందేంటి? "

ఒక్కసారి బలంగా ఊపిరి పీల్చుకుని చెప్పింది సుశీల. "ఏం లేదు నానమ్మా! డాడీకి మా విషయం తెలిసిపోయింది"

"ఏమిటీ? " కీచుగా అరిచారు శారదమ్మ.

"అవును నానమ్మా!" అంటూ లేచి వెళ్ళి గది తలుపు వేసొచ్చింది. "ఓరోజు నేను, అహ్మద్ మాట్లాడుకుంటుండగా డాడీ చూశారట. వెంటనే వర్ధన్‌ని పంపి అహ్మద్ గురించి అన్ని వివరాలు తెలుసు కోమన్నారట"

"ఊ... అందుకేనన్నమాట ఇంత హఠాత్తుగా పెళ్ళి ఏర్పాట్లు చేసేస్తున్నాడు" తన లోతాను అనుకోబోయి పైకి అనేశారు శారదమ్మ.

గుండెల్లో రాయి పడ్డట్టయ్యింది సుశీలకి. "పెళ్ళి ఏర్పాట్లా"

"అవును" అన్నారావిడ.

"ఎవరికి నానమ్మా!" తమ ప్రేమను తండ్రి అర్థంచేసుకుంటాడని అనుకోకపోయినా ఎక్కడో మనసులో మెదిలిన ఓ చిన్న ఆశ ఆమెని ఆ ప్రశ్న అడిగించింది.

"పిచ్చిపిల్లా!" సుశీలని దగ్గరికి తీసుకున్నారు శారదమ్మ. "మీనాన్న మనస్తత్వం ఎరిగినదానివి. నువ్వీ ప్రశ్న అడుగుతున్నావా? ఇంకెవరికి నీకూ, నీ మేనత్త కొడుకుకి"

ఆ మాట విని సుశీల హతాశురాలైంది.

తన ఆశల సౌధం కూలిపోయినట్లైంది ఆమెకి.

రెక్కలు తెగిన పావురాయిలా ఆమె మనసు విలవిల్లాడింది.

ఇన్నాళ్లూ తండ్రికి ఈ సంగతి తెలీదుకాబట్టి మేనత్త కొడుకుకి ఇచ్చి తన పెళ్ళి జరిపించాలని తండ్రి అనుకుంటున్నాడనుకుంది.

తన ప్రేమ సంగతి తెలిస్తే మొదట అందరి తల్లితండ్రుల్లా ఎగిరెగిరి పడినా



కూతురి సంతోషమే ముఖ్యం అనుకుని తన ప్రేమను అర్థంచేసుకుంటారని కలలు కంది. తన ప్రేమ సంగతి తెలిశాక కూడా తండ్రి దినేష్‌తోనే తన పెళ్ళి చేయాలని అనుకుంటున్నాడంటే ఆమెకి ఎంతో దుఃఖం తన్నుకొచ్చింది.

"మరి ఇప్పుడు ఏం చేద్దామనుకుంటున్నావ్?" మనవరాలి ముఖంలో మారుతున్న భావాలు గమనిస్తూ అడిగారావిడ.

"ఏం చేయమంటావ్ నానమ్మా!" బేలగా అడిగింది సుశీల.

"మీరిద్దరూ ఏమనుకున్నారు?"

"ఏమనుకోలేదు నానమ్మా! 'ఈ విషయం ఎప్పటికైనా తెలియాల్సిందే కదా! మీ డాడీ అడిగితే నిజం చెప్పు... ఆయన ఏమంటారో తెలిశాక కదా మనమేం చేయాలో ఓ నిర్ణయానికొచ్చేది' అన్నాడు అహ్మద్. డాడీ ఈ సంగతి తెలిసి నన్ను ఏదైనా అడుగుతారనుకున్నాను. ఇలా కామ్‌గా పెళ్ళి ఏర్పాట్లు చేసేస్తారనుకోలేదు. ఇప్పుడేం చేయాలో అర్థంకావడంలేదు. పోనీ డైరెక్టుగా దినేష్ బావకే ఈ సంబంధం నాకిష్టంలేదని చెప్పేస్తేఎలా ఉంటుంది నానమ్మా! రాత్రికి అందరూ నిద్రపోయాక దినేష్ బావకి ఫోన్‌చేసి అసలు సంగతి చెప్పేస్తాను. బావ చదువుకున్నవాడు. నన్ను డెఫినిట్‌గా అర్థంచేసుకుంటాడు".

ఈ ఆలోచన శారద్మగారికి కూడా బాగా నచ్చింది.

అప్పటికిగానీ వాళ్ళిద్దరి మనసులు తేలికపడలేదు.

"అన్నట్టు నానమ్మా నీకో విషయం చెప్పాలి" గొంతు బాగా తగ్గించి అంది సుశీల.

ఏమిటన్నట్టు చూశారు శారదమ్మ.

అప్పుడు తాను షా ఇంటికి వెళ్లిన విషయం చెప్పింది సుశీల. చివరిగా ఇలా కూడా అంది. "అతను మనం ఊహించుకున్నంత చెడ్డవాడు కాదేమో నన్పిస్తోంది నానమ్మా! పోనీ మనిద్దరం ఒకసారి వెళ్ళి ఆ నీరవ్‌షాను డాడీ జోలికి రావద్దని, డాడీని ఏమీ చెయ్యద్దని అడిగితే... ఆయన తప్పకుండా ఒప్పుకుంటాడన్పిస్తోంది" అని కూడా అంది.

సుశీల మాటలకి ఆవిడకి వెయ్యి ఏనుగుల బలం వచ్చినట్టు అయ్యింది.

"నిజంగా వెడదామా!" మనవరాలి చేతులు పట్టుకుని అడిగారు శారదమ్మ.

"వెళదాం నానమ్మా! తప్పకుండా వెళదాం. అయితే డాడీకి చెప్పకుండా వెడదాం." ఉత్సాహంగా అంది సుశీల.

ఆ తర్వాత చాలాసేపు ఇద్దరూ నీరవ్‌షా ఇంటికి వెళ్ళి ఏం మాట్లాడాలో మాట్లాడుకుంటూ కూర్చున్నారు. సుశీల కూడా తాత్కాలికంగా తన విషయం మర్చిపోయింది.



విజేష్ వచ్చేసరికి సుశీల నిద్రపోయింది. కాదు... కాదు నిద్రపోయినట్టు నటించింది.

అతను కూడా ఈ విషయంలో చాలాసేపు తర్జనభర్జనలు పడ్డాడు. ఈ విషయం సుశీలని అడగాలా! లేక ఆమెని ఏమీ అడగకుండా కామ్‌గా పెళ్లిచేసేయాలా అని. అతనికి రెండో పద్ధతే మంచిదన్పించింది.




పైగా ఏ తండ్రి అయినా తన అంత ఎది గిన కూతురి ముందు ప్రేమ గురించి ఎలా ప్రస్తావిస్తాడు?

అందుకే వెంటనే చెల్లెలితో మాట్లాడి ముహూర్తాలు పెట్టించేయాలనుకున్నాడు.

నిజానికి సుశీల తండ్రి తనను ఏదైనా అడుగుతాడని భయపడే నిద్రపోతున్నట్టు నటించింది కానీ ఆమె మెలకువగానే ఉంది.

రాత్రి పదకొండు దాటాక నెమ్మదిగా లేచి నానమ్మ గదిలోకి వెళ్ళింది. ఇద్దరూ కలిసి కార్డ్‌లెస్ తీసుకుని మేడమీదకు వెళ్ళారు.

మధుజైన్ నెంబర్‌కి రింగ్ చేశారు శారదమ్మ.

ఆవిడే లైన్‌లోనికి వచ్చింది.

కుశల ప్రశ్నలయ్యాక అసలు విషయం చెప్పారు శారదమ్మగారు.

విషయం విని మధుజైన్ ఆశ్చర్యపో లేదు. ఆందోళన పడలేదు. తల్లి ఇదీ సంగతని ఫోన్‌చేయడం ఆవిడకెంతో ఆనందాన్నిచ్చింది.

"నాకు తెలుసమ్మా!" అంది మధుజైన్ అంతా విన్నాక.

ఆశ్చర్యపోవడం శారదమ్మగారి వంతయ్యింది.

"అవునమ్మా! మీరిద్దరూ ఆరోజు మేడమీద మాట్లాడుకుంటున్నప్పుడు దినేష్ వచ్చాడట. వాడు మీ మాటలన్నీ విన్నాడట" ఎంతగా కంట్రోలు చేసుకుందామని ప్రయత్నించినా మధుజైన్ స్వరం బాధతో బొంగురుపోయింది.

శారదమ్మగారు ఎంతోసేపు ఓదార్చాక తేరుకుంది ఆవిడ.

"అమ్మా! సుశీలకి చెప్పు... దినేష్‌కి పెళ్ళి కుదిరింది. నా కొడుకు నీ మనవరాలి ప్రేమకు అడ్డురాడమ్మా" వెక్కుతూ చెప్పింది మధుజైన్.

శారదమ్మగారికి ఏం మాట్లాడాలో అర్థం కాలేదు.

ఆ తర్వాత మధుజైన్ శాంతి గురించి చెప్పింది. శారదమ్మగారికి దేవుడంటే భక్తి ఎక్కువ. ఎన్నోసార్లు క్లిష్టపరిస్థితుల్లో తనకు సరైన త్రోవ చూపింది ఆ భగవంతుడేనని ఆవిడ విశ్వాసం. అది మరోమారు రుజువైంది. శాంతి మధుజైన్ కోడలైతే కొడుకుకు, నీరవ్‌షాకు మధ్యనున్న గొడవలు మాసిపోవచ్చు. కానీ ఇది జరుగుతుందా?

మొత్తంమీద అత్తయ్యకు ఫోన్ చేశాక సుశీల రిలీఫ్‌గా ఫీలయ్యింది. నానమ్మ చెప్పిన సంగతే ఆమెకి కొంచెం ఆశ్చర్యం కల్గించింది. అయితే ఆమెకు కూడా నానమ్మలానే ఈ సంబంధం జరిగితే ఇరుకుటుంబాలకు మంచి జరుగుతుందని అన్పించసాగింది.

అంతా బానేవుందిగానీ ఈ విషయం తెలిస్తే విజేష్ ఎలా రియాక్ట్ అవుతాడన్నదే సమస్య.

కొన్ని విషయాలకి కాలమే పరిష్కారం చూపాలి అంటారు. ఇది కూడా అంతే!

★ ★ ★

"అయ్యా! నమస్కారం. రమ్మని కబురు పెట్టారట" దూరంనుంచే నమస్కారం పెడుతూ అన్నాడు పూజారి.

అతడు రతీబెన్ స్థలంలో వెలిసిన అమ్మవారి పూజకోసం నియుక్తుడైన పూజారి

"రండి పూజారిగారూ! కూర్చోండి" కుర్చీ చూపించాడు విజేష్.

"చెప్పండి నన్నెందుకు పిలిపించారు?" మరోసారి అడిగాడాయన.

పూజారి ముందు ఓ సూట్‌కేసు ఉంచాడు. "తీసుకోండి. ఇది మీకే" అన్నాడు.

విజేష్ అంటున్నదేమిటో అర్థంకాలేదు పూజారికి.

"పూజారిగారూ! ఉపోద్ఘాతాలవీ లేకుండా డైరెక్టుగా అసలు విషయంలోకి వస్తాను. రతీబెన్ గోవిందాగారి స్థలం కొనడానికి నేను చాలా కష్టపడ్డాను. ఖర్చుపెట్టాను

కూడా. ఇప్పుడక్కడ అమ్మవారు వెలవడంతో నాకు చాలా నష్టం వచ్చేలా ఉంది"

"తప్పుబాబూ... అలా అనకూడదు" అంటూ పూజారి ఏదో చెప్పబోయాడు.

"ఏది తప్పో ఏది ఒప్పో నాకు బాగా తెలుసుగానీ మీరు నేను చెప్పేది వినండి. ఎట్టి పరిస్థితుల్లోను ఆ సైట్ వదులుకోడానికి నేను సిద్ధంగాలేను. అలాగని అక్కడో గుడి కట్టించే ఆలోచన నాకు లేదు. కాబట్టి"

"అమ్మవారి విగ్రహాన్ని అక్కడినుంచి తొలగించమని మాత్రం చెప్పకండి. అసలు ఆ ఆలోచన రావడమే మహాపరాధం బాబూ" చెంపలేసుకుంటూ అన్నాడు పూజారి.

"నాకు ఆమాత్రం తెలుసండీ! నిజానికి ఇదంతా నా శత్రువు పన్నిన పన్నాగం"

పూజారి ఉలిక్కిపడ్డాడు.

"ఇంతదూరం వచ్చాక అమ్మవారు వెలపడం అబద్ధమని, నా శత్రువు నామీద కక్ష తీర్చుకోడానికి ఇదంతా చేశాడని నిరూపించడం కష్టం. అందుకే నేనో నిర్ణయానికి వచ్చాను. సైట్ అంతా అమ్మవారి గుడిని మిత్తం ధారపోయడం కుదరదు. ఓ చిన్న గుడి మాత్రం కట్టిస్తారు. మిగతా సైట్‌లో యథాప్రకారం నా అపార్ట్‌మెంట్స్ కన్‌స్ట్రక్షన్ కొనసాగుతుంది. భక్తులను రెచ్చగొట్టకుండా నేను చెప్పిందానికి ఒప్పించడం మీ బాధ్యత. అందుకోసమే ఆ డబ్బు" తను చెప్పాలనుకున్నది చెప్పాడు విజేష్.

పూజారి ఆలోచనలో పడ్డాడు.

విజేష్ చెప్పినట్టుగా చేస్తే తాను రెండువైపులా లాభపడ్తాడు.

ఒకవేళ 'షా' తనను పిలిచి అడిగితే ఇదంతా తనకేం తెలీదని చెప్పేస్తే సరిపోతుంది.

"అలాగేనండీ! అంతా మీరు చెప్పినట్టే జరుగుతుంది" సూట్‌కేసు చేతిలోకి తీసుకున్నాడు పూజారి.





"ఫర్వాలేదే. మీరు మా ప్రాబ్లమ్ బానే అర్థంచేసుకున్నారు. ఈ పనికి ఒప్పుకోరేమోననుకున్నాం" రిలీఫ్‌గా నవ్వాడు విజేష్.

"బతకడం తెలీకపోతే సమస్యలు తప్పవు కదండి. నేనిప్పుడు ఈ పని చేయడం కుదరదన్నాననుకోండి. మీరు నచ్చచెప్తారు. అప్పటికీ వినకపోతే చంపేస్తానని బెదిరిస్తారు. ఎలాగో పని చేయక తప్పనప్పుడు ఇంత గొడవ జరగడం అవసరమా? మీరు చెప్పిన వెంటనే ఈ పనికి ఒప్పుకున్నాననుకోండి. మీరిచ్చే డబ్బుతో నా ఆర్థిక సమస్యలైనా తీరతాయి కదా!" మరోసారి నమస్కారం చేసి వెళ్ళడానికి లేచాడు పూజారి.

చాలారోజుల తర్వాత రిలీఫ్‌గా గట్టిగా నవ్వేశాడు విజేష్.

ఆ తర్వాత ఏర్పాట్లన్నీ చకచక జరిగిపోయాయి.

అమ్మవారి విగ్రహం ఉన్నంతమేర చిన్న గుడి కట్టించాడు విజేష్. అదే పూజారిని నియమించాడు.

సైట్‌లో అమ్మవారు వెలవడంవల్ల ఆ స్థలం ఎంతో పవిత్రమైందని, అక్కడ ఉండే వారిపై దుష్టగ్రహాల ప్రభావం ఉండవని చెప్పించాడు. దాంతో సైట్ విలువ పెరిగింది. అక్కడ కట్టబోయే అపార్ట్‌మెంట్స్ కొనుక్కోడానికి జనం పోటీలు పడ్డారు. దాంతో రేటు పెరిగిపోయింది. మొత్తం మీద విజేష్‌కి బోలెడంత లాభం వచ్చింది.

అప్పుడు చేశాడు ఫోన్.

అచ్చంగా ఆనాడు షా ఫోన్ చేసినట్టుగానే తనూ చేశాడు విజేష్.

"హాల్లో! అన్నా. మంచిగున్నావా? "

"ఎవరు మాట్లాడేది? " వీలైనంత సౌమ్యంగా అడిగాడు నీవర్‌షా.

"నేనన్నా! గుర్తుపట్టలేదా? " షా తన గొంతు గుర్తుపట్టని విధంగా గొంతు మార్చి మాట్లాడాడు.

"ఎవర్రా మాట్లాడేది. ఫోన్‌లో మాట్లాడటం కూడా రాదా? " కోపగించుకున్నాడు షా.

"ఏంటన్నా ఇది! ఎవరినైనా మర్చిపోవచ్చు కాని శత్రువుని మరవచ్చా! తప్పుకాదూ. సర్లే నువ్వసలే పరేషాన్ అవుతున్నావ్. నిన్నింకా ఇబ్బంది పెట్టడం భావ్యం కాదుగాని నా పేరు చెప్పేస్తాన్లే. నన్ను అందరూ విజేషన్నా! అని పిలుస్తారు గుర్తొచ్చిందా? "

"చెప్పు భయ్యా! ఎన్నడూ లేనిది నువ్విలా ఫోన్‌చేశావంటే ఏదో పెద్ద విశేషమే అయి వుంటుంది. చెప్పు విజేష్ నీకేదైనా సహాయం కావాలంటే మొహమాటం పడకుండా అడుగు" అన్నాడు షా.

"నీ మంచి మనసు నాకు తెలుసునన్నా! నేనిప్పుడు నీ సహాయంకోసం ఫోన్‌చేయలేదు. నీకు థాంక్స్ చెప్దామని ఫోన్ చేశాను"

"థాంక్సా...! దేనికి? " భృకుటి ముడిచాడు నీరవ్‌షా.

"అదేనన్నా! ఆ స్థలంలో ఎంతో కష్టపడి మరీ అమ్మవార్ని నెలకొల్పావ్... దొంగపూజారిని, దొంగ భక్తులను ఏర్పాటుచేశావు. బానే ఖర్చుపెట్టి ఉంటావ్. కానీ అదంతా బూడిదలో పోసిన పన్నీరు అయ్యిందని చెప్దామనే ఫోన్ చేశాను"

"చూడు విజేష్" షా గొంతులో ఆగ్రహం వ్యక్తం అయ్యింది. "నీకు ఇంతకుముందు చెప్పాను. మళ్ళీ ఇప్పుడు కూడా చెప్తున్నాను. ఇదంతా ఎవరో ఆడుతున్న నాటకం. మనిద్దరి మధ్య గొడవలు పెట్టి మనం నాశనం అయిపోతే వాళ్ళు లాభపడదామని చూస్తున్నారు. ఈ గొడవకీ నాకు ఎలాంటి సంబంధంలేదు"

"ఇక ఆపుతావా!" వ్యంగ్యంగా అన్నాడు విజేష్.

"ప్లీజ్ విజేష్! నేను చెప్పేది విను. నిజానికి నేను తల్చుకుంటే" అని "సరే... ఆ విషయం వదిలెయ్... నిన్ను చూస్తుంటే నాకు ఏదో తెలీని వాత్సల్యం అడ్డువస్తోంది. భూకంపంలో చనిపోయాడనుకున్న నా తమ్ముడు బతికి వచ్చాడన్పిస్తోంది. అందుకే నువ్వు వ్యాపారంలో ఎదుగుతున్నందుకు నేను ఆనందించానే కానీ ఏనాడు నిన్ను నాశనం చేయాలనుకోలేదు. ఆ రతీబెన్ గోవిందా స్థలంకోసం నేను ప్రయత్నించిన మాట నిజమే. కానీ ఎప్పుడైతే ఆ స్థలం కోసం నువ్వు మనుషుల్ని పంపి ఫైనలైజ్ చేసుకున్నావని తెలిసిందో ఈసారి నుంచి జాగ్రత్తగా ఉండాలనుకున్నానే కానీ ఎలాగైనా ఆ స్థలం నా సొంతం చేసుకోవాలని నేను అనుకోలేదు"

"నువ్వు ఇలా మాట్లాడుతుంటే దయ్యాలు వేదాలు వల్లిస్తున్నట్టుగా ఉంది. నీ మనుష్యుల్ని పంపి మేము విజేష్ దగ్గరినుంచి వస్తున్నాం. మా బాస్ ఆ స్థలం అక్కర్లేదని చెప్పమన్నారని చెప్పించింది నువ్వు కాదూ. అందుకేగా తర్వాత మేము వెళ్ళినప్పుడు ఆవిడ సైట్ షాకి ఇస్తున్నానంటూ నీ పేరు చెప్పింది"

"నేనా? నేను నా మనుష్యుల్ని పంపానా? "

"అవును! నన్ను నాశనం చేద్దామనుకున్నావ్ ఆఖరకు అందుకోసం దేవుడ్ని కూడా అడ్డుపెట్టుకున్నావ్. కానీ నేను నా తెలివితో నువ్వెన్ని సమస్యలు సృష్టించినా వాటిల్లోంచి బయటపడగలిగాను. ఇప్పుడే కాదు.

నువ్వు నన్ను అణిచివేయాలని ప్రయత్నించిన ప్రతిసారీ రెట్టించిన ఉత్సాహంతో నేను సక్సెస్ అవుతాను. అది చెప్పడానికే ఇప్పుడు ఫోన్ చేశాను" అని ఫోన్ ఆఫ్ చేశాడు విజేష్.

తను విజేష్ పేరుతో రతీబెన్ ఇంటికి మనుష్యుల్ని పంపించాడా? నిజంగానే ఎవరో తమమధ్య గొడవలు పెంచి లాభపడటానికి ప్రయత్నిస్తున్నారు ఎవరు?

"వసంత్? "

అంతలో 'అన్నా' అంటూ చందూవాళ్ళు రావడంతో తన ఆలోచనలోంచి బయటికి వచ్చాడు షా. వసంత్ దగ్గర తన ఆలోచ



నను ఆపకుండా ఉంటే చాలా బాగుండేది.

★ ★ ★

సమయం సాయంత్రం ఆరుగంటలవు తోంది.

మొక్కలకు నీళ్ళు పోస్తున్న రాఘవయ్య గారి దగ్గరకు వచ్చారు శారదమ్మ.

ఆయన చేతిలోని పైప్ తను తీసుకు న్నారు.

ఒక్కక్షణం వరకు ఇద్దరిలో ఎవ్వరూ మాట్లాడలేదు.

"శారదా!" పిల్చారు ఆయన.

"ఏమిటండీ...?"

"అలా వున్నావేం?"

"ఎలా ఉన్నాను?"

"శారదా!" మృదు గంభీరంగా అన్నారు రాఘవయ్య "నీ గురించి నాకు తెలీదా! చెప్పు.. ఏమిటి నీ సమస్య?"

తన మనసులోని సంఘర్షణనంతా భర్తకు చెప్పేస్తే... అవును అదే మంచిది.

"శారదా"

ఆయన ఏదో అనేలోపునే శారదమ్మగారు అన్నారు. "ఏవండీ! కొంచెంసేపు అలా కూర్చుంటారా! మీతో మాట్లాడాలి"

ఆ తర్వాత దాదాపు ఓ గంటసేపు జరిగి నదంతా చెప్పుకొచ్చారు శారదమ్మ.

ఊపిరి బిగపట్టి మరీ అన్ని సంగతులు విన్నారు రాఘవయ్య.

మొత్తం అంతా చెప్పేశాక శారదమ్మగారి మనసు తేలికైంది.

"ఇప్పుడేం చేద్దాం శారదా!" రాఘవయ్య గారి గొంతు ఎక్కడో నూతిలోంచి వస్తు న్నట్టు బలహీనంగా ఉంది.

"ముందు మనం నీరవ్‌షాను కలుద్దా మండీ"

"ఏమిటీ?" ఉలిక్కిపడ్డారు రాఘవయ్య.

"అవునండీ! అబ్బాయికి సుశీల ప్రేమ సంగతి తెలిసిపోయింది. సుశీలని ఏమీ అడ గకుండానే పెళ్ళి ఏర్పాట్లు చేసేస్తున్నాడు వాడు. మరో పక్క దినేష్‌కి ఈ సంగతి తెలి సింది. శాంతిని పెళ్ళి చేసుకోవాలనుకుంటు న్నాడు వాడు. శాంతి సాక్షాత్తు షా కూతురు. ఇన్ని సమస్యలతోపాటు విజేష్, షా ఇద్దరి మధ్య పచ్చగడ్డివేస్తే భగ్గుమంటోంది. ఈ సందర్భంలో ముందు షాతో మాట్లాడాలి. ఆడ పెళ్ళివారి తరపున అతన్ని మన ఇంటికి వచ్చి సంబంధం మాట్లాడమని చెప్పాలి. దాంతో విజేష్ ఇగో కొంతవరకు సంతృప్తి పడుతుంది. నీరవ్‌షా ఎప్పుడూ మన అబ్బా యితో రాజీచేసుకోవాలనే ప్రయత్నం చేస్తు న్నాడు. అందుకని... మనం ఒకసారి నీరవ్ షాని కలిస్తే ఈ సమస్యలు చాలావరకు పరి ష్కారం అవుతాయి" వివరించారు శారదమ్మ.

రాఘవయ్యగారు ఎంతో అబ్బురంగా భార్యవైపు చూశారు.

ఇప్పుడేకాదు ఇంతకుముందు కూడా ఎన్నోసార్లు తనకు విలువైన సలహాలనిచ్చి తనను సమస్యలనుంచి బయటపడేసింది. ఇప్పుడు కూడా...

"శారదా!"

"ఏంటండీ..."

"నువ్వు భార్యవు కావడం నా అదృష్టం"

"నేను కూడా అదేమాట అంటున్నాను" నవ్వారు శారదమ్మ.

ఆవిడ అలా నవ్వితే పసిపాప స్వచ్ఛమైన మనసు కన్పిస్తుంది ఆయనకు.

ఇద్దరి మనసులూ ఇప్పుడెంతో తేలిక య్యాయి.

"అది సరే శారదా! సుశీల ముస్లిం అబ్బా యిని ప్రేమించడం విజేష్‌కి నచ్చలేదా? లేక చెల్లెలికిచ్చిన మాట తప్పాల్సివస్తుం దనా!"

"బహుశా చెల్లెలికిచ్చిన మాట తప్పాల్సి వస్తుందని కావచ్చు అయినా చిన్నతనం నుంచి మనం మన పిల్లలకి దేవుళ్ళందరూ సమానమేనని బోధించాం. అలాంటప్పుడు హిందూ, ముస్లిం బేధాలు వాడిలో ఉంటా యని నేననుకోను" అన్నారు శారదమ్మ.

అంతలో అక్కడికి సుశీల వచ్చింది.





"రామ్మా! చాలా పెద్దదానివైపోయావు" అన్నారు రాఘవయ్య.

సుశీల శారదమ్మగారివంక చూసింది.

ఆవిడ కళ్లతోనే విషయం అంతా చెప్పేశానని చెప్పారు.

"చూడు తల్లీ! ప్రేమించడం తప్పుకాదు. ఆ లెక్కకొస్తే నేను, మీ నానమ్మా కూడా ప్రేమించే పెళ్ళిచేసుకున్నాం. కాకపోతే అది వ్యక్తిత్వపు ఆకర్షణ కావాలి తప్ప"

"లేదు తాతగారూ! అహ్మద్ చాలా మంచివాడు. మీకు పరిచయం చేస్తాను. నామాట నిజమని మీరే ఒప్పుకుంటారు" గభాల్న అంది సుశీల.

ఆ మాట అంటున్నప్పుడు ఆమె ముఖంలో తళుక్కుమన్న కాంతి, మెరుపు ఆమెకి అహ్మద్‌మీద ఉన్న ప్రేమ గురించి చెప్పాయి.

"సుశీలా! రేపు మనం ముగ్గురం నీరవ్‌షా ఇంటికి వెళ్ళాలి. మీ తాతగారితో ఇప్పుడే జరిగినదంతా చెప్పాను" అన్నారు శారదమ్మ.

"అలాగే నానమ్మ" అంది సుశీల.

★ ★ ★

తన ప్రేమ విషయం తండ్రికి తెలిసినప్పటినుంచి వీలైనంతవరకు తండ్రిని తప్పించుకుని తిరుగుతోంది సుశీల.

కానీ ఆరోజు భోజనాల దగ్గర ఎదురుపడాల్సి వచ్చింది.

భోజనం చేస్తున్నంత సేపూ భయంతో ఆమె గుండె దడదడలాడుతూనే ఉంది. తండ్రి మామూలుగా ఉన్నా మనసులో ఈ సంగతి గురించి తండ్రి ఆలోచిస్తూ ఉంటాడని ఆమెకు తెలుసు.

భోజనం ముగించి తన గదిలోకి వెళ్ళబోతుండగా కూతుర్ని పిలిచాడు విజేష్.

"అమ్మా! సుశీలా...! అక్కడ టీపాయ్ మీద వెడ్డింగ్ కార్డ్స్ మోడల్స్ పెట్టాను. నీకు కావాల్సిన మోడల్ సెలక్ట్ చేసుకో" అని భార్యవైపు తిరిగి అన్నాడు; "వెళ్లవోయ్! నీ కూతురికి సహాయం చెయ్యి" అన్నాడు విజేష్.

సుశీల ఖంగారుగా నానమ్మ వంక చూసింది.

"అవునమ్మా! వచ్చే నెలలో మంచి ముహూర్తం ఉందిట. అదే ఖాయం చేశాను. మీ అత్తయ్య వాళ్ళకి కూడా ఫోన్ చేసి చెప్పేశాను. ముందుగా చెప్తే కానీ దినేష్‌కి సెలవు దొరకదు కదా! మీ అత్తయ్య ఈ కబురు విని చాలా ఆనందించిందమ్మా" కూతురి ప్రేమ విషయం తెలీని తండ్రి ఏవిధంగా మాట్లాడతాడో అలానే గలగల మాట్లాడేస్తున్నాడు విజేష్.

"అదేంట్రా... పెద్దవాళ్ళం మాతో ఒక్క మాటైనా చెప్పనక్కర్లేదా? అయినా సుశీల పెళ్ళికి అంత తొందరేం వచ్చిందని? ఆమధ్య దినేష్ వచ్చాడు. సుశీలని చూశాడు. సుశీల చదువు పూర్తయ్యాక ముహూర్తం పెట్టుకుందామనుకున్నారు. మళ్ళీ ఇంతలో ఏమంత తొందరవచ్చింది" కొంచెం గట్టిగానే అడిగారు విజేష్ తండ్రి రాఘవయ్య.

"డాడీ! సుశీల నా కూతురు. నేనేం చేసినా తన మంచికోసమేగా! నేనెందుకు ఈ నిర్ణయానికి వచ్చానో చెప్పడం నాకు ఇష్టంలేదు. పోతే పెళ్ళంటారా? చిన్నప్పటి నుంచి అనుకున్న సంబంధమేగా! పైగా ఇక్కడో చిన్న సమస్య ఉంది"

"ఏమిట్రా అది"

"నాన్నగారూ! ఇక్కడలాగా మనకెప్పుడు కావాలంటే అప్పుడు ఆ దేశంలో లీవు దొరకదు. దినేష్‌కి నెక్ట్స్‌మన్త్ అయితే సెలవు దొరికే అవకాశం ఉందిట. వాడే ఫోన్‌చేసి ఈ విషయం చెప్పాడు. చెల్లాయేమో వచ్చే నెలలో ముహూర్తాలు ఏవైనా దొరుకుతాయేమో చూడరా అంది"

"ఏమిటీ! మధు నీతో మాట్లాడిందా!" అడిగారు శారదమ్మ.

"అవునమ్మా" చెప్పాడు విజేష్.

కొడుకు తమతో అబద్ధం చెప్తున్నాడని

వాళ్ళకి అర్థం అయ్యింది.

"అది కాదురా! సుశీల చదువు పూర్తయితే మంచిది కదా! ఎందుకు చెప్తున్నానంటే ఆమధ్యన ఫోన్ చేసినప్పుడు మధు కూడా ఇదే మాట అంది" చెప్పారు శారదమ్మ.

"అవును నాన్నగారూ!" అంది సుశీల.

విజేష్ సుశీలని దగ్గరకు తీసుకుని చెప్పాడు.

"పెళ్ళైన వెంటనే నిన్ను అమెరికా పంపడానికి వీలులేదు తల్లీ. వీసా రావడానికి కొంత టైం పడుతుంది. ఈలోగా నీ ఫైనల్ ఎగ్జామ్స్ పూర్తవుతాయి. అప్పుడే వెడుదువుగానీ" అని "అయినా అత్తయ్యే కదరా! ఆవిడ నీమీద అత్తగారి అధికారం చూపిస్తుందా చెప్పు. నువ్వంటే మీ అత్తయ్యకు ఎంతో అభిమానం కదరా! ఇంక నీకు సమస్యేముంది? "

"అదికాదు నాన్నగారూ! మీ అందర్నీ వదిలి అంతదూరం వెళ్ళాలంటే"

"నీతోపాటు నానమ్మ, తాతయ్య వస్తారు. కొన్నాళ్ళపాటు అక్కడే ఉంటారు. నానమ్మ ఉంటే నీకు ఎవ్వరూ అక్కర్లేదు కదా! మీ నానమ్మ నీకు బెస్ట్‌ఫ్రెండ్ కదా!" నవ్వాడు విజేష్.

"ఒరేయ్! ఎందుకురా ఈ ముసుగులో గుద్దులాట? అసలు విషయానికి రా...సుశీల పెళ్ళి దినేష్‌తో జరగదు" చెప్పారు రాఘవయ్య.

"ఎందుకని? వాడికేం తక్కువ? "

"ఇక్కడ తక్కువ, ఎక్కువల ప్రసక్తి లేదురా" శారదమ్మగారు కల్పించుకున్నారు.

"మరి..."

"మనసు ప్రధానంరా... ఆ మనసుకి ఎదుటివారు నచ్చడం ముఖ్యం"

తల్లి మాటలు విజేష్‌లో ఆవేశాన్ని మరింత పెంచాయి.

"సరే! ఇష్టంలేదు. మీరన్నట్టు మనసే ప్రధానం. ఒప్పుకుంటాను. కానీ మన మనసైనా ఎవరో చెప్పిన మాట వినదుగా! మనం చెప్పినట్టేగా వింటుంది. మరి ఆ మనసు పెట్టే ఆలోచించి జవాబు చెప్పమను! దినేష్‌కి ఏం తక్కువని? అందం ఉంది. ఐశ్వర్యం ఉంది. అన్నింటినిమించి మన సుశీల అంటే ఎంతో అభిమానం ఉంది. ఏ ఆడపిల్లకైనా ఇంతకన్నా ఏంకావాలమ్మా!" ఊపిరి పీల్చుకునేందుకు ఒక్క క్షణం ఆగాడు. తిరిగి కొనసాగించాడు. "అదంటే చిన్నపిల్ల! దానికేం తెలీదు. కానీ మీకేమైంది? మీ అనుభవం కూడా మీతో ఇలా మాట్లాడించడం నాకు ఆశ్చర్యంగా ఉందమ్మా. దానికి నచ్చచెప్పాల్సింది పోయి మీరు కూడా దాన్ని వెనకేసుకొస్తున్నారా? "

విజేష్ స్వరంలో ఆవేదన తొంగిచూసింది.

"అదికాదురా! జీవితం అంతా కాపురం చేయాల్సింది సుశీల. మనకు కన్పిస్తున్న గొప్ప లక్షణాలన్నీ దానికి కన్పించకపోవచ్చు. ఆ కోణంలోంచి సుశీల కూడా ఆలోచించాలన్న రూలేం లేదురా! దాని వయసు అలాంటిది నిజమే. కానీ ప్రతి మనిషికీ ప్రేమించే హక్కు ఉంది. అలాగే తన జీవితభాగస్వామిని ఎన్నుకునే అధికారమూ ఉంది. సుశీలని ఆ కుర్రాడు ఎందుకు వద్దు అని అడిగితే సుశీల సమాధానం చెప్పలేకపోవచ్చు అంత మాత్రాన సుశీల మనసుకు ప్రాధాన్యత ఇవ్వాల్సిన బాధ్యత మనకు లేదా? " రాఘవయ్య నచ్చజెప్పబోయారు.

"అంటే పెద్దవాళ్ళుగా మన బాధ్యతలేమీ లేవా? "అడిగాడు విజేష్. "చెప్పండి నాన్నగారూ! పిల్లల్ని కని, పెంచడంతప్ప వాళ్ళ జీవితం గురించి మనం ఆలోచించకూడదా! ఒకవేళ మీరన్నట్టు సుశీల ఇష్టప్రకారమే పెళ్ళి జరిపిద్దాం. అతను సరైనవాడు కాకపోతే...అప్పుడేం చెయ్యాలి? "

"నిజమేరా... నీ వాదనలో నిజం వుంది. పిల్లలపట్ల మన బాధ్యత లేదా అని అడిగావు. ఎందుకు ఉండదు. ఉంటుంది. కానీ బాధ్యత పేరుతో వారి మనసుని, ఆ మన





సులోని ప్రేమను చంపేసే అధికారం మాత్రం మనకులేదు" అన్నారు శారదమ్మ.

ఈ గొడవంతటికీ కారణమైన సుశీల మాత్రం 'నాన్న మనసు మార్చు దేవుడా!' అని మనసులోనే ఆ భగవంతుడ్ని ప్రార్థించసాగింది.

"అమ్మా..." అసహనంగా అరిచాడు విజేష్.

"అవునురా! నువ్వన్నట్టు సుశీల ప్రేమించిన కుర్రాడు మంచివాడు కాదనుకుందాం. ఆ రిస్క్ నా చెల్లెలి కొడుకు విషయంలోనూ ఉందిగా. వాడితో పట్టుమని పదిరోజులు ఎప్పుడైనా నువ్వు గడిపావా? వాడు ఇక్కడికి వచ్చినప్పుడు మనందరి మెప్పుకోసం మంచిగా నటిస్తున్నాడేమో? చెప్పగలవా?"

తల్లి ప్రశ్నకు విజేష్ సమాధానం చెప్పలేకపోయాడు.

"కేవలం నీ చెల్లెలి కొడుకు అయినంత మాత్రాన దినేష్ గొప్పవాడు అయిపోతాడా?"

ఈసారి కూడా మౌనమే విజేష్ సమాధానమయ్యింది.

"నువ్వన్న రిస్క్ ఎవర్ని చేసుకున్నా ఉంటుందిరా! నీకున్నది ఒక్కత్తే కూతురు. దాని మనసు తెలుసుకోవడానికి, అర్థంచేసుకోవడానికి ప్రయత్నించు"

"సరే! కానీ దినేష్ నచ్చకపోవడానికి, అతన్నెవరినో ప్రేమించడానికి ఒకేఒక్క కారణం చెప్పమను... ఈ పెళ్ళి ఆపేస్తాను"

తండ్రి కోపం చూసి ఒక అడుగు వెనక్కివేసి తల్లిని కరుచుకుపోయింది సుశీల.

రాజేశ్వరికి ఏంమాట్లాడాలో అర్థంకావడం లేదు.

సుశీల చెయ్యి పట్టుకుని అడిగాడు విజేష్... "చెప్పమ్మా! నేను నీ కన్నతండ్రినే కానీ కసాయివాడిని కాదమ్మా! దినేష్ నీకెందుకు నచ్చలేదో చెప్పు?"

సుశీలకి భయంతో నోటిమాట రాలేదు.

"చెప్పవే..." అంటూ లాగిపెట్టి కొట్టాడు విజేష్.

"నీకు బుద్ధుందా... నీ అంత ఎదిగిన కూతుర్ని పట్టుకుని కొడతావా?" విజేష్‌ని వెనక్కిలాగారు శారదమ్మ.

"కొట్టడం కాదమ్మా! దాన్ని చంపిపారేయాలి. చదువుకోమని కాలేజీకి పంపితే ఒళ్ళు కొవ్వెక్కి ప్రేమ..."

"విజేష్..." అరిచారు రాఘవయ్య. "సుశీల నీ కూతురు. అంత అసభ్యంగా మాట్లాడకు"

"అది కాదురా, ఎంతసేపు నీ మొండితనం నీదేకానీ దాని మనసు అర్థంచేసుకోవడానికి ప్రయత్నించడంలేదు. ఒక వ్యక్తిపట్ల ఎందుకు ఇష్టం ఏర్పడుతుందో ఎవ్వరూ చెప్పలేరురా... నువ్వు నిజంగా నీ కూతురి సుఖమే కోరుకుంటే మాత్రం ఈ పెళ్ళి ఆపు చెయ్యి" నచ్చజెప్పారు శారదమ్మ.

"వీల్లేదు. సుశీల పెళ్ళి దినేష్‌తోనే జరిగి తీరుతుంది" చెప్పాడు విజేష్. ఊపిరి పీల్చుకోవడంకోసం ఒక్కక్షణం ఆగాడు. "ఇది నా ఫైనల్ డిసిషన్. ఎవ్వరికైనా అభ్యంతరం వుంటే వాళ్ళీ పెళ్ళికి రావడం మానేయచ్చు"

"అదే నీ నిర్ణయమా" సూటిగా అడిగారు రాఘవయ్య.

"అవును! నేను నా చెల్లెలికిచ్చిన మాట తప్పలేను. నాకు నా కూతురి మనసుకన్నా దాని సుఖం ముఖ్యం. మనసుదేముంది? దానికి కష్టం అలవాటు చేస్తే కష్టపడుతుంది. ఒకసారి సుఖపడటం అలవాటు అయితే ఇక ఎప్పటికీ కష్టం వైపుకి చూడదు. చిన్నతనంలో మేము పడ్డ ఆర్థిక ఇబ్బందులు నా పిల్లలు పడకూడదనే రాత్రీపగలన్న తేడా లేకుండా కష్టపడుతున్నాను. మీ ఇద్దరికీ నాకిదే విన్నపం" అంటూ తల్లీతండ్రిని ఉద్దేశించి చేతులు రెండూ జోడించాడు విజేష్.

"మీ ఆదర్శాలు నా పిల్లలమీద రుద్దొద్దు. మీరనే ఆ మంచితనం చెప్పుకోవడానికి వినడానికి బావుంటుందికానీ ఆకలేస్తే కడుపు నింపదు"



# ఏరిన ముత్యాలు

* కవిత్వం అందంగానూ, సరళంగానూ, స్పష్టంగానూ, ఇంద్రియజ్ఞాన యుక్తంగానూ, ఆవేశసహితంగానూ ఉండాలి.

—మిల్టన్

* జనాభా పెరుగుదల, నగరాల సంఖ్య పెరుగుదలా కాదు నాగరికత అంటే. జాతి రూపొందించే వ్యక్తులు ఎలాంటి వారన్నదానిమీదే నాగరికత ఆధారపడి ఉంది.

—ఎమర్సన్

* సైన్స్ లేని మతం కుంటిది, మతం లేని సైన్స్ గుడ్డిది.

—ఐన్‌స్టీన్

* అజ్ఞానమనేది మనసుకి రాత్రివంటిది. ఆ రాత్రిలో తారా చంద్రులు కూడా ఉండరు.

—కన్‌ఫ్యూషియస్

* వయసు ముదిరిన తర్వాత అవసరమైన ఆశ్రయం ఇవ్వగలిగేది విజ్ఞానం.

—చెస్టర్ ఫీల్డ్

* నవలా రచయిత ధ్యేయం మనల్ని కథ చెబుతూ ఆనందపరవశుల్ని చేయడం కాదు, మంచి సందేశాన్ని అందించడమే.

—మొపాసా

* జ్ఞానాన్ని మించిన మహాశక్తి ప్రపంచంలో లేనేలేదు.

—హాబ్స్

* ఆత్మీయురాలైన భార్యతో, లేదా ఆత్మీయుడైన భర్తతో పోల్చదగిన వస్తువు ఈ ప్రపంచంలో మరొకటి లేదు.

—వెబ్‌స్టర్

* రచయిత కాదల్చుకున్న వ్యక్తి ముందు ఉత్తమ పాఠకుడు కావాలి.

—డ్రైడన్

* చీకటి నిండిన గర్భగుడిలో భగవంతుడు లేడు, నడిరోడ్డుపై రాళ్లుకొట్టే శ్రమజీవి చెంత నిలిచి ఉన్నాడు.

—రవీంద్రనాథ్ ఠాగూర్

* నిజమైన నటుడు రంగస్థలము ద్వారానే తన దేశానికి నిజమైన సేవ చేయగల్గుతాడు.

—స్టానిస్లావ్ స్కీ

* తాము కృషిచేసే ఆదర్శానికి ప్రమాదం వచ్చినప్పుడు నిజాయితీపరులు ప్రతిఘటిస్తారు, ద్రోహులు బయటపడతారు, వీరులు పోరాడుతారు, బలహీనులు దిగజారిపోతారు.

—ఫ్యూజిక్

సేకరణ: పట్నం శేషంశెట్టి

"బాగా చెప్పావురా. ఆరోజు అమ్మా! అమ్మా! అంటూ ఏడుస్తున్న నిన్ను మీ నాన్నగారు ఆ మంచితనం, మానవత్వంతో నేరా అక్కున చేర్చుకున్నది, లేకపోతే ఏ అనాథ ఆశ్రమంలోనో..."

"శారదా" వారించారు రాఘవయ్య.

"నన్ను చెప్పనివ్వండి. ఇన్నిరోజులుగా ఈ నిజం బయటపెట్టకూడదనే అనుకున్నానండీ. కానీ ఈరోజు వాడు మిమ్మల్నే చిన్న చూపు చూస్తున్నాడు. మీరేం సంపాదించలేదని అంతా తనే సంపాదించానని విర్రవీగుతున్నాడు. ఒరేయ్, ఏమనిషినైతే నువ్వు పూచికపుల్లలా తీసిపడేస్తున్నావో ఆ వ్యక్తి నీకూ నాకూ కూడా జీవితాన్ని ప్రసాదించిన మహానుభావుడురా"

"శారదా, నువ్వు ఆవేశపడవద్దు. నీకు అసలే బి.పి ఎక్కువగా ఉంది. ప్లీజ్... కంట్రోల్ యువర్‌సెల్ఫ్" అనునయించారు రాఘవయ్య.

"లేదండి, వాడికి నిజం తెలియాలి" అని కొడుకువైపు తిరిగి అన్నారు.

"ఒరేయ్... నీకు డబ్బుపిచ్చి పట్టింది కాబట్టే మంచి, మానవత్వం ఏమీ తెలియడంలేదు. కానీ మీ నాన్నగారు తనకేమీకాని నిన్ను, నన్ను కేవలం మంచితనానికి విలువిచ్చే ఆదుకున్నారు. ఆనాడు మీ నాన్నగారు ఆదుకోకపోతే కూలిన శిథిలాలకింద జీవచ్ఛవాల్లా పడివుండే వాళ్ళం"

"అమ్మా... బాధగా కళ్ళు మూసుకున్నాడు విజేష్.

ఆ మాటలు వినగానే అతని ముఖంలో రక్తం అంతా ఇంకిపోయినట్టుగా పాలిపోయింది.

"అవునురా! ఇన్నాళ్ళ తర్వాత ఈ విషయం గుర్తుచేసుకోవడం నాకు బాధగానే ఉందిరా. కానీ ఇదే వాస్తవం. నువ్వు మా కన్నకొడుకువి కాదురా, నిన్ను మేము పెంచుకున్నాం"

శారదమ్మగారి కనులముందు గతం అంతా కదలాడింది.



ఇప్పుడంటే వయసు మీదపడి శారదమ్మ అయిందిగానీ ఆవిడ పేరు శారద. ఆ అమ్మాయి చూస్తే ఇలాంటి కూతురుంటే ఎంత బాగుండు అనిపిస్తుంది.

నొప్పించక తానొవ్వక రీతిలో మసులుకుంటుంది శారద. చుట్టుపక్కల వాళ్ళందరికీ తలలో నాలుకలా ఉంటుంది. పిల్లలందరకి ఆమె శారదక్క. ఆదివారం వచ్చిందంటే పిల్లలంతా శారదక్క ఇంట్లో చేరి ఆమెతో ఆడి ఆనందిస్తుంటారు.

శారద ఈమధ్యనే డిగ్రీ పూర్తిచేసింది.

ప్రస్తుతం తండ్రికి చీరల వ్యాపారంలో సహాయంచేస్తోంది.

శారద అద్భుతంగా ఎంబ్రాయిడరీ చేస్తుంది. అందువల్లనే డిజైనల్ చీరలపట్ల మక్కువ వున్నవారు శారద తండ్రి నడిపే దుకాణానికి వచ్చి చీరలు ఆర్డరు ఇస్తుంటారు.

ఒక్కత్తే కూతురు కావడంవల్ల ఆశుతోష్‌కు శారద అంటే పంచప్రాణాలు.

గత నెలరోజులుగా శారద తన స్నేహితు

రాలికోసం పెళ్ళిచీరమీద ఎంబ్రాయిడరీ చేస్తోంది.

ఎంత దీక్షగా కుడుతోందంటే స్నేహితురాలు వచ్చిన సంగతి కూడా గమనించలేదు. చాలా సేపటి తర్వాత తలెత్తి చూసేసరికి ఎదురుగా స్నేహితురాలు కనిపించింది.

"ఏయ్... శ్యామా! ఎంతసేపైంది వచ్చి?" సంతోషంగా అంది శారద.

"ఓ అరగంట అయ్యుంటుంది" చెప్పింది శ్యామాబెన్.

"అవునా" అంటూ ఆశ్చర్యపడింది శారద. "మరి పలకరించలేదే..."

"ఏమో! చాలా దీక్షగా పనిచేస్తునావుకదా! ఎందుకు డిస్టబ్ చేయకూడదని"

"చాల్లే... ఇదిగో నీ చీరే కుడుతున్నాను" చూపించింది శారద.

స్నేహితురాలి పనితనం గురించి శ్యామాకు తెలుసు. కానీ తనకోసం ఎంతో శ్రద్ధగా కుడుతుండేసరికి ఆమె కళ్లు చెమర్చాయి.

"శారదా! చాలా థాంక్స్" అంది శ్యామాబెన్.

"ఎందుకు?" అడిగింది శారద.

"నాకోసం ఎంతో శ్రమ తీసుకుంటున్నావు" అస్పష్టంగా గొణిగింది శ్యామాబెన్. స్నేహితురాలికి పొగడ్తలు, కృతజ్ఞతలు ఇష్టం ఉండవని ఆమెకు తెలుసు. అలా అని కృతజ్ఞత ప్రకటించకుండా ఉండలేకపోయింది.

"నీముఖం..." హాయిగా నవ్వేసింది శారద. "ఇందులో శ్రమ ఏముంది? నా ప్రాణమిత్రురాలు రేపు పెళ్ళిలో నేను కుట్టిన చీర కట్టుకుంటుందంటే నాకు ఎంతో ఆనందంగా ఉంటుంది"

శ్యామాబెన్ ముఖం విప్పారింది.

అంతలో శారద వాళ్ళ అమ్మగారు వచ్చారు.

"ఏమ్మా! పెళ్ళికూతురా" అని పలకరించారు ఆవిడ.

"బాగున్నారా ఆంటీ"

"బాగున్నానమ్మా! పెళ్ళిపనులు ఎంతవరకు వచ్చాయి?"

"అవుతున్నాయాంటీ" జవాబిచ్చింది శ్యామా.

"అదిసరే... నీ స్నేహితురాలు పెళ్ళి ఎప్పుడు చేసుకుంటుందో అడిగావా?"

ఆ మాటకి శ్యామా స్నేహితురాలివంక చూసి కళ్ళెగరేసింది. 'చెప్పమంటావా?' అని సైగచేసింది. శారద 'ప్లీజ్, చెప్పద్దు' అని బ్రతిమలాడింది.

వారిద్దరి సైగలకు అర్థం ఏమిటో ఆవిడకు అర్థంకాలేదు.

"నీకు తెలిసినవాళ్ళెవరైనా ఉంటే చెప్పమ్మా! ఈ సంవత్సరం శారద పెళ్ళి చేసేద్దాం అనుకుంటున్నాం" అన్నారావిడ.

పెళ్ళి ప్రస్తావన వచ్చేసరికి ఎందువల్లనో శారద ముఖం వాడిపోయింది.

"ఆంటీ! శారదను మా ఇంటికి తీసుకువెడదామనుకుంటున్నాను పంపిస్తారా?" రిక్వెస్టింగ్‌గా అడిగింది శ్యామా.

"నన్ను అడిగేదేముందమ్మా! నేను వద్దంటే మానేస్తుందా? వెళ్ళమంటే వెడుతుందా? అంతా దానిష్టం. వాళ్ళ నాన్నగారు శారదను మరీ గారాబంచేసి మొండిదాన్ని చేసేశారు"

అంతలో లోపలినుంచి కోడలు పిలవడంతో ఆవిడ వాగ్ధాటికి ఆనకట్టపడింది. లేదంటే ఎంతసేపైనా ఆవిడ అలా మాట్లాడుతూనే ఉంటుంది. కూతురిలో తప్పులు ఎంచుతూనే ఉంటుంది.

అలా అని కూతురంటే అభిమానంలేదని కాదు. శారద అంటే ప్రాణమే. కాకపోతే 'కొడుకే కుటుంబాన్ని ఉద్ధరిస్తాడు. పున్నామ నరకంనుంచి తప్పిస్తాడు' అన్న భావాలు ఆవిడలో కొంచెం ఎక్కువ. ఆడపిల్ల ఎప్పటికైనా ఆడపిల్లేనని ఆవిడ అభిప్రాయం. అదీగాక భర్త కూతుర్ని నెత్తిమీద పెట్టుకుని కొడుకుల్ని గురించి పట్టించుకోక




పోవడం, వారి మాటకు విలువనివ్వకపో వడం ఆవిడకు నచ్చడంలేదు.

ఇంటి వ్యవహారాలలో సలహాలు, సంప్ర దింపులు శారదతోనే.

ఏదైనా కొనాలంటే శారదతో చర్చించాకే. వ్యాపారం గురించిన మాటలు శారదతోనే. అశుతోష్ ఇంటికి రాగానే శారద కన్పిం చాలి.

ఆయనకు కూతురే భోజనం వడ్డిం చాలి... మందులివ్వాలి.

నిద్ర లేవగానే శారద ఆయన కళ్ళ ముందు ఉండాలి. కళ్ళు తెరవగానే మొద టగా శారద ముఖమే చూడాలి.

ఇదంతా ఆవిడకు చికాకు కల్గిస్తోంది. కూతురిమీద ప్రేమ ఉండడంలో తప్పులేదు , కానీ మిగతావారిని కనీసం మనుషుల్లా కూడా చూడడంలేదని బాధపడ్తోంది. దాని కితోడు కొడుకులు కూడా తల్లిదగ్గర తెగబా ధపడిపోతున్నారు. భార్యల దగ్గర తమకు విలువ ఉండదని వారి బాధ. దాంతో ఆవి డకు ఒక్కటే పరిష్కారం కన్పించింది. వెంటనే శారదకి పెళ్ళిచేసి పంపేయాలి. అందుకే భర్తని పోరుపెడుతోంది. కన్పిం చిన ప్రతివాళ్ళకి శారదకి మంచి సంబంధం చెప్పమని అడుగుతోంది.

తల్లితో చెప్పి శారద స్నేహితురాలితో బయలుదేరింది.

"ఏమిటే... ఇంకా నువ్వు మీ బావ గురించి చెప్పలేదా? " అడిగింది శ్యామ్‌బెన్.

"లేదు" దిగాలుగా అంది శారద.

"ఏం? "

"ఏమో... అత్తయ్య అంటే అమ్మకి ఇష్టం లేదు. నేను బావని ఇష్టపడుతున్నానంటే ఏదో ఒక సంబంధం చూసి అమ్మ నా పెళ్ళి జరిపించేస్తుంది. నీకు తెలుసుగా అమ్మ పంతం పడితే నాన్నగారు కూడా ఏం చేయలేరు... అందుకు"

"అందుకని... ఓ పక్క వాళ్ళు నీకు సంబంధాలు చూస్తున్నా మీ బావ సంగతి చెప్పకుండా దాచిపెడ్తావా? "

"లేదు... ముందు నాన్నగారికి అసలు విషయం చెప్పేస్తాను. ఆ తర్వాత అన్నీ ఆయనే చూసుకుంటారు" ధీమాగా పలి కింది శారదస్వరం.

"ఆ పనేదో తొందరగా చెయ్యి... లేదంటే తరవాత బాధపడాల్సివస్తుంది" హెచ్చరిం చింది శ్యామబెన్.

"లేదు శ్యామా!" స్నేహితురాలి చెయ్యి తన చేతుల్లోకి తీసుకుంది. శారద. "నీ పెళ్ళి అవగానే నా విషయం మా ఇంట్లో చెప్పేస్తాను" అంది శారద.

శ్యామా తేలికగా ఊపిరి పీల్చుకుంది.

★ ★ ★

శారదను చూసి శ్యామా వాళ్ళమ్మ చాలా ఆనందించింది. శారదంటే శ్యామా వాళ్ళింట్లో అందరికీ ఇష్టమే. నిజానికి శార దను వాళ్ళింటి కోడలిని చేసుకోవాలని కూడా అనుకుంటున్నారు. శ్యామా అన్నయ్య చక్రవర్తికి అమెరికాలో ఉద్యోగం. అమెరికా అబ్బాయి శారదను ఇష్టపడతాడో లేదోనని వారి అనుమానం.

"శారదా! తను మా అన్నయ్య" ఇంట్లోకి అడుగుపెట్టగానే ఎదురైన చక్రవర్తిని పరి చయం చేసింది శ్యామా.

"హలో..." అంటూ చెయ్యి చాపాడు చక్ర వర్తి.

మర్యాదపూర్వకంగా చేతులు రెండూ జోడించింది శారద.

ఓ.కే... అనుకుంటూ భుజాలు ఒకసారి ఎగరేశాడు చక్రవర్తి.

చెల్లెలి పెళ్ళికోసం అమెరికానుంచి వచ్చా డతను. చాలారోజుల తర్వాత అమెరికా నుంచి రావడంతో స్నేహితులు చాలా మంది అతన్ని చూడడానికి వస్తున్నారు.

ఆ తర్వాత కూడా ఇంట్లో అవీ ఇవీ పనులు చక్కబెడుతూ అందరికీ తలా ఒక పని పురమాయిస్తూ ఇల్లంతా బిజీగా తిరు గుతున్న శారద చాలాసార్లు అతనికి కన్పిం

చింది.

శారదలో ఓ గొప్ప గుణం ఉంది. తను ఎంత ఉత్సాహంగా పనులు చక్కబెడుతుందో అంతే ఉత్సాహంగా అందరితో పనులు చేయిస్తుంది. అందుకే ఆమె వచ్చాక అంతా తలా ఒక పని అందుకోవడంతో శ్యామా వాళ్ళమ్మ గారికి టెన్షన్ తగ్గింది.

ఆ సాయంత్రం పెళ్ళికొడుకు వాళ్ళొచ్చారు.

ఆ తర్వాత శ్యామా పెళ్ళి అయ్యేంతవరకు శారద అక్కడే ఉండిపోయింది. శారద మంచితనం, ఆ అమాయకత్వం చక్రవర్తిని ఆకట్టుకున్నాయి.

పెళ్ళికి శారద తల్లి, తండ్రి కూడా వచ్చారు.

శ్యామా వాళ్ళని సాదరంగా ఆహ్వానించింది. వాళ్ళకేం కావాలో దగ్గరుండి చూసుకోమని చక్రవర్తికి పురమాయించింది.

శారద తల్లితండ్రులకి చక్రవర్తి బాగా నచ్చాడు.

ఆ క్షణంలోనే వాళ్ళు ఒక నిర్ణయానికి వచ్చేశారు.

★ ★ ★

గుడికని బయలుదేరింది శారద.

ఆమెకి దేవుడి భక్తి ఎక్కువ. శ్యామా పెళ్ళి హడావిడి మూలంగా నాలుగైదు రోజులుగా గుడికి వెళ్ళడానికి వీలుబడలేదు. దారిలోనే ఎదురయ్యాడు ఆమె మేనత్తకొడుకు.

బావను చూసేసరికి శారద ముఖం సంతోషంతో వెలిగిపోయింది.

అతని పేరు కిషన్‌మేఘాని. స్వయాన శారదకు మేనత్తకొడుకు.

శారద తండ్రి అశుతోష్, మేఘాని తల్లి అన్నాచెల్లెళ్ళు. అశుతోష్‌కి చెల్లెలంటే ఎంతో ఇష్టం. ఎప్పుడైతే తను కుదిర్చిన సంబంధం కాదని తన మనసుకి నచ్చిన వాడిని పెళ్ళి చేసుకుందో ఆనాటినుంచి చెల్లెలితో తన అనుబంధాన్ని తెంచుకున్నాడు అశుతోష్.

శారద తల్లికూడా మంట రాజేసిందేతప్ప అన్నాచెల్లెళ్ల మధ్య సయోధ్య కుదర్చాలని ఆమె ఏనాడూ అనుకోలేదు.

భర్త తప్పితే భర్తతరఫువారు ఇంటికివచ్చి రోజుల తరబడి తిష్టవేయడం ఆవిడకు ఇష్టం వుండదు.

శారద ఇందుకు పూర్తిగా వ్యతిరేకం. ఆమెకి అందరూ కావాలి. తండ్రిని అత్తయ్యను కలపాలనే ఆమె బావను పెళ్ళిచేసుకోవాలనుకుంది. కానీ అతన్ని ఇష్టపడటం మొదలెట్టాకగానీ అతని మంచితనం ఆమెకి అర్థంకాలేదు.

"బావా, నువ్వు ఇక్కడ"

"ఏంచెయ్యను శారదా, మీ ఇంటికి వస్తే అత్తయ్య, మావయ్య ఊరుకోరు. నానా మాటలు అంటారు. భరించలేక నేనూ ఒక మాట అనాల్సి వస్తుంది. దాంతో మాటా మాటా పెరిగి గొడవకి దారితీస్తుంది. ఆ తర్వాత అత్తయ్య, మావయ్య మన పెళ్ళికి ఒప్పుకుంటారా? అందుకే నీకోసం రోజూ ఇక్కడికొస్తున్నాను. ఏదో అమ్మగారి దర్శనం ఇన్నాళ్ళికి లభించింది."

"మేఘానీ ప్లీజ్... నేను ఫోన్‌చేశాను. కానీ నువ్వు ఇంట్లోనూ లేవు, ఆఫీసులోనూ లేవు"

"అదిసరే అమ్మాయిగారు ఏదైనా ఊరెళ్ళారా? " అడిగాడు మేఘానీ.

"లేదు బావా! అయినా నీకింత మతిమరుపేంటి? " చిరుకోపంతో అంది శారద.

"మతిమరుపా! నాకా? "

"అవును... నీకే... లేకపోతే మరేంటి? శ్యామా పెళ్ళి విషయం నీకు చెప్పాను కదా"

ఆ విషయం అప్పుడే గుర్తుకు వచ్చినట్టుగా "ఓహ్... సారీ... నిజంగానే మర్చిపోయాను. అదిసరే పెళ్ళి బాగా జరిగిందా? " అడిగాడు మేఘానీ.

ఆ మాటకి పూసగుచ్చినట్టు పెళ్ళి విశేషాలన్నీ చెప్పింది శారద.

"బాగుంది... స్నేహితురాలి పెళ్ళి విశే

షాలు బానే చెప్తున్నావు ఇంతకీ అమ్మాయి గారి పెళ్ళెప్పుడో"

ఆ మాటకి శారదకి సిగ్గు ముంచుకొచ్చింది.

"అక్కడ కూడా అందరూ ఇదేప్రశ్న అడిగారు బావా! నేను మన విషయం నాన్నగారితో చెప్పేద్దామనుకుంటున్నాను" నెమ్మదిగా స్ఫుటంగా చెప్పింది శారద.

శారద చెప్పింది మేఘానికి చాలా ఆనందాన్నిచ్చింది.

ఆ తర్వాత ఇద్దరూ గుడికివెళ్ళి పూజ చేయించుకుని మరికాసేపటికి ఎవరింటికి వాళ్ళు వెళ్ళిపోయారు.

తండ్రితో తను బావని ఇష్టపడుతున్నానన్న సంగతి ఎలా చెప్పాలో అర్థంకాక అద్దం ముందు నిలబడి రిహార్సల్స్ వేసుకుంది.

★ ★ ★

అశుతోష్ సరిగ్గా షాపు మూసేయబోతుండగా శ్యామా తండ్రి వచ్చాడు. ఆయనను సాదరంగా ఆహ్వానించాడు అశుతోష్.

కొంతసేపు వ్యాపారం గురించి, గుజరాత్ రాజకీయాల గురించి మాట్లాడుకున్నారు. తర్వాత శ్యామా తండ్రి వార్ధా అసలు విషయంలోకి వచ్చారు.

"మీ శారదకి సంబంధాలు చూస్తున్నారా?"

ఆయన ఎందుకొచ్చారో అశుతోష్‌కి చూచాయగా విషయం అర్థమైంది. కానీ తనంతటతానుగా బయటపడదల్చుకోలేదు. అబ్బాయి వాళ్ళ ఇంటికి వెళ్ళి పెళ్ళిసంబంధం గురించి మాట్లడటానికీ, వారే స్వయంగా వచ్చి మీ అమ్మాయిని మా కోడలిని చేసుకుంటాం అని అడగడానికి చాలా తేడా వుందన్న సంగతి ఆయనకు తెలుసు.

నిజానికి అశుతోష్‌కి చక్రవర్తి బాగా నచ్చాడు. శ్యామా వాళ్ళ నాన్నతో ఈ విషయం గురించి మాట్లాడాలని కూడా అనుకున్నాడు. కాకపోతే అశుతోష్ వ్యాపారి. ఏ వ్యాపారంలోనైనా రాణించాలంటే ఎదుటివ్యక్తి మనసులో ఏంవుందో తెలుసుకోగల నేర్పు ఉండాలి. ఆవిధంగా అశుతోష్ సమర్థుడే. అందుకే గుజరాత్ లోనే ప్రముఖ చీరల వ్యాపారి కాగలిగాడు.

మొదట తనే వెళ్ళి శారదను చక్రవర్తికి చేసుకోవడం శ్యామా కుటుంబానికి ఇష్టమో కాదో కనుక్కుందామనుకున్నారు. కానీ ఎప్పుడైతే చక్రవర్తి శారదను అభిమానిస్తున్నాడని తెలుసుకున్నారో తన నిర్ణయం వాయిదా వేసుకున్నారు. ఈ విషయంలో ఆయన ఏమాత్రం తొందర పడదల్చుకోలేదు. చక్రవర్తి తప్పకుండా శారద విషయం తల్లిదండ్రులతో చెప్పి వాళ్ళని తమ దగ్గరికి పంపుతాడని అశుతోష్ ఊహ. ఒకవేళ అలా జరగకపోతే అప్పుడే వెళ్ళి అడగచ్చులెమ్మని ఊరుకున్నారాయన.

"లేదండీ..." అన్నారు అశుతోష్.

"మా శ్యామా ఈడుదేకదా! పెళ్ళి సంబంధాలు చూడటం లేదంటే బహుశా పైచదువులు చదివించాలనుకుంటున్నారా?" అడిగారు వార్ధా.

"అదేంలేదండీ! ఇకపై చూడాలి. ఒక సంవత్సరం ఆలస్యం అయినా మంచి సంబంధం చూసి చెయ్యాలన్నది నా కోరిక. మీరంటే ఇట్టే మంచి అల్లుడ్ని కొట్టేశారు. అందరికీ అంత తొందరగా దొరకద్దూ..."

అశుతోష్ మాటలు సరిగ్గా ఎక్కడ తగలాలో అక్కడ తగిలాయి. వార్ధా నిజంగానే ఆ మాటలకు సంబరపడ్డాడు.

"అంటే నేను మా అమ్మాయికి మంచి సంబంధమే చేశానంటారు..."

"అందులో ఎలాంటి సందేహమూలేదు" అన్నాడు అశుతోష్.

"అలా అయితే శారదకు ఓ మంచి సంబంధం చెప్పమంటారా?"

అశుతోష్ కొంచెం ముందుకి వంగి "చెప్పండి" అన్నారు.

"మీ అమ్మాయిని మా ఇంటికోడల్ని చేసుకోవాలనుకుంటున్నాం"



అశుతోష్‌కి ఆనందంతో మాటరాలేదు. ఆయన మౌనాన్ని వార్ధా మరోలా అర్థంచేసుకున్నాడు. "మీకు అభ్యంతరం లేకపోతేనే" అని,

"అశుతోష్‌గారూ! మాకు చాలారోజుల నుంచి మనసులో ఈ ఆలోచన ఉంది. మాకున్నది ఒక్కడే అబ్బాయి. పైగా వాడు కూడా అమెరికాలో ఉంటున్నాడు. వాడి ఇష్టాలేమిటో, పెళ్ళిగురించి వాడి ఆలోచనలేమిటో తెలీదు. ఫోనులో ఎన్నిసార్లు అడిగినా అప్పుడే నా పెళ్ళికేం తొందర? అనో... నేను ఇండియా వచ్చాక మాట్లాడుకుందాం అనో. మాట దాటేసేవాడు. పోనీ ధైర్యంచేసి మిమ్మల్ని అడుగుదామా అంటే తీరా మీ అమ్మాయి మా వాడికి నచ్చకపోతే అనవసరంగా మీ అమ్మాయికి ఆశలు కల్పించినవాళ్లం అవుతాంకదా! అందుకే వాడు వచ్చాక మీ అమ్మాయి గురించి చెప్పి మావాడు ఇష్టపడితే అప్పుడు మిమ్మల్ని అడగొచ్చులెమ్మనుకున్నాం. ఈరోజు వాడంతటవాడే ఈ విషయం ప్రస్తావించాడు. మీ అమ్మాయి తనకు బాగా నచ్చిందని చెప్పాడు. అందుకే ఇలా రావాల్సి వచ్చింది" అసలు విషయం వివరించాడు వార్ధా.

ఆయన చెప్పింది అశుతోష్‌కి మరింత ఆనందాన్ని ఇచ్చింది.

"వార్ధాగారూ! మీతో సంబంధం అందుకోవడమంటే మాకు ఆనందమే. కాకపోతే" సందిగ్ధంగా ఆగిపోయాడాయన.

"కాకపోతే... ఏమిటో చెప్పండి"

"ఏంలేదు. ముందుగా మా అమ్మాయితో మాట్లాడి ఆ తర్వాత..."

"అంతేకదా" రిలీఫ్‌గా నవ్వాడు వార్ధా.

"తొందరేముంది? మీ అమ్మాయిని కనుక్కున్నాకే మీ నిర్ణయం చెప్పండి". అని లేచాడు వార్ధా.

"పదండి, నేనూ అటేగా వెళ్ళాలి. మిమ్మల్ని డ్రాప్‌చేసి నేను వెడతాను" అశుతోష్ షాపు తాళాలు తీసుకున్నాడు.

"ఫర్వాలేదులెండి. బయట మా అబ్బాయి నాకోసం ఎదురుచూస్తున్నాడు"

ఆమాట చెవుల్లో పన్నీరు పోసినట్టుగా వినిపించింది అశుతోష్‌కి. కొడుకు ఎంత బలవంత పెట్టకపోతే ఓ పక్క కూతురి పెళ్లై రెండు రోజులు కూడా కాకముందే కొడుకు సంబంధం మాట్లాడటానికి వస్తారాయన

"అదేంటి? లోపలకి రమ్మనలేకపోయారా? "

ఆ మాటకి వార్ధా బిగ్గరగా నవ్వుతూ "లేదులెండి. ఎంత అమెరికాలో ఉంటున్నా పెళ్ళి అనేసరికి వాడికి కూడా సిగ్గుముంచుకొచ్చింది"

వార్ధాతోపాటు అశుతోష్ కూడా శృతి కలిపాడు.

మరోసారి వెళ్ళొస్తానని చెప్పి వార్ధా వెళ్ళిపోయారు.

★ ★ ★

తండ్రి రాకకోసం బాల్కనీలో ఎదురుచూడసాగింది శారద. రోజూ ఈపాటికి రావాలే... మరి ఇంకా ఎందుకు రాలేదు అనుకుంటూ అసహనంగా టైం వంక చూసుకుంటోంది. ఎప్పుడైనా ఆలస్యం అవుతుందంటే ఇంటికి ఫోన్‌చేసి చెప్తారు. ఈరోజు ఫోన్ కూడా చేయలేదు.

మరో పది నిముషాలకు శారద నిరీక్షణ ఫలించింది. తండ్రి వస్తున్నట్టుగా కారు సౌండ్ వినిపించింది.

అంతే గబగబ బయటకు నడిచింది శారద.

కూతుర్ని చూస్తే చాలు ఆ తండ్రికి పొద్దున్నించీ పడిన శ్రమంతా చేత్తో తీసేసినట్టుగా మాయమవుతుంది.

"ఏంట్రా... నాకోసం ఎదురుచూస్తున్నావా? " ఆప్యాయంగా కూతుర్ని దగ్గరకు తీసుకున్నాడు అశుతోష్.

"అవును నాన్నగారూ! నేను మీతో ఓ ముఖ్య విషయం మాట్లాడాలి"

"నేను కూడా నీతో ఓ ముఖ్య విషయం

చెప్పాలా... ఉండు... ముందు ఈ స్వీట్ తిను" కూతురి నోట్లో ఓ స్వీట్ ఉంచాడా యన.

ఇద్దరూ కలిసి లోపలికి వచ్చారు.

భార్యను, కొడుకులను, కోడళ్లను బయటికి పిలిచాడు అశుతోష్. "నా కూతురు చాలా అదృష్టవంతురాలు. కనకనే ఎంతో గొప్ప సంబంధం దానిని వెతుక్కుంటూ వచ్చింది" అంటూ వార్తా తనవద్దకు వచ్చి మాట్లాడిన విషయం వివరంగా చెప్పాడు అశుతోష్.

శారద తల్లికీ, అన్నావదినలకి సంబంధం బాగా నచ్చింది.

అశుతోష్ భార్యకీ, పిల్లలకి స్వీట్స్ ఇచ్చాడు. పెళ్ళి ఎప్పుడు చేయాలి, ఎలా చేయాలి అని మాట్లాడుకుంటూ కూర్చున్నారు.

శారదకి ముద్ద దిగడంలేదు. కానీ అందరిముందూ బయటపడడం ఆమెకి ఇష్టం లేదు. తల్లి ఎదురుగా మేఘానీ గురించి చెప్తే 'ఆవిడ ఏదో ఒకరకంగా అడ్డుపడుతుంది. అందుకే తండ్రికే చెప్పాలి.

మౌనంగా భోజనం ముగించి తన గదిలోకి వెళ్ళిపోయింది శారద.

కూతురు సిగ్గుపడుతోందనుకున్నాడు అశుతోష్.

★ ★ ★

ఆ తర్వాత ఎంత ప్రయత్నించినా తండ్రికి అసలు విషయం చెప్పలేకపోయింది శారద. తండ్రిని అంత సంతోషంగా ఎప్పుడూ చూడలేదు ఆమె. అందుకే ధైర్యం చేయలేకపోతోంది.

శ్యామాకి ఈ విషయం తెలుసుకదా! తెలిసి తండ్రిని ఎలా పంపించింది? వెంటనే శ్యామాకి ఫోన్ చేసింది. తాను అత్తారింటి నుంచి ఇప్పుడే వచ్చానని ఈ సంగతి కూడా ఇప్పుడే వింటున్నానని ఆమె చెప్పింది.

శారదకి ఏం చేయాలో అర్థంకావడం లేదు. అన్ని విషయాల్లోనూ ముందుగా తన అభిప్రాయం తెలుసుకునే తండ్రి పెళ్ళి విషయంలో తన అభిప్రాయం అడగకపోవడం ఆమెకి కోపం తెప్పిస్తోంది.

శారద అభిప్రాయంతో సంబంధం లేకుండానే పెళ్ళిపనులు జరిగిపోతున్నాయి. ఇక తప్పని పరిస్థితుల్లో వెళ్ళి తల్లికి చెప్పింది. ఆవిడ కూతురి మనసు అర్థం చేసుకోలేకపోయింది. ఈ విషయం ఇప్పుడా చెప్పేదంటూ కేకలు వేసింది. 'నిన్ను మేం అందలం ఎక్కించాలని చూస్తుంటే నువ్వు ఆ దౌర్భాగ్యుడ్ని పెళ్ళి చేసుకుంటానంటావా?' అని అరిచింది.

శారద సమాధానం చెప్పలేకపోయింది.

తండ్రి ఇంటికి రాగానే విషయం తెలిసినట్టుంది శారద గదిలోకి వెళ్ళాడు. చాలా సేపు కూతురికి నచ్చచెప్పారు. చివరగా ఈ పెళ్ళి జరగకపోతే తాను ఆత్మహత్య చేసుకుంటానని బెదిరించారు.

శారద కూడా మేఘానీ ఎంతో మంచివాడని నచ్చచెప్పపోయింది. కానీ అశుతోష్ మాత్రం వినిపించుకోలేదు. తనను కాదని వెళ్ళిపోయిన చెల్లెల్ని ఈ జన్మలో క్షమించేది లేదని తెగేసి చెప్పారు.

తండ్రి ప్రాణంకోసం తన ప్రేమను త్యాగం చెయ్యాల్సి వచ్చింది శారదకు.

★ ★ ★

శారద ఇప్పుడు ఎవ్వర్నీ కలవడంలేదు. అసలు తన గదిలోంచి బయటికే రావడం లేదు. ఆమె ముఖంలో పూర్వపు సంతోషం లేదు. మనిషి ఎప్పుడూ ఏదో కోల్పోయినట్టుగా ఉంటోంది.

కూతురి అవస్థను గమనించినా అశుతోష్ గమనించనట్టుగానే ఉండిపోయాడు. ఈ బాధ తాత్కాలికమనీ, పెళ్ళైతే కూతురు అన్నీ మర్చిపోతుందని ఆయన అభిప్రాయం.

పెళ్ళికి పదిరోజులే ఉండడంతో ఇంట్లో అందరూ పెళ్ళిపనుల్లో హడావిడిగా ఉన్నారు. ఒక్కొక్కరే పెళ్ళికి వస్తున్నారు. దూరంగా ఉన్న బంధువులకి ఫోన్స్ చేసి

చెప్పేశారు.

ఆ సాయంత్రం మేనమామ భార్యతో కలిసి గుడికి వెళ్ళింది శారద. ఆరోజే ఆమెని పెళ్ళికూతుర్ని చేశారు. గుడిదగ్గర మేఘానీ ఎదురుచూస్తున్నాడు.

శారదకి అడుగు ముందుకు పడలేదు.

ఆమెని చూడగానే మేఘానీకి విషయం అంతా అర్థమయ్యింది.

శారదతోపాటు వచ్చిన ఆవిడ ఎవరో కన్పిస్తే మాట్లాడసాగింది.

మేఘానీవైపుకు నడిచింది శారద.

ఒక నిమిషంపాటు ఇద్దరూ ఒకరినొకరు చూసుకుంటూ ఉండిపోయారు. ఇద్దరి లోనూ ముందుగా తేరుకుంది శారద. "బావా! నన్ను క్షమిస్తావా!" అని మాత్రం అనగలిగింది.

"లేదు శారదా! నువ్వే నన్ను క్షమించాలి' అన్నాడు మేఘానీ.

"బావా!"

"అవును శారదా! నిజంగా నువ్వు చేసింది మంచిపనే!" మనస్ఫూర్తిగా అన్నాడు మేఘానీ.

"నేను ఇంట్లో చాలా పోరాడాను బావా! కానీ నిన్ను చేసుకుంటే నాన్న చనిపోతానని బెదిరిస్తున్నారు. నా ప్రేమా! నా తండ్రి ప్రాణమా! ఈ డైలమాలో నా ప్రేమను త్యాగం చెయ్యక తప్పలేదు" పంటి బిగువున బాధను దాచిపెట్టింది శారద.

"శారదా! ప్లీజ్... పెళ్ళికూతురు కంటతడి పెట్టకూడదు..." ఓదార్చాడు మేఘానీ.

"నీకు... నీకు బాధగా లేదా బావా? "

"శారదా! మనం అనుకున్నవన్నీ జరిగితే ప్రపంచంలో దుఃఖం, కష్టం అనేవే ఉండ వేమో! నువ్వే కాదు... నేను కూడా నా తల్లి కోసం మన ప్రేమను త్యాగం చెయ్యక తప్ప డంలేదు"

"బా...వా..."

"అవును శారదా! అమ్మ ఎంతైనా ఆయన గారి చెల్లెలేగా! నువ్వు ఆడపిల్లవి. నేనో అబ్బాయిని ప్రేమించాను. అతన్నే పెళ్ళి చేసుకుంటాను అని ఎలా చెప్పగలవు? అందుకే అమ్మని మీ ఇంటికి పంపుదామను కున్నాను. మన ప్రేమ విషయం అమ్మకి చెప్పాను"

"అత్తయ్య ఏమంది? "

"ఏమంటుంది? ఆ అన్నకి తగ్గ చెల్లెలేగా! ఈ పెళ్ళి జరగడానికి వీల్లేదంది. తను చెప్పిన అమ్మాయిని పెళ్ళాడకపోతే ఉరేసు కుని ఛస్తానని నన్ను బెదిరించింది" చెమ ర్చిన కళ్ళను తుడుచుకున్నాడు మేఘానీ.

"సారీ బావా..." అని మాత్రం అనగలి గింది శారద.

"ఆల్ ది బెస్ట్... శారదా! వస్తాను" వెనక్కి తిరిగాడు మేఘానీ.

"బావా..." పిలిచింది శారద.

మేఘానీ ఆగాడు.

శారద పరుగులాంటి నడకతో అతని దగ్గ రకు వెళ్ళింది.

"బావా... నా పెళ్ళికి వస్తావా? " ఆశగా అడిగింది ఆమె.

"రాలేను శారదా! నీ పెళ్ళి చూసి తట్టు కునే గుండెధైర్యం నాకు లేదు. నన్ను క్షమించు" అంటూ చరచరా వెళ్ళిపోయాడు మేఘానీ.

శారద కళ్ళు తుడుచుకుంది. అతను కను మరుగయ్యేదాకా చూస్తూ ఉండిపోయింది.

అదే ఆఖరు చూపు అవుతుందని ఆ క్షణంలో ఆమెకి తెలీదు.

★ ★ ★

మరో రెండు రోజులలో శారదా, చక్రవ ర్తిల వివాహం.

రిపబ్లిక్ డేకి ముందురోజు అంటే జనవరి 25 అశుతోష్ కూతురు, అల్లుడ్ని వెంటపెట్టు కుని వెళ్ళి వారికి కావాల్సినవన్నీ కొన్నాడు.

శారద ముభావంగా ఉండడం చక్రవర్తిని కొంచెం బాధించినా భారతీయ ఆడపిల్లకదా! పెళ్ళంటే సిగ్గుపడుతోంది అని సరిపెట్టుకు న్నాడు.




శారద పడుతున్న ఆవేదన, బాధ ఒక్క శ్యామాకు మాత్రమే అర్థం అవుతోంది.

ఆమెని ఇంకా కాపురానికి పంపలేదు. అందుకే అటు పుట్టింటికి ఇటు శారద దగ్గరికీ తిరుగుతోంది. వీలున్నప్పుడల్లా శారదను ఓదారుస్తోంది. మరుసటిరోజు అమ్మవారి గుడికి వెళ్ళాలని నిర్ణయమైంది.

★ ★ ★

జనవరి 26

శారద గుడికి వెళ్లడానికి సిద్ధం అయ్యింది.

శారదతోపాటు శ్యామా, శారద తల్లి, పిన్ని కూడా బయలుదేరారు.

మరో కారులో అశుతోష్, పెద్దకొడుకు ఎక్కారు.

పెండ్లికి ముందు అమ్మవారి గుడికి వెళ్ళి ఆశీర్వాదం పొందటం అశుతోష్ కుటుంబ ఆచారం.

కారులో ఎక్కబోతుంటే శారద కొంచెం ముందుకి తూలింది. ఎదురుదెబ్బకి బొటన వ్రేలు గాయమై రక్తం చిమ్మింది.

శారద కళ్లల్లో నీళ్ళు తిరిగాయి.

అది చూసి శారద అత్తయ్యకు అపశకునంగా తోచింది. శారద వాళ్ళ అమ్మ చిరాకు పడింది. "అంత పరధ్యానమైతే ఎలా? కొంచెం చూసుకుని నడవచ్చుగా" అందావిడ.

శారద దేనికీ సమాధానం చెప్పలేదు. మౌనంగా కారు ఎక్కింది.

సమయం 7 గంటల 30 నిమిషాలు.

శారద వాళ్ళు గుడి చేరుకున్నారు. అప్పటికి పూజారి పూజ ఏర్పాట్లన్నీ చేసేశాడు.

ముందుగా కాళ్ళు కడుక్కుని పదకొండు ప్రదక్షిణాలు చేసింది శారద. ఎందుకో ఆమె మనసు ఏదో తెలీని ఆందోళనకు లోనైంది.

సమయం 8 గం॥

పూజ మొదలైంది.

శారద భక్తిగా కళ్లు మూసుకుంది.

శాస్త్రోక్తంగా పూజ ముగిసేసరికి 8 గంటల ముప్పై నిమిషాలు అయ్యింది. అందరూ తీర్థప్రసాదాలు తీసుకుని బయటకు వచ్చారు.

శ్యామా, శారద ఇద్దరూ చేతిలో చేయివేసుకుని నడవసాగారు.

సమయం 8గం॥ నలభై రెండునిమిషాలు.

శారద, శ్యామా గుడిబయటకు వచ్చారు.

మిగిలిన వారంతా కారెక్కారు.

కారు ఎక్కిన శారద ఎందువల్లనో కారు దిగింది.

ఆ గుడికి ఎప్పుడు వచ్చినా అక్కడ ఉన్న ముష్టివాళ్లకు డబ్బులు వేయడం ఆమెకు అలవాటు. అందుకే కారు దిగింది.

"శారదా! త్వరగా రామ్మా!" కారులోంచి అన్నారు అశుతోష్.

శారద ఆగి తనవారినందరినీ చూసింది. సమయం ఎనిమిది గంటల నలభైనాలుగు నిమిషాలు.

ఒక్కొక్కరికి డబ్బులు వేసింది శారద.

దూరంగా చెట్టుకింద ఒక తాత కూర్చుని ఉన్నాడు.

శారద ఒకసారి తనవారి వంక చూసి అటు నడవబోయింది.

సమయం ఎనిమిది గంటల నలభై అయిదునిమిషాలు.

శారద ఒక్కో అడుగు వేయసాగింది.

సమయం ఎనిమిది గంటల నలభై ఆరు నిమిషాలు.

ఉన్నట్టుండి శారద ముందుకి తూలిపడింది.

భయంకరమైన శబ్దం.

ఏమైందో ఎవరికీ తెలీదు. శారద గట్టిగా చెవులు మూసుకుంది.

శారదకి కాళ్ళకింద భూమి కంపించి నట్లయ్యింది.

శారదకి స్పృహ తప్పింది.

★ ★ ★

సమయం 9 గంటల ముప్పై నిమి



షాలు.

శారద నెమ్మదిగా కళ్ళు తెరిచింది.

లేవటం ఆమెకి కొంచెం కష్టంగా అన్పించింది.

కళ్ళముందు గుడి లేదు. గుడిముందు కూర్చున్న ముష్టివాళ్ళు లేరు.

ఆమెలో ఏదో అనుమానం.

నెమ్మదిగా ఎలాగోఅలా లేచి కూర్చోగలిగింది.

చుట్టుతా రాళ్లగుట్టలు.

జనం హాహాకారాలు విన్పిస్తున్నాయి. భయంతో ప్రజలు రోడ్లమీద పరుగులు తీస్తున్నారు. ఎవ్వరూ శారదను పట్టించుకోవడంలేదు.

ఎప్పుడో పుస్తకాలలో చదువుకున్న భూకంపం కళ్లముందు జరిగిందని శారదకు అర్థంఅయ్యింది.

నమ్ముకున్న నేలతల్లే గర్జించి విలయతాండవం చేస్తే మిగిలేది ఛిద్రమైన బతుకులు, కూలిపోయిన భవనాలు. ఆ భవనాల కింద నలిగిపోయి ప్రాణం పోగొట్టుకున్న అభాగ్యులు.

సంవత్సరాల తరబడి కూడబెట్టినదంతా భూమి రెండేరెండు నిమిషాలు కంపించేసరికి అంతా తుడిచిపెట్టుకుపోయింది. ఈ నిజం అర్థంచేసుకోలేక జనం తమవాళ్ళ కోసం పరుగులు తీస్తున్నారు.

ఏం జరిగిందో అర్థంకాగానే శారద "నాన్నా!" అని కేకపెట్టి ముందుకి పరిగెత్తింది.

కార్లు ఉండాల్సిన ప్రాంతంలో భూమి చీలిపోయి ఉంది. కార్లు ఉన్న ప్రాంతంలో పెద్దగొయ్యి ఏర్పడింది. అక్కడో పెద్ద మట్టి కుప్ప. రాళ్ళు మాత్రమే కన్పించాయి.

"అమ్మా! నాన్నా! అన్నయ్యా! శ్యామా!" ఒక్కొక్కర్ని పేరుపేరునా పిలుస్తూ పిచ్చిపట్టినదానిలా తిరిగింది శారద. ఆమె రోదనలు, హాహాకారాలు అక్కడ ఎవ్వరూ పట్టించుకోలేదు.

శారద రోదిస్తూనేఉంది. మట్టిదిబ్బను చేతుల్తో తొలగించడానికి ప్రయత్నిస్తోంది. అది అసాధ్యం అని ఆమెకి తెలుసు.

అలసిపోయేదాకా చేతుల్తో మట్టి పెకలిస్తూనే ఉంది శారద.

ఏడ్చిఏడ్చి ఆమె కన్నీళ్ళు ఎండిపోయాయి. అలాగే సొమ్మసిల్లిపడిపోయింది.

★ ★ ★

శారదకు మెలకువ వచ్చేసరికి శరణార్థుల శిబిరంలో ఉంది.

ఆమెలాంటి వారు అక్కడ చాలామంది ఉన్నారు. మృత్యుముఖంనుంచి బయటపడినా వారి ముఖాలలో భయం మాత్రం పోలేదు. కట్టుబట్టలు తప్ప అన్నీ కోల్పోయిన వారికి బతుకంతా అంధకారంగా కన్పిస్తోంది.

ఇల్లు లేదు. వాకిలి లేదు. రక్తసంబంధీకులు కానీ, అయిన వాళ్ళు కానీ ఎవ్వరూ లేరు. ప్రతిరోజూ వాళ్ళ ఇంటి ప్రాంతానికి వెడుతున్నారు. శిధిలాలకింద తమవారు బతికి ఉన్నారేమోనన్న ఆశతో సహాయక శిబిరాలు గుట్టలకింద తవ్వి శవాలు వెలికితీస్తుంటే ఓపికగా నిరీక్షిస్తున్నారు. తమవారి శవం బయటపడగానే ఘొల్లుమంటున్నారు. అప్పుడిక వారిని ఓదార్చడం ఎవ్వరివల్లకావడంలేదు.

సహాయకులు, మిలట్రీ స్వచ్ఛంద సేవా సంస్థలు ఓపికగా వారి సహాయసహకారాలు అందిస్తూనే ఉన్నాయి.

అన్నింటికన్నా ఘోరమైన విషయం ఏంటంటే జనవరి 26న రిపబ్లిక్ డే నాడు స్కూలుకి వెళ్లిన పిల్లలు దాదాపు అయిదువందల మంది సజీవసమాధి అయిపోయారు. ఈ సంఘటన గుజరాత్ రాష్ట్రం కచ్ జిల్లాలోని అంజార్ పట్టణంలో జరిగింది.

అంజార్‌లోని ప్రభుత్వ పాఠశాలల విద్యార్థులు ప్రతి సంవత్సరంలానే ఊరేగింపు నిర్వహించేందుకు సరిగ్గా ఎనిమిది గంటలకు బయలుదేరారు. ఆ ర్యాలీలో దాదాపు అయిదువందల మంది విద్యార్థులు




ఉన్నారు. ఇరుకు వీధి అయిన ఖత్రీవాడ గుండా ఊరేగింపుగా వెడుతుండగా భూకంపం సంభవించింది. అంతే. ఇరుప క్కల ఉన్న భవనాలు కూలిపడ్డాయి. విద్యా ర్థులు, ఉపాధ్యాయులు సజీవసమాధి అయి పోయారు. ఆ పిల్లల తల్లితండ్రుల రోదన లతో గుజరాత్ తల్లడిల్లిపోతోంది.



భూకంపం తాకిడి తగ్గినా ఇంకా అక్క డక్కడ భూమి కంపిస్తూనే ఉంది.

సహాయక శిబిరాల వారు కూడా ముందుగా బతికి ఉండటానికి వీలుగా ఉన్న శిధిలాల క్రిందినించి జనాన్ని తొల గించే ప్రయత్నం చేస్తున్నారు. క్షతగాత్రు లను ఆదుకోవడానికి వైద్యబృందాలు వారివంతు సేవలు అందిస్తున్నాయి.

శారద ప్రతిరోజు బయటకు వెడుతోంది. తన ఇంటి దగ్గర, గుడి ప్రాంతంలోను తన వారెవ్వరైనా కన్పిస్తారేమోనని పిచ్చిగా వెతు కుతోంది. రోదిస్తోంది. కానీ ఫలితం శూన్యం. ఆమె ఉండేది నాలుగు అంతస్థుల భవనంలో. భూకంపం తాకిడికి అపార్ట్ మెంటు కూలిపోయింది. ఇప్పుడక్కడ ఓ పెద్ద రాళ్ళగుట్ట మాత్రమే వుంది. అయినా శారదలో ఏదో ఆశ. అందరూ తనను వదిలి వెళ్ళిపోయారని, తనను అనాధను చేసేశారని ఏడుస్తోంది. శరణార్థుల శిబిరంలో వున్నంత సేపు అలా ఒక్కత్తి కూర్చుని తనలోతను మాట్లాడుకుంటూ ఏడుస్తూ ఉంటుంది.

ఆమెలాంటివారు అక్కడ చాలామంది ఉన్నారు. అందరికీ ఒక్కటే ఆశ... శిధి లాల క్రింద తమ వాళ్ళు జీవించి ఉంటే బాగుండునని.

శిబిరంలో వారిని ఓదారుస్తూ, వారికి తిన డానికి, తాగడానికి ఏదైనా సప్లైచేస్తూ ఒక కుర్రాడు చురుకుగా తిరుగుతున్నాడు. అక్కడ అందరినోటి ఒకటే మాట రాఘవ! రాఘవ! అని. అతనికి మహా అయితే ఇర వైఏళ్లు ఉంటాయేమో. మూడేళ్ళక్రితం వరకు తల్లితండ్రుల గారాల బిడ్డగానే ఉండేవాడు. కానీ అప్పుడు కురిసిన కుంభవృష్టి గుజరాత్ మీద కన్నెర్రచేయడంతో వందలాది కుటుం బాలు నిరాశ్రయమయ్యాయి. ఆ సమ యంలో ప్రాణాలు కోల్పోయిన వారిలో రాఘవ తల్లీ తండ్రీ కూడా ఉన్నారు. ప్రభుత్వం వారిచ్చిన డబ్బు బ్యాంకులో వేసు న్నాడు. అప్పటినుంచి రాఘవ సమాజసే వలో పడిపోయాడు. తనచుట్టూ ఉన్నవారికి ఆపన్న హస్తం అందిస్తుంటాడు.

"రాఘవా! కొంచెం ఈవిడకు ప్రథమ చికిత్స చెయ్యి" అంటూ ఓ వాలంటీరు నల భైఏళ్ళ ఆవిడను అక్కడ వదిలి మరొకరిని రక్షించేందుకు పరిగెత్తాడు.

రాఘవ కాంపౌండర్ ట్రైనింగ్ పూర్తిచే శాడు. అతనికి ప్రథమ చికిత్స చేయడం తెలుసు. గబగబ ఆరంభించాడు రాఘవ.

చాలామంది ఇంకా ఆ షాక్‌నుంచి తేరు కోలేదు. తేరుకున్నవారు కూడా జరిగింది తలుచుకుని కుమిలిపోతున్నారు.

కుటుంబం లేదు.

ఇల్లు వాకిలి లేదు.

డబ్బు లేదు.

ఓ అనాథగా జీవితాన్ని పునర్నిర్మించుకో

వాలన్న ఆలోచనను చాలా మంది భరించ లేకపోతున్నారు. మాకీ జీవితం వద్దు అంటూ పిచ్చిపట్టినట్టుగా పరుగులు తీస్తు న్నారు. ఆత్మహత్య చేసుకునేందుకు ప్రయ త్నిస్తున్నారు. వారికందరికి ఓపికగా జీవితంమీద ఆశ కల్గించే మాటలు చెప్తు న్నాడు రాఘవ.

శారద ఇదంతా గమనిస్తూనే ఉంది. నెమ్మదిగా శిబిరంలోంచి బయటకు వచ్చి తన ఇంటివైపు సాగిపోయింది.

శారద రోజూ 'బయటకు వెళ్ళడం, రావడం రాఘవ గమనిస్తూనే ఉన్నాడు.

మనిషిని ఎంతటి విపత్కర పరిస్థితుల్లోం చైనా బయట పడేయగలదు ఆశ. చాలా మంది తొందరగానే తేరుకుని జీవితాన్ని పునర్నిర్మించుకునే ప్రయత్నం మొదలుపె ట్టారు. అందుకే ఉదయమే ఓ గోనెసంచి తీసుకుని బయటకు వెళ్ళి ఏ వస్తువు కనబ డితే అదల్లా సంచిలో వేసుకుని తెచ్చుకుం టున్నారు. రాబోయే కాలంలో ఇనుపరా డ్స్‌కు బాగా డిమాండ్ ఉంటుంది కాబట్టి వాటిని కూడా ఏరుకుంటున్నారు.

బహుశ ఈ అమ్మాయి అదే పనిలో ఉందా! అనుకున్నాడో క్షణం కానీ అలా ఏం కన్పించడంలేదు.

శారద పరధ్యానంగా నడుస్తూ చాలా దూరం వచ్చేసింది. అక్కడసలు జనసంచా రమే లేదు. ఒక్కక్షణం ఆమెకి భయంవే సింది. అంతలోనే ధైర్యం తెచ్చుకుని వెనక్కి తిరిగింది.

అక్కడ ఇద్దరు మగవాళ్ళు కనిపించారు. చూడటానికి బలిష్టంగా ఉన్నారు. ఇంత దారుణం జరిగాక మనుష్యులంతా వారి వారి నీచ ప్రవృత్తిని వదిలేసి మంచిత నంతో బతుకుతారని ఆమె నమ్మకం. కానీ ఆమె విశ్వాసంమీద దెబ్బకొట్టారు వాళ్ళు. ఓ అందమైన ఆడపిల్ల ఒంటరిగా కన్పించేసరికి వారిలో మృగం మేల్కొంది.





శారదకి వారి ఆకారం చూస్తే భయంవేసి ఒక అడుగు వెనక్కివేసింది.

అంతలో వాళ్ళల్లో ఒకడు ఎగిరి ఆమెమీ దకు దూకాడు.

శారద కిందపడిపోయింది. ఆ పడిపో వటం కూడా ఓ రాళ్ళగుట్టమీద పడింది. 'అమ్మా' అని అరిచాననుకుంది కానీ అరుపు కూడా నోట్లోంచి పెగలలేదు. తలకు దెబ్బ తగలడంతో తలంతా భారంగా అన్పించసా గింది.

ఇద్దరిలో ఒకడు శారదని కదలకుండా పట్టుకున్నాడు. తనమీద అత్యాచారం జరగ బోతోందని తెలిసినా శారద పెనుగులాడలే కపోయింది. అసలు ఆ అమ్మాయి డీప్‌షా క్‌లో ఉంది. మనుష్యుల్లో ఇంతటి క్రూరత్వం ఉంటుందా అన్నట్టు చూస్తోంది.

మరొకడు ఒకవైపు శారద అందాన్ని కళ్ళతో తాగేస్తున్నట్టుగా ఆబగా చూస్తూ వంటిమీద షర్ట్‌తీసి అవతల పడేశాడు.

శారదవైపుకి నెమ్మదిగా అడుగులు వేస్తుండగా.

వెనుకనుంచి ఎవరో బలంగా తన్నడంతో కిందపడిపోయాడతను.

గబగబ శారద దగ్గరకు వెళ్ళి ఆ రెండో వాడిని వెనక్కి తోశాడు.

నెమ్మదిగా ఆమెను లేపి కొంగు భుజం చుట్టూ కప్పాడు. తలకు దెబ్బతగిలి రక్తం వస్తుండడంతో ఆమె చీర కొంగు చింపి కట్టుకట్టాడు.

ఈలోగా కిందపడ్డ వాళ్ళిద్దరూ తేరుకుని అతనిమీద పడ్డారు. అతనికి ఎంత ఆవేశం వచ్చిందంటే రెండేరెండు నిమిషాల్లో అంత బలిష్టులు నేలను కరుచుకునిపోయారు.

"పదండి... వెడదాం" అన్నాడతను.

శారద గభాల్న అతని చెయ్యి పట్టు కుంది.

"నాకు... నాకు భయంవేస్తోంది" అంది. కాలు కిందపెట్టకుండా ఏడు మల్లెల ఎత్తుగా పెరిగిన పిల్ల. ఈనాడు తినడానికి, తాగడానికి, ఉండటానికీ లేక అల్లాడుతోం

దని తెలిస్తే ఆ తండ్రి మనసు ఎంత క్షోభి స్తుందో.

"మీ పేరు" అడిగాడతను.

మౌనంగా ఉంటే ఆమె పదేపదే అదే సంఘటనను గుర్తుచేసుకుంటూ ఉంటుందని ఏదో మాట్లాడించాలి కాబట్టి అడిగాడు.

"శారద" చెప్పిందామె.

"నా పేరు..."

"తెలుసు... రాఘవ" అంది ఆమె. అతని చెయ్యి మాత్రం వదలలేదు.

ఇద్దరూ ఆమె ఇంటి దగ్గరకు వచ్చారు. ఆమెకి దుఃఖం ముంచుకొచ్చింది. "చూశారా! అందరూ నన్ను విడిచిపెట్టి వెళ్ళి పోయారు. నన్ను అనాథను చేసేశారు. కనీసం... వాళ్ళకి అంత్యక్రియలు కూడా" అంటూ భోరుమంది.

"ఊర్కోండి... మనం తప్పకుండా వారికి అంత్యక్రియలు జరిపిద్దాం" అంటూ ఎంతో ధైర్యం చెప్పాడు రాఘవ.

ఇద్దరూ ఆ ప్రాంతం దాటి వస్తుంటే రాఘవ కాళ్లకు ఓ పిల్లాడు అడ్డం పడ్డాడు. అమ్మా! అమ్మా! అంటూ ఏడుస్తున్నాడు.

రాఘవ గభాల్న ఆ పిల్లాడిని ఎత్తుకు న్నాడు. బహుశ రెండు మూడేళ్ళు ఉంటా యేమో! మెడలో ఓ నల్లటితాడు కట్టి ఉంది. దానికేదో లాకెట్ ఉంది. అతనికి కొద్దిదూరంలో ఓ ఫొటో ఉంది. ఫ్రేమ్ అంతా విరిగిపోయింది. పైన అద్దం కూడా పగిలిపోయింది.

"శారద వంగి ఆ ఫొటో చేతిలోకి తీసు కుంది.

ఇద్దరూ శిబిరానికి వచ్చారు.

ఆ పిల్లాడికి పాలు పట్టించాడు రాఘవ. వదిలితే తనను విడిచిపెట్టి వెళ్ళిపోతారే మోనన్న భయంతో ఆ కుర్రాడు కరుచుకుని ఉండిపోయాడు.

మరోపక్క శారద పరిస్థితి కూడా అలాగే ఉంది.

ఆ పిల్లాడి గురించి అక్కడున్న వారినం దరిని కనుక్కున్నాడు. రాఘవ ప్రయత్నం వృథా అయ్యింది. ఎవ్వరూ కూడా అతనికి ఆ పిల్లాడి ఆచూకీ చెప్పలేకపోయారు.

★ ★ ★

మరుసటి రోజు శారద నివాసం ప్రాంతంలో శవాల వెలికితీత ఆరంభమ య్యింది. ఒక్కొక్కరి శవం బయటపడు తుంటే శారదను పట్టుకోవడం ఎవ్వరివల్లా కావడంలేదు. గుడిప్రాంతంలో కూడా బుల్ డోజర్లతో శవాలను తీశారు.

తండ్రి మృతదేహం చూసి శారద భోరు మంది.

నిజానికి చిన్నతనం నుంచి ఆమెకి తండ్రి తోనే అనుబంధం ఎక్కువ అలాంటిది ఇక తండ్రిలేడు. జీవితంలో కన్పించడు అన్న భావన ఆమెని కుదిపేసింది.

శారద కుటుంబ సభ్యులందరికీ రాఘవ అంత్యక్రియలు జరిపించాడు.

ఆమె మాత్రం పూర్తిగా ఈ లోకంతో తన కేమాత్రం సంబంధం లేనట్టుగా ఉంది. రాఘవ ఆమెను చాలా జాగ్రత్తగా చూసు కుంటున్నాడు. చిన్నపిల్లాడ్ని ఎక్కువగా ఆమె వద్దే వదులుతున్నాడు.

ఏం చేసినా శారదలో మార్పురావడం లేదు.

రోజులు గడిచే కొద్దీ జరిగిన ప్రమాదం నుంచి జనం తేరుకుంటున్నారు.

కానీ శారద.

ఆమెలో అదే నిర్లిప్తత... అదే నిరాస క్తత.

చిన్నపిల్లాడికి విజేష్ అని పేరుపెట్టారు.

ఒకరోజు శారదను తనతోపాటు ఆస్పత్రికి తీసుకువెళ్ళాడు. అక్కడ అందరూ రాఘ వను చూసి ఆప్యాయంగా పలకరించారు.

అప్పుడే కోలుకుంటున్న ఓ పేషెంట్ దగ్గరికి వెళ్ళారు.

"ఏమ్మా ఎలా వున్నారు? "

ఆ మాటకి స్మితాజైన్ నెమ్మదిగా కనులు తెరిచింది. "నీ దయవలన బానేవున్నాను

బాబు" అంది. రాఘవ పక్కనున్న శారదను చూసి "ఎవరూ! మీ ఆవిడా! సలక్షణంగా ఉంది. మా ఆయుష్షు కూడా పోసుకుని మీరిద్దరూ చల్లగా ఉండాలి"

ఆవిడ మాటలకి శారద నివ్వెరపోయింది.

"శారదా! నీకు ఈవిడ గురించి చెప్పలేదు కదూ! ఈవిడ ఉండే ఫ్లాట్ భూకంపం తాకిడికి కూలిపోయింది. ఆ సమయంలో ప్రాణ భయంతో పరుగులు తీశారావిడ. అంతలో పైనుంచి ఓ సిమెంటు దిమ్మె ఆవిడ కాళ్ళ మీద పడిపోయింది. మరికాసేపటికి పైనుంచి రాళ్లు, రప్పలు పడ్డాయి. రాళ్ళల్లో కూరుకుపోయిన ఆవిడ భగవంతుని ధ్యానిస్తూ ఉండిపోయారు"

అంతలో అక్కడికి డాక్టర్ వచ్చారు. ఆయన్ని చూడగానే స్మితాజైన్ ఒక్క ఉదుటన లేచి కూర్చుంది. "డాక్టర్! మా వారికెలా ఉంది? " అని అడిగింది.

"ఆయన క్షేమంగా ఉన్నారమ్మా! ప్రమాదం తప్పినట్టే" చెప్పారు డాక్టర్.

ఆవిడ తిరిగి మంచంమీద పడుకుని దైవ ధ్యానం చేసుకోసాగింది.

శారద ఏదో ఆలోచనలో ఉండడంతో రాఘవ మాట్లాడలేదు.

"అయ్యా! మేము వెళ్ళొస్తాం" అంటూ ఒక ఆవిడ రాఘవ కాళ్ళు పట్టుకున్నంత పని చేసింది.

"ఏంటమ్మా! ఇది... పెద్దవారు. మీరిలా చేయచ్చా.." వారించాడు రాఘవ.

"లేదయ్యా! నువ్వే కనుక ప్రాణాలకు తెగించి ఆదుకోకపోతే నా బిడ్డలు దిక్కులేని వాళ్ళయ్యేవాళ్ళు. నువ్వు చల్లగా ఉండాలి బాబు" అంటూ మరోసారి చేతులు జోడించింది గీతాబెన్.

"నీ భర్తను కాపాడలేకపోయినందుకు క్షమించమ్మా. వీలైనంత త్వరలో ప్రభుత్వం హామీ ఇచ్చిన నష్టపరిహారం అందేలా చేస్తాను"

"అలాగేనయ్యా! వస్తాను" మరోసారి కృతజ్ఞతలు చెప్పింది ఆవిడ. భూకంపం మూలంగా ఆవిడ భర్తను మాత్రమే కాదు ఓ కాలుని కూడా పోగొట్టుకుంది. ఒంటి కాలితో కుటుంబ భారాన్ని తనమీద వేసుకుని పిల్లలకు చక్కటి భవిష్యత్తును ఇవ్వాలని ఆశపడుతోంది.

ఆవిడ వెళ్ళాక చెప్పాడు రాఘవ.

"శారదా! నిన్ను ఇక్కడికి ఎందుకు తీసుకొచ్చానో నీకు ఈపాటికి అర్థమయ్యే ఉంటుంది. నీకు ఆ భగవంతుడు అన్యాయమే చేశాడు. కాదనను. కానీ నీ జీవితాన్ని అంతం చేసుకునే అధికారం మాత్రం నీకు లేదు. నా చిన్నప్పుడు మా నానమ్మ ఏం చెప్పేదో తెలుసా! మనకు ఈ జీవితాన్ని ప్రసాదించిన ఆ భగవంతుడికి మాత్రమే తిరిగి జీవితాన్ని వెనక్కి తీసుకునే అధికారం ఉందట. మరెవ్వరికీ ఆఖరికు మనకు కూడా ఆ అధికారం ఉండదుట. ఇంతకన్నా ఎలా చెప్పాలో నాకు అర్థంకావడంలేదు. నేను కూడా నీలాగే ఎంతో గారాబంగా పెరిగాను. ప్రమాదంలో అమ్మా, నాన్నను పోగొట్టుకుని అనాథయ్యాను. నాకు ఆరోజు ధైర్యం చెప్పిన వారు కానీ, ఓదార్చిన వారు కానీ లేరు. నీకు ఎవ్వరూ లేరని బాధపడకు. నీకు నేనున్నాను" ఆమె చేతిలో చెయ్యివేసి చెప్పాడు రాఘవ.

ఆస్పత్రిలో కోలుకుంటున్న వారిని చూశాక, వారితో మాట్లాడాక శారదలో కొంచెం ధైర్యం వచ్చింది. తను కూడా రాఘవతో కలిసి సహాయ కార్యక్రమాలలో పాల్గొంది.

విజేష్ ఎవరిపిల్లాడన్నది మాత్రం తెలియలేదు. అతను రాఘవను వదలడంలేదు.

పునరావాస కార్యక్రమాలు ఆరంభమయ్యాయి.

జనం తిరిగి వారి దైనందిన జీవితంలో పడ్డారు.

దాదాపు నెలరోజుల తర్వాత అమ్మవారి ఎదుట రాఘవ, శారద దండలు మార్చు





కుని దంపతులయ్యారు. ఆవిధంగా వారి కొత్త జీవితం ఆరంభమయ్యింది.

శారదకు అప్పుడప్పుడు తన జీవితాన్ని తల్చుకుంటే చాలా ఆశ్చర్యంగా ఉంటుంది. తండ్రి తన పెళ్ళి ఎంత వైభవంగా చేయాలనుకున్నాడో గుర్తుకువచ్చినప్పుడు ఆమె మనసు వికలమవుతుంది.

తను మేఘానీని చేసుకోవాలనుకుంది.

తండ్రి చక్రవర్తిని చేసుకోవాలని పట్టుబట్టాడు.

చివరకు రాఘవ తన భర్త అయ్యాడు.

శారద విజేష్‌కి తల్లి అయ్యింది. వాళ్ళు ప్రత్యేకంగా చెప్తే తప్ప విజేష్ శారద కొడుకు కాదంటే ఎవ్వరూ నమ్మలేరేమో.

వారి వివాహం అయిన రెండేళ్ళకు మధు పుట్టింది.

విజేష్‌కి చెల్లెలంటే ప్రాణం.

విజేష్‌కి అయిదేళ్లు వచ్చేవరకు అతని మెడలో లాకెట్ ఉండేది. ఆ తర్వాత శారద దాన్ని తీసి దాచింది. ఆవిధంగా విజేష్ శారద, రాఘవల పెద్దకొడుకయ్యాడు.

ఈ విషయం శారదకు, రాఘవకు తప్ప మిగతా ఎవ్వరికీ తెలీదు. ఇద్దరికీ బంధువులు లేకపోవడంవలన ఈ విషయం వాళ్ళు చెప్తే తప్ప మిత్రులకు తెలిసే అవకాశంలేదు.

శారద, రాఘవ జీవితాంతం విజేష్ తమ పెంపుడు కొడుకన్న నిజాన్ని కాపాడాలనే అనుకున్నారు. కానీ పరిస్థితుల ప్రభావం వలన చెప్పక తప్పలేదు.

కాలక్రమేణా శారద... శారదమ్మ అయ్యింది.

రాఘవ... రాఘవయ్య అయ్యాడు.

ఇద్దరూ ఒకటే మాటగా, ఒకటే బాటగా జీవిస్తున్నారు.

ఇద్దరికీ కులంమీద కానీ, మతంమీద కానీ నమ్మకం లేదు.

వారి దృష్టిలో దేవుడు ఒక్కడే...

డబ్బు కూడబెట్టాలన్న కోరిక లేదు. వారికి వీలైనంతలో ఎవర్ికైనా మంచి చేయాలని తపిస్తారు.

అందువల్లనే విజేష్‌కి తండ్రి చేతకానివాడుగాను, అసమర్థుడిగాను కన్పిస్తున్నాడు. అది అసమర్థత కాదు, అనుభవం. జీవితం తొలినాళ్ళల్లో తండ్రి నేర్చుకున్న గొప్ప జీవితపాఠం అని అర్థం అయితే తప్పకుండా విజేష్‌లో మార్పు వస్తుందని శారదమ్మ నమ్మకం.

★ ★ ★

గత జ్ఞాపకాలలోంచి బయటకు వచ్చారు శారదమ్మ.

అక్కడ ఉన్నవారంతా షాకింగ్‌గా నిలబడిపోయారు.

విజేష్ అయితే మరీను.

ఇన్నాళ్లుగా ఎవర్నైతే తన కన్నతల్లిదండ్రులుగా భావించాడో, ఏ చెల్లిల్నైతే తన ప్రాణంగా చూసుకున్నాడో వాళ్ళు తనకేమీ కారన్న నిజం అతను భరించలేకపోతున్నాడు. ముఖ్యంగా తను తండ్రిని అన్న మాటలు అతనికి గుర్తుకువస్తున్నాయి. ఆరోజు ఆయనే తనను చేరదీయకపోయుంటే...!

అంతే, వెళ్ళి తండ్రి కాళ్ళమీద పడిపోయాడు. "నాన్నా! నన్ను క్షమించండి" అంటూ రోదించసాగాడు.

రాఘవయ్య కొడుకుని దగ్గరకు తీసుకున్నాడు.

"మిమ్మల్ని అనరాని మాటలు అన్నాను. మీరు అసమర్థులని, సంపాదించడం చేతకాని..."

"ఒరేయ్! నువ్వు నా కొడుకువిరా! నన్నేమైనా అనే అధికారం నీకుంది. మర్చిపో... జరిగినదంతా మర్చిపో..." కొడుకుని గుండెలకు హత్తుకున్నారు రాఘవయ్య.

శారదమ్మ కూడా కొడుకు పక్కనే కూర్చున్నారు. "బాబూ! విజేష్ నీకీ సంగతులన్నీ చెప్పకూడదనే అనుకున్నానురా... కానీ

నువ్వెక్కడ మాకు కాకుండా పోతావోనని చెప్పాల్సివచ్చింది..."

"అమ్మా! నేను... నేను మిమ్మల్ని విడిచి వెళ్ళనమ్మా. జీవితాంతం మీ కొడుకుగానే వుంటానమ్మా..." తండ్రిని వదిలి తల్లి ఒడిలో ముఖం దాచుకున్నాడు విజేష్.

"ఏమిట్రా ఆ పిచ్చి మాటలు..." రాఘవయ్య మందలించారు. "నిన్ను దూరం చేసుకుని మేము మాత్రం బతకగలమా! మీ అమ్మ నీకీరోజు ఇదంతా ఎందుకు చెప్పిందో తెలుసా! నువ్వు మనిషికి డబ్బే ముఖ్యమని దాని వెంట పరుగులు తీస్తున్నావు... కుల మతాల గురించి మాట్లాడుతున్నావు. కానీ ఆరోజు... భూకంపం వచ్చి సర్వం కోల్పోయినప్పుడు నిజంగా నేను సర్వమత సమానత్వాన్ని చూశానురా... ప్రతివాళ్ళు వీలైనంతలో మరొకరికి సహాయపడాలనే అనుకున్నారు. తాము హిందువా! ముస్లిమా అన్నది మర్చిపోయారు. మేమే కాదురా... మాలాంటి వాళ్ళెంతోమంది ఇలాగే వివాహాలు చేసుకున్నారు. ఆ టైంలో ఆ వ్యక్తి నచ్చారో లేదో చూసుకొన్నారే తప్ప ఆ వ్యక్తి ఆస్తి, అంతస్థు, కులం, మతం గురించి వాళ్ళు ఆలోచించలేదు. పిల్లల్ని కోల్పోయిన తల్లిదండ్రులు అనాథలైన పిల్లల్ని దత్తత చేసుకున్నారు. ఓ భయంకరమైన విపత్తు వస్తేకానీ మనలో మానవత్వం మేలుకోదా? ఆరోజు జనం చూపించిన ఔదార్యం ప్రజలలో ఎప్పుడూ ఉండాలని సాటిమనిషిని తొక్కుకుంటూ వెళ్ళడం కాకుండా తనతోపాటుగా తీసుకువెళ్ళాలన్నది నా అభిమతం. ఇది యుటోపియానే కావచ్చు కానీ నా జీవితం ముగిసేలోగా ఆరోజు చూడాలన్నది నా కోరిక. ప్రపంచాన్ని నేను మార్చలేకపోవచ్చు కానీ మార్పు అనేది నా కుటుంబంనుంచే ఆరంభం కావాలని అనుకున్నాను. మీ అమ్మ దేవతరా! నీకు అన్ని విధాల ఆవిడ ఎంతో చేయూతనిచ్చింది" ఆయాసంతో చెప్పడం ఆపారు రాఘవయ్య.

తను వారిపట్ల ఎంత నిర్లక్ష్యంగా ప్రవర్తించాడో గుర్తుకొస్తుంటే విజేష్‌లో దుఃఖం పెల్లుబికుతోంది.

చాలాసేపటికిగానీ విజేష్ మామూలు మనిషి కాలేకపోయాడు.

సుశీలకి, రాజేశ్వరికి ఆ దంపతులిద్దరినీ చూస్తుంటే గౌరవంతో కూడిన భయం కలుగుతోంది.

ఆ రాత్రి ఎవ్వరూ నిద్రపోలేదు.

★ ★ ★

ఆయన వయసు దాదాపు డెబ్బై సంవత్సరాలు ఉంటుంది. ఓ మూడు వందల గజాలు తప్పితే ఆయన సంపాదించిన ఆస్తి ఏమీలేదు. ఒకప్పుడు బాగా బతికిన కుటుంబమే. కానీ భూకంపం ఆయన జీవితాన్ని కూడా నాశనం చేసింది. ఆ దుస్సంఘటనలోనే భార్యను, కొడుకును పోగొట్టుకున్నాడు. కూతురు, తనూ మిగిలారు. ఎంతగా మనసుకి సర్దిచెప్పుకున్నా భార్య, కొడుకు జ్ఞాపకాలు ఆయనను వీడిపోలేదు.

ప్రస్తుతం మనవరాలికి పెళ్ళిచేయాల్సిన బాధ్యత ఆయనమీద పడింది. ఈమధ్యనే అల్లుడు యాక్సిడెంటులో చనిపోయాడు. అప్పటినుంచి ఆయన మరీ కృంగిపోయాడు.

ఆయన తన స్థలం దగ్గరకి వెళ్ళాడు. అక్కడ ఓ అయిదుగురు కూర్చుని పేకాట ఆడుకుంటున్నారు. ఆ దృశ్యం ఆయన మనసుని ఎంతో కలచివేసింది. తులసికోటి మీద మందుసీసాలు, గ్లాసులు పెట్టి ఉన్నాయి. తన అసహాయస్థితికి ఆయనకు తనమీద తనకే అసహ్యం వేసింది.

సంవత్సరంక్రితం వరకు ఆ ఇంట్లో కూతురు, అల్లుడు, మనవలు, మనవరాళ్ళతో కలిసి కేశుభాయ్‌ఖత్రీ ఆ ఇంట్లోనే ఉండేవాడు. సంవత్సరం క్రితం అల్లుడు చనిపోవడంతో వేరే చిన్న ఇంటికి మారి ఆ ఇంటిని అద్దెకు ఇవ్వాలనుకున్నాడాయన. ఇల్లు ఖాళీగా ఉండడంతో వసంత్ మనుషులు

దానిని ఆక్రమించుకున్నారు. వెళ్ళమంటే 'మీ మనవరాలు ఏం చేస్తోంది?' అంటూ వెకిలిగా నవ్వుతున్నారు. గట్టిగా చెప్దామా అంటే మనవరాలిని ఏదైనా చేస్తారేమోనని భయం. అందుకే ఏడాదిగా వాళ్ళను ఖాళీ చేయమని బతిమాలుతూనే ఉన్నాడు. వీళ్ళు మాత్రం అదిగో ఈరోజు, రేపు అని చెప్తున్నారే తప్ప ఖాళీ చెయ్యడంలేదు. ఈమధ్యనే వసంత్ 'వేరేవాళ్ళకెందుకు నాకే అమ్ము. నేను కొనుక్కుంటాను' అని గొడవ చేస్తున్నాడు. కానీ అతను ఇస్తానన్న రేటు చాలా తక్కువ. అందుకే తనకు ఇంటిని అమ్మే ఉద్దేశం లేదని, తిరిగి తామే వచ్చి ఉందామనుకుంటున్నామని చెప్పాడాయన.

ఖత్రీని చూడగానే అక్కడివాళ్ళు కొద్దిగా ఖంగారుపడ్డారు. తులసికోటమీద పెట్టిన గ్లాసులన్నీ గబగబా సర్దేశారు. అందరిలోకి ముందుగా తేరుకుంది వసంత్.

"ఏంటి సార్! ఇలా వచ్చారు?" అతి వినయం ఒలకబోశాడు అతను.

"ఏముంటుంది బాబూ... మీరు ఇల్లెప్పుడు ఖాళీ చేస్తున్నారో తెల్సుకుందామని" మనసులో ఓపక్క కోపాన్ని కంట్రోలు చేసుకుంటూ వీలైనంత సౌమ్యంగా సమాధానం ఇచ్చాడాయన.

"చేసేస్తాం... వీలైనంత త్వరలోనే ఖాళీ చేసేస్తాం..." అని తన గ్యాంగ్‌వైపు తిరిగి "ఏరా! అంతేనా?" అన్నాడు.

"అవునన్నా" వాళ్ళంతా వంతపాడారు.

"అంటే ఎన్నాళ్ళు...?"

"ఓ పదిపదిహేను... కాదు కాదు ఒక్క నెలరోజులు టైమివ్వండి" చెప్పాడు వసంత్.

"నెలరోజులలో..."

"తప్పకుండా ఖాళీ చేసేస్తాం..." నమ్మబలికాడు వసంత్.

"చూడుబాబూ! నేను పెద్దవాణ్ణి. మీలాంటివారితో తలపడ గల అంగబలం కానీ, అర్థబలం కానీ నాకు లేవు. అందుకే మీరు సంవత్సరం నుంచీ ఈరోజు ఖాళీచేస్తాం, రేపు ఖాళీ చేస్తాం అని చెప్తున్నా కాళ్లీడ్చుకుంటూ ఇంటిచుట్టూ తిరుగుతున్నానే తప్ప మిమ్మల్నేమీ చెయ్యలేకపోతున్నాను. దయచేసి నా బాధను అర్థం చేసుకోండి. అనవసరంగా నా ఉసురు పోసుకోకండి. నా ఇల్లు నాకు ఇచ్చేయండి..." చేతులు రెండూ జోడించాడు ఖత్రీ.

"ఏంటది పెద్దాయనా!" వారించాడు వసంత్. "నేనూ మా వాళ్ళకి 'మీరు చేసేది తప్పురా! ఆ ముసలాయనను అలా ఏడ్పించడం భావ్యం కాదు, ఇల్లు ఖాళీ చేసెయ్యండి' అని చెప్తూనే ఉన్నాను. ఇక లాభంలేదు. ఒక్క నెలరోజులు ఆగండి... ఇన్నాళ్ళు ఓపిక పట్టారుకదా! ఒక్కనెలరోజులు ఓపిక పట్టండి. మా వాళ్ళచేత ఇల్లు ఖాళీ చేయించి మీకు అప్పగించేస్తాను. మళ్ళీ మళ్ళీ మీరు రానక్కర్లేదు. నేనే తాళంచెవులు తీసుకుని మీ ఇంటికి వచ్చి స్వయంగా అందచేస్తాను. నా మాట నమ్మండి"

"నమ్మక చేయగలిగింది మాత్రం ఏముందిలే..." తనలోతాను గొణుక్కుంటూ వెనుదిరిగాడు కేశుభాయ్‌ఖత్రీ.

"ఏం యాక్టింగ్ చేసినావన్నా!" అంటూ వసంత్‌ని ఆకాశానికి ఎత్తేశారు మిగిలిన వాళ్ళు.

అంతే అందరూ కలిసి పరిహాసంగా నవ్వారు.

వారి నవ్వులు, వేళాకోళాలు, వెక్కిరింతలు కేశూభాయ్‌ఖత్రీకి వినిపిస్తూనే ఉన్నాయి. అయినా సరే వెనక్కి తిరగలేదు. వెనుతిరిగి వారికేమీ చెప్పలేనని ఖత్రీకి తెలుసు.

మరో నెలరోజులు ఎదురుచూడాలి. అప్పుడు కూడా వాళ్లు ఖాళీ చేస్తారని ఆయనకు నమ్మకమేమీలేదు. కానీ మనిషిని బతికించేది భవిష్యత్తుమీద ఉండే ఆశ ఒక్కటే. అదే ఆయనకు కూడా బలాన్నిస్తోంది.

★ ★ ★

శారదమ్మగారు విజేష్‌లో ఏ మార్పు

అయితే ఆశించారో అది వచ్చింది. ఇంతకు ముందు దేవుడికి నమస్కరించనివాడు దేవుడి గదిలోకి వెళ్ళనివాడు ఈరోజు దేవుడికి నమస్కరించకుండా కాలు బయట పెట్టడంలేదు. ముఖ్యంగా దేవుడితోపాటు తండ్రికి, తల్లికి నమస్కరిస్తున్నాడు. తను చేసిన పొరపాట్లకు మన్నించమని వారిని వేడుకుంటున్నాడు.

ఆరోజు ఇంటినుంచే విజేష్ ఒక వ్యక్తికి ఫోన్ చేశాడు.

"హల్లో..." మామూలుగా ఫోనెత్తాడు ఆ వ్యక్తి.

"హల్లో నమస్తే... నా పేరు విజేష్..."

"చెప్పు విజేష్... నేను నీరవ్‌షాని మాట్లాడుతున్నాను"

"నీరవ్‌షా! మీతో ఒక ముఖ్యవిషయం మాట్లాడాలి" విజేష్ మాటలు వింటున్న రాఘవయ్య, శారదమ్మ ఉలిక్కిపడ్డారు.

"ఏమిటి కొత్తగా నువ్వులోంచి మీరులోకి దిగావు?" అన్నాడు షా. ఆ మాటకి విజేష్ బదులివ్వలేదు.

"ఇంతవరకు మనం ఎన్నో గొడవలు పడ్డాం. తెలిసో తెలీకో నేను మిమ్మల్ని చాలా బాధ పెట్టాను"

"విజేష్..." షా ఆ మాటలకు నిజంగానే విస్తుబోయాడు.

ఒకక్షణం తనుకానీ కల కనడం లేదుకదా అన్పించింది అతనికి.

"అవును... నేను నిజమే చెప్తున్నాను. ఇకనుంచి మన మధ్య ఎలాంటి గొడవలు ఉండవు. నేను మీ డీలింగ్స్‌లో కల్పించుకోను. మీరు నా డీలింగ్స్ జోలికి రావద్దు..."

"విజేష్... ఈ మాట వింటుంటే నాకు చాలా ఆనందంగా ఉంది. నిజంగా చెప్తున్నాను. నువ్వు నాకన్నా తెలివికలవాడివి. అనవసరంగా నామీద కక్ష పెంచుకుని నీ ఎనర్జీని, నా గురించి ఆలోచించి నీ సమయాన్ని వృధా చేసుకుంటున్నావు. ఇప్పటికైనా నీలో మార్పు వచ్చింది. నాకు సంతోషంగా ఉంది. నీకే సహాయం కావాల్సి వచ్చినా నేనున్నానని మర్చిపోకు..." అన్నాడు నీరవ్‌షా.

"అలాగే... ఉంటాను... నమస్తే"

"విజేష్! ఒక్క నిమిషం. అమ్మగారికి నా నమస్కారాలు చెప్పండి"

"ఇక్కడే ఉన్నారు ఫోన్ ఇస్తాను..." అని శారదమ్మగారికి ఫోన్ ఇచ్చాడు విజేష్.

"అమ్మా! నమస్కారం.... బావున్నారా..." ఎంతో వినయంగా అడిగాడు షా.

"బాగున్నాను బాబు... నువ్వెలా ఉన్నావు? కోడలు, పిల్లలు బావున్నారా?"

"అమ్మా! మీరు... నన్ను" ఆనందంతో షా మాట్లాడలేకపోయాడు.

"అవునయ్యా! నువ్వు కూడా ఈరోజు నుంచి మా అబ్బాయివే. మీరిద్దరూ మీ గొడవలకు స్వస్తిపలికి స్నేహితులుగా ఉండాలన్న నిర్ణయానికి రావడం నాకు చాలా ఆనందంగా ఉంది. అందరినీ అడిగానని చెప్పు..."

"అలాగేనమ్మా! మీరంతా వీలు చూసుకుని ఒకసారి మా ఇంటికి రావాలి..."

శారదమ్మగారు సరేనన్నాక నీరవ్‌షా ఫోన్ పెట్టేశాడు.

"థాంక్స్. ఇప్పుడు నా మనసుకి ప్రశాంతంగా ఉంది..." అన్నారు రాఘవయ్య.

విజేష్ నవ్వి వూరుకున్నాడు.

★ ★ ★

'స్మృతి అపార్ట్‌మెంట్స్' దగ్గరపని చురుకుగా సాగుతోంది. నీరవ్‌షా రోజుకి ఒక్కసారైనా సైట్ దగ్గరకు వెళ్ళి పని ఎలా జరుగుతోందో తెలుసుకుంటున్నాడు. ఇప్పుడతను పూర్తిగా తన దృష్టంతా వర్క్‌మీదనే పెట్టాడు. నిన్నటివరకు విజేష్ అతన్ని బాగా ఇబ్బంది పెట్టాడు. ఏదైనా బోల్డ్ స్టెప్ తీసుకుందామా అంటే ఏదో తెలీని అభిమానం అడ్డొచ్చేది. అలా అని ఊరుకుంటున్నకొద్దీ నీరవ్‌షా వ్యాపారం అంతా విజేష్




హస్తగతం అయిపోయే ప్రమాదం ఏర్ప డింది. ఇప్పుడా సమస్య లేదు.

నీరవ్‌షాతో విజేష్ రాజీపడ్డాడు.

సైట్ దగ్గర ఆనంద్ స్వరూప్ దగ్గరుండి పనిచేయిస్తున్నాడు. దాదాపుగా మొదటి ఫ్లోర్ పూర్తయింది. స్లాబ్ వేయాల్సివుంది. నీరవ్‌షా ఎప్పుడు స్లాబ్ వేస్తున్నా కూతురు శాంతితో పూజా కార్యక్రమాలు నిర్వహిం చడం అతనికి అలవాటు. శాంతి అమెరికాలో ఉండటంతో అతనికి ఓ మంచి ఆలోచన వచ్చింది. అంతకుముందే కూతురికి ఫోన్ చేశాడు. విజేష్ తనకు క్షమాపణలు చెప్పడం, తనతో రాజీపడటం గురించి చెప్పాడు.

శాంతి విషయం విని ఆనందపడింది. తను ఆ ఇంటి కోడలు కావడానికి ముందే వారిద్దరూ జరిగిన గొడవలన్నీ మర్చిపోయి కలిసిపోవడం ఆమెకి సంతోషాన్నిచ్చింది.

శారదమ్మగారు మధుజైన్‌కి ఫోన్‌చేసి విషయం చెప్పారు. అన్నయ్య మారటం ఆమెకి ఆనందంగా అన్పించినా, సొంత అన్నయ్య కాదని తెలిసి బాధపడింది. సుశీల పెళ్ళి సంగతి ఏమైందని అడిగింది. ఆ సంగతి గురించి శారదమ్మగారికి కూడా తెలీదు. ఆరోజు పెళ్ళిశుభలేఖల మోడల్స్ తెచ్చి నీకు కావాల్సిన మోడల్ సెలక్ట్ చేసుకో అని చెప్పాడు. అదే చిలికి చిలికి గొడవ అయ్యింది. గతం చెప్పాల్సివచ్చింది. ఆ తర్వాత విజేష్‌లో చాలా మార్పు వచ్చిం దిగానీ కూతురి పెళ్ళి సంగతేమీ మాట్లాడ టంలేదు. అదే చెప్పారు ఆవిడ.

నీరవ్‌షా ఇంటికి వెళ్ళి పెళ్ళి సంబంధం మాట్లాడతామని కూతురికి హామీ ఇచ్చారు.

విజేష్ ఇంటికి రాగానే రాఘవయ్య విషయం చెప్పారు. అతను ఏమాత్రం ఆవే శపడలేదు. అతని మనసులో ఏంవుందో అర్థంకాలేదు.

"తప్పకుండా వెడదాం నాన్నగారూ! శాంతి కూడా నా కూతురులాంటిదే... కదా! నేను నీరవ్‌షాకి ఫోన్‌చేసి చెప్తాను..." అన్నాడు విజేష్.

"అదిసరేరా... నేను ఒక విషయం అడి గితే నువ్వేం అనుకోవుగా!"

"చెప్పండి నాన్నా!"

"అదేరా... సుశీల పెళ్ళి విషయం ఏం చేశావు? "

అప్పటికి కూడా విజేష్‌లో ఏం మార్పు లేదు. అలాగే చాలా కూల్‌గా ఉన్నాడు.

"నేను... అతనితో మాట్లాడతాను నాన్నా..." చెప్పాడు విజేష్.

అప్పుడే కాలేజీనుంచి వచ్చిన సుశీల ఆ మాటకి సంబరపడిపోయింది. కానీ తండ్రిని చూసి భయపడింది.

"ఓ. కే. నాన్నా! నాకు కొంచెం పనుంది..." అంటూ సోఫాలోంచి లేచాడు. కూతుర్ని చూడగానే "ఏమ్మా... కాలేజీ నుంచా..." అని అడిగాడు.

అవునన్నట్టు తలాడించింది సుశీల

"తల్లీ! ఆ అబ్బాయిని... అతని పేరు..." గుర్తుతెచ్చుకోవడానికి ప్రయత్నించాడు విజేష్.

"అహ్మద్..." అంది చటుక్కున.

"ఎస్... అహ్మద్... అతన్ని ఒకసారి వచ్చి నన్ను కలవమని చెప్పు. కొంచెం మాట్లాడాల్సి వుంది" అన్నాడు.

"అలాగే... నాన్నగారూ!" అంగీకరిం చింది సుశీల.

ఆ తర్వాత విజేష్ బయటకు వెళ్ళిపో యాడు.

రాజేశ్వరి, శారదమ్మగారూ, రాఘవయ్య గారూ నీరవ్‌షా ఇంటికి వెళ్ళి ఏం మాట్లా డాలో చర్చించుకుంటూ ఉండిపోయారు. సుశీల మాత్రం తన గదిలో ఉండిపో యింది. ఇప్పుడామె మనకు విహంగమై అహ్మద్ దగ్గరికి వెళ్ళిపోయింది. కేవలం శరీరం మాత్రమే అక్కడ ఉంది.

  

మరుసటిరోజు ఉదయం విజేష్ షాకి ఫోన్ చేశాడు. అతను అప్పుడే సైట్‌కి

బయలుదేరుతున్నాడు.
"హల్లో! నేను విజేష్‌ను మాట్లాడుతున్నాను..." అన్నాడు.
"చెప్పు భయ్యా! ఏంటి విశేషాలు?" అడిగాడు షా.
"ఒక్క నిమిషం... అమ్మ మాట్లాడుతుంది" అని ఫోన్ తల్లి చేతికిచ్చాడు.
"అమ్మా! నమస్కారం బావున్నారా!"
"బావున్నాను. ఏంలేదు. వీలున్నప్పుడు అందరూ మా ఇంటికి రావాలన్నావు... గుర్తుందా?"
"అవునమ్మా..."
"ఇప్పుడు బయలుదేరి వస్తున్నాం... నీతో ఓ ముఖ్యవిషయం మాట్లాడాలి" అన్నారు శారదమ్మ.
"రండమ్మా! ఈరోజు నేను లేచినవేళ చాలా మంచిది... మీ కోసం ఎదురుచూస్తుంటాను" అని క్షణం ఆగి "మా ఇల్లు..."
"తెలుసయ్యా! సుశీల చెప్పింది. తను ఓరోజు బస్‌స్టాపులో నిలబడి ఉంటే మీ ఆవిడ పట్టుబట్టి ఇంటికి తీసుకువెళ్ళిందట కదా! నువ్వేమో చీర పెట్టి పంపావట. మా అమ్మాయి జరిగిందంతా నాతో చెప్పింది..."
విజేష్ ఆ విషయం విని ఆశ్చర్యపోయాడు.
మరికొంతసేపు మాట్లాడి శారదమ్మగారు ఫోన్ పెట్టేశారు.
సుశీలని వివరాలు అడిగి తెలుసుకుని శారదమ్మ, రాఘవయ్య ఇద్దరూ షా ఇంటికి బయలుదేరారు.
వారికోసం గుమ్మంలోనే ఎదురుచూస్తున్నారు షా దంపతులు.
శారదమ్మగారిని చూడగానే కన్నతల్లే ఇంటికి వచ్చినంతగా ఆనందపడ్డాడు షా.
"ఏమ్మా... మీరిద్దరే వచ్చారు. విజేష్ వాళ్ళు రాలేదా?"
"లేదయ్యా! వాడికేదో ముఖ్యమైన పని ఉందన్నాడు. అయినా ఇప్పుడు మీరిద్దరూ శత్రువులు కాదుగా! మంచి మిత్రులు కదా! మీ ఇంటికి రావడానికి వాడికి అభ్యంతరం ఏముంటుంది?" అన్నారు శారదమ్మ.
"మిత్రులు ఏమిటి బంధువులు కాబోతుంటే..." అన్నాడు రాఘవయ్య.
షా దంపతులకు ఆయన అన్నదేమిటో అర్థం కాలేదు. అదే అన్నాడు.
"నీకు ఒక కూతురుందికదూ!"
"అవును..."
"మీ అమ్మాయి పేరు శాంతికదూ!"
"అవునమ్మా!"
"తను అమెరికాలో ఉందికదూ!"
"నిజమే... కానీ ఈ వివరాలన్నీ మీకు..." విస్తుబోయాడు షా.
"ఎలా తెలుసునంటావా?" నవ్వారు రాఘవయ్య.
అవునన్నట్టు తలాడించాడు షా.
"మనం ఏదో అనుకుంటాంగానీ భగవంతుడు చాలా గొప్పవాడు. ఎవరిని ఎక్కడ, ఎప్పుడు, ఎలా కలపాలో ఆయనకు బాగా తెలుసు. మీ అమ్మాయి మా మేనల్లుడ్ని ఇష్టపడింది"
ఆ మాట వినేసరికి షా ముఖంలో రంగులు మారాయి. రాఘవయ్యగారికి షా మనసు అర్థం అయ్యింది.
"మాలాగే మీ అమ్మాయి కూడా మా అబ్బాయికి,. నీకు మధ్యనున్న గొడవలకు చాలా ఆందోళన చెందింది. మా మేనల్లుడ్ని పెళ్ళి చేసుకుంటే తద్వారా మీరిద్దరూ బంధువులవుతారని, మీ మధ్య గొడవలకు తెరదించినట్టు అవుతుందని ఆమె విశ్వాసం. ఆ సంగతే మా అమ్మాయికి చెప్పింది. మా అమ్మాయి ఫోన్‌చేసి జరిగినదంతా చెప్పి మీతో మాట్లాడమని కోరింది. పిల్ల ఫొటో కూడా పోస్ట్‌లో పంపింది" అన్నారు రాఘవయ్య.
తన కూతురు తన గురించి ఎంత ఆలోచించింది? షాకి నిజంగానే ఎంతో గర్వంగా అన్పించింది. అతని చేతులు అప్రయత్నంగా మీసం మీదకు వెళ్ళి మీసాన్ని దువ్వాయి.




"పిల్ల లక్షణంగా ఉంది. చదువుకుంది. మావాడు పనిచేసే చోటునే పనిచేస్తోంది. ఇంక అభ్యంతరం ఏముంటుంది? కానీ మా వాడు ఏం గొడవ చేస్తాడోనని భయ పడ్డాం. అదృష్టవశాత్తు దేవుడి దయవలన వాడిలో మార్పు వచ్చింది..." సంతోషంగా చెప్పారు శారదమ్మ.

"ఏమయ్యా! ఈ సంబంధం నీకు ఇష్ట మేనా?"

అతను ఏదో చెప్పబోతుండగా.

తిరిగి తనే అన్నారు రాఘవయ్య. "ఇప్ప టికిప్పుడే సమాధానం చెప్పాల్సిన పనిలేదు. మీ దంపతులిద్దరూ బాగా ఆలోచించు కోండి. మీ అమ్మాయితోను నీకు కాబోయే వియ్యంకుడితో కూడా మాట్లాడండి. ఆ తర్వాతే నిర్ణయం తీసుకోండి..."

"నువ్వు అమ్మా! అమ్మా! అంటున్నావు కాబట్టి నన్నోమాట చెప్పమంటావా?" అన్నారు శారదమ్మ.

"చెప్పండమ్మా" వినయంగా అన్నాడు షా.

"ఇన్నాళ్ళూ శత్రువుల్లా కయ్యానికి కాలు దువ్వినట్లుగా బతికినవాళ్ళు ఒక్కసారిగా మీలో మార్పు రావడం కష్టమే. కానీ ప్రశాం తంగా ఉండటానికి ప్రయత్నించండి. శత్రు త్వంలోకన్నా మిత్రులుగా కలిసి ఉండడం లోనే ఎంతో ఆనందం ఉందని మీకు అర్థం అవుతుంది. మా అబ్బాయికి కూడా నేను ఇదే చెప్పాను. మీ గొడవలన్నీ పక్కన పెట్టే యండి. పిల్లల మనసు అర్థం చేసుకోండి. ఈ శుభకార్యం జరగనివ్వండి"

"ఇందులో ఆలోచించాల్సిందేం లేదమ్మా! కోరి మా ఇంటికి వచ్చి మా పిల్లను కోడలిగా చేసుకుంటానంటే కాదంటానా! మీలాంటి వారితో వియ్యమందుకోవడం నా అదృష్ట మమ్మా..." అని రాఘవయ్యవైపు తిరిగాడు.

"మీరు విజేష్ తండ్రిగారని తెలిసి ఉంటే నేను మీ అబ్బాయితో గొడవలు పడేవాడినే కాదు. నా వ్యాపారం కూడా అతనికి అప్ప చెప్పేసి మీ అబ్బాయి దగ్గర రోజుకూలికి పనిచేసేవాడిని..." చాలా ఎమోషనల్ గా ఫీలయ్యాడు షా.

అక్కడున్నవారికి అతను అన్నదేమిటో అర్థం కాలేదు.

"కొన్ని యేళ్ళక్రితం భూకంపం వచ్చిన ప్పుడు నాకు ఏడేళ్ళుంటాయి. ఆరోజు జన వరి 26. గణతంత్ర దినోత్సవం. ఆరోజు అమ్మమీద రాసినందుకు నాకు ప్రైజు వచ్చింది. నేను స్కూలుకి వెళ్ళాను. తిరిగి వచ్చేసరికి కూలిపోయిన ఇల్లు, రాళ్ళగుట్టలు కన్పించాయి. పిచ్చిపట్టినవాడిలా ఆ శిథి లాల్లో అమ్మకోసం తిరిగాను. ఆ సమ యంలో పైనుంచి సిమెంట్ దిమ్మ కూలి నామీద పడబోయింది. నేను ఆ విష యాన్ని కూడా గమనించలేదు. అదిగో అప్పుడే ఈయన నన్ను పక్కకిలాగి రక్షిం చారు. అమ్మ చచ్చిపోయిందన్న బాధ తట్టు కోలేక ఓ ఇనుప ఊచతో పొడుచుకోబో యాను. అమ్మ లేని బతుకు ఎందుకన్పిం చింది. అప్పుడు కూడా ఈ మహానుభావుడే రక్షించారు. సహాయ శిబిరంలో ఉండమని ఎంత చెప్పినా నేనే వినలేదు. అమ్మని వెతు క్కుంటూ వెళ్ళిపోయాను..." నీరవ్‌షా కళ్ళు నీళ్ళతో నిండిపోయాయి.

అమ్మ గుర్తుకొస్తే భర్త తనను తాను కంట్రోలు తీసుకోలేడని షా భార్యకు తెలుసు.

"రాగానే ఆయన్ని గుర్తుపట్టినా ఆయనేనని నా సందేహం తీర్చుకోడానికి కొంత టైం పట్టింది. ఆరోజు నా జీవితాన్ని కాపాడిన దేవుడి ఇంటికి నా కూతుర్ని కోడ లిగా పంపడానికి నాకు అభ్యంతరం ఏముంటుంది?" అన్నాడు షా.

రాఘవయ్యగారు తృప్తిగా నిట్టూర్చాడు.

మనం చేసే ఉపకారం ఒక వ్యక్తికి జీవి తాన్నిస్తుంది. మనిషి జీవిత విధానాన్ని మార్చేస్తుంది. అందుకే ఎవరికైనా ఏదైనా చేయగలిగితే మనం కేవలం మంచే



చేయాలి. ఇతరుల గురించి ఏదైనా ఆలోచించగలిగితే మంచే ఆలోచించాలి. ఇతరుల గురించి మాట్లాడితే ఆ వ్యక్తిలోని మంచే మాట్లాడాలి. ఇది రాఘవయ్యగారి సిద్ధాంతం.

భువనేశ్వరి శారదమ్మ, రాఘవయ్యగార్లకు ఇల్లు చూపించింది. నీరవ్‌షా చిన్నప్పటి ఫోటో చూస్తుంటే ఆ ఫోటో ఎక్కడో చూసినట్టు అన్పించింది శారదమ్మగారికి. ఆ ఫోటో ఎక్కడ చూసిందీ గుర్తుచేసుకునేందుకు ఆవిడ ప్రయత్నించి వుంటే బాగుండేది.

ఆ ఇల్లు, వాతావరణం చూశాక బయట కన్పించే నీరవ్‌షాకు ఇప్పుడు తను చూస్తున్న షాకు చాలా బేధం ఉందన్పించింది. ముఖ్యంగా తన ఇంటికి వచ్చి బెదిరించిన నీరవ్‌షా ఇతనేనా? అన్న అనుమానం కూడా కలిగింది ఆవిడకు.

వాళ్లు వచ్చేప్పుడు ఇద్దరికీ బట్టలు పెట్టి షా దంపతులు వారి ఆశీర్వాదం తీసుకున్నారు.

నిజంగా విజేష్ మారిపోయాడా! లేక ఇది తుఫాను ముందరి ప్రశాంతతా అంటే అందుకు కాలమే సమాధానం చెప్పాలి.

★ ★ ★

విజేష్ తనను కలవాలనుకుంటున్న సంగతి వినగానే అహ్మద్ ఆశ్చర్యపోయాడు హఠాత్తుగా. "మీ నాన్నగారిలో ఇంత మార్పా? " అన్నాడు అహ్మద్.

"అసలేమైందంటే..." అని జరిగినదంతా చెప్పబోయి ఆగిపోయింది సుశీల. ఇన్నాళ్లుగా శారదమ్మ, రాఘవయ్యగార్లే తన నానమ్మ, తాతయ్య అని భావిస్తూ వచ్చింది. ఇప్పుడు కాదని తెలిశాక ఆ ప్రేమ పోతుందా? ఊహూ... అలా జరిగితే ఇంట్లో వాళ్లెవ్వరూ తట్టుకోలేరు. అయినా అహ్మద్‌తో ఇప్పుడు ఈ విషయం చెప్పాల్సిన అవసరం ఏముంది? అది తమ ఇంటికి సంబంధించిన విషయం. అహ్మద్ తనకు కాబోయే భర్త అయినంతమాత్రాన తన పుట్టింటి విషయాలన్నీ అతనికి చెప్పాల్సిన అవసరం ఏముంది? ముఖ్యంగా ఈ సంగతి మాత్రం తను ఎప్పటికీ బయటపెట్టదు.

"ఏమిటి సుశీలా! అంత దీర్ఘంగా ఆలోచించాల్సిన విషయమా!? "

"అదేంలేదులే గానీ ఇంతకీ నువ్వేం అడిగావు? "

"మీ నాన్నగారిలో హఠాత్తుగా ఇంత మార్పెలా వచ్చిందని అడిగాను" తన ప్రశ్న రిపీట్ చేశాడు అహ్మద్.

"అదా..." తేలికగా నవ్వేసింది సుశీల.

"ఆ...అదే" అని తనూ నవ్వాడు అహ్మద్.

"ఏం లేదు... నానమ్మ జరిగిందంతా తాతగారికి చెప్పింది. ఆయనేమో నాన్నగారిని కూర్చోబెట్టి వివరంగా మాట్లాడారు. దాంతో సమస్య పరిష్కారమైపోయింది" సింపుల్‌గా చెప్పింది సుశీల.

"అందుకే నన్నమాట అమ్మాయిగారి ముఖం వెలిగిపోతోంది"

సుశీల అందంగా సిగ్గుపడింది.

ఆ తర్వాత అహ్మద్ విజేష్‌ని కలిశాడు.

అహ్మద్ కుటుంబ వివరాలు అడిగి తెలుసుకున్నాడు విజేష్. అతనితో చాలాసేపు మాట్లాడాడు. అహ్మద్‌లో వయసుకి మించిన పరిపక్వత ఉందని విజేష్‌కి అర్థంఅయ్యింది. అప్పటికిగాని అతని టెన్షన్ తగ్గలేదు.

చదువు పూర్తికాగానే ఒక సంవత్సరం పాటు తన దగ్గర ట్రైనింగ్ అవ్వమని చెప్పాడు విజేష్. ఆ తర్వాత సొంతంగా వ్యాపారం పెట్టుకోవడమో లేక తన వ్యాపారంలో భాగస్వామ్యం తీసుకోవడమో చెయ్యచ్చని చెప్పాడు.

అహ్మద్‌కు కూడా విజేష్ బాగా నచ్చాడు. అతని వ్యాపార దక్షత నచ్చింది. అందుకే చెప్పాడు చదువు పూర్తయ్యాక కాదు ఇప్పట్నించే రోజుకో గంట మీకు సహాయం చేస్తానని చెప్పాడు. ఆ మాట విజేష్‌కి

బాగా నచ్చింది.

"సో! మీ ప్రేమ సక్సెస్ అయినట్టేగా!" నవ్వాడు విజేష్.

"లేదండీ!" అన్నాడు అహ్మద్.

"అదేంటి? " భృకుటి ముడిచాడు విజేష్.

"పెళ్ళికి ముందు అందరూ కూడా తమని మించిన గొప్ప ప్రేమికులు లేరనుకుంటారు. పెళ్ళయ్యాక ఆ థ్రిల్ తగ్గిపోయి వారి ప్రేమలో మార్పు వచ్చేస్తుంది. అప్పుడిక ఎందుకు పెళ్ళిచేసుకున్నామా అని బాధపడి విడిపోతారు. పెళ్ళికి ముందు ఉన్న ప్రేమను పెళ్ళి తర్వాత కూడా నిలుపుకోగలగడమే నిజమైన ప్రేమ. అప్పుడే మా ప్రేమ సక్సెస్ అయినట్టు"

అహ్మద్ విశ్లేషణకు విజేష్ అబ్బురపడకుండా ఉండలేకపోయాడు.

"ఇంతకీ పెళ్లెప్పుడు చేసుకోవాలనుకుంటున్నారు? "

"మరో రెండేళ్ళ తర్వాత"

"రెండేళ్ళ తర్వాత...!" ఈ అబ్బాయేంటి షాకులమీద షాకు ఇస్తున్నాడు అనుకున్నాడు విజేష్.

"అవును సర్! ఎందుకంటే... నా కాళ్ళ మీద నేను నిలబడటానికి ఆమాత్రం టైం పడుతుంది అని నేను అనుకుంటున్నాను"

"కానీ రెండేళ్ళంటే..." సందిగ్ధంగా ఆగిపోయాడు విజేష్.

"అవును సర్... సుశీలకి కూడా నేను ఆల్రెడీ ఈ విషయం చెప్పాను. మీరు మీ దగ్గర శిక్షణ తీసుకోమంటున్నారు కానీ నేను, సుశీల ఒక బట్టలషాపు, ఒక హ్యాండీ క్రాఫ్ట్ షోరూం ఆరంభించాలనుకున్నాం. సుశీల ఎప్పుడూ చెప్తుంటుంది వాళ్ళ నానమ్మ అద్భుతంగా ఎంబ్రాయిడరీ చేస్తారని. సుశీలకు కూడా చాలా బాగా వచ్చు ఇక మా అమ్మగారికి కూడా ఇందులో ప్రవేశం ఉంది. అందుకే ఒక బట్టలషాపు ఆరంభించి ముఖ్యంగా డిజైనర్ డ్రస్సులు, చీరలు అందించాలన్నది నా కోరిక. నా భార్య పెళ్ళయ్యాక ఇంటిపట్టునే ఉండాలన్నది నా అభిమతం కాదు. తనకు కూడా ఓ కెరీర్ ఉండాలి. ప్రతి పైసాకీ భర్తమీదో, తండ్రిమీదో ఆధారపడకుండా స్వతంత్రంగా ఖర్చుపెట్టుకోగలగాలి. ఇదంతా ఆమె సంతోషంగా చేయగలిగితేనే. లేదంటే తను ఇంటిపట్టునే ఉండచ్చు. నా భార్య యాక్టివ్‌గా, సక్సెస్‌ఫుల్‌గా అటు ఇంటిని ఇటు వ్యాపారాన్ని నడిపించ గలదై ఉండాలి"

విజేష్ ఆనందంతో అహ్మద్ చేతులు పట్టుకున్నాడు. "నువ్వు... నువ్వు నాకు బాగా నచ్చావు. నేను... సుశీలకి ఎలాంటి భర్త రావాలనుకున్నానో ఆ లక్షణాలన్నీ నీకు ఉన్నాయి. సుశీలని ఓ బిజినెస్ ఉమన్‌గా చూడాలన్నది నా కోరిక"

"తప్పకుండా సర్!" అన్నాడు అహ్మద్. "మీ అబ్బాయి చిన్నవాడు. మొత్తం వ్యాపారం మీరొక్కరు చూసుకోవడం కష్టం. నేను తప్పకుండా మీకు సహాయంగా ఉంటాను. కానీ మా పెళ్ళికి రెండేళ్ళు టైం పడుతుంది. దీనికి మీరు అంగీకరించాలి"

"ఓ. కే. డన్ ఒప్పుకుంటున్నాను" చెప్పాడు విజేష్.

మరికాసేపు మాట్లాడి అహ్మద్ వెళ్ళబోయాడు. "ఉండు... కారులో డ్రాప్ చేయమని చెప్తాను"

"వద్దండీ... సుఖపడటం అలవాటైతే ఆ తర్వాత కష్టం భరించలేనంత కష్టంగా అన్పిస్తుంది. నాకు జీవితంలో ఒక్కొక్క మెట్టు పైకి ఎక్కడమే ఇష్టం... మరొక్క విషయం చెప్తే ఏమీ అనుకోరుగా!"

"చెప్పు... ఏం అనుకోనులే"

"ఏ వ్యక్తి అయినా మొదటిసారి కలిసినప్పుడు ఎదుటివారిని ఇంప్రెస్ చేయాలని ప్రయత్నిస్తాడు. రోజులు గడిచేకొద్దీ ఆ ముసుగు తొలగిపోయి అసలు వ్యక్తి బయటకు వస్తాడు. అప్పుడు మాత్రమే ఆ వ్యక్తిని ఎంత దూరంలో ఉంచాలి అనేది నిర్ణయించుకోవాలి. అలాకాకుండా మొదటి పరి

చయంలోనే ఆ వ్యక్తిని మనసుకి దగ్గరగా రానిస్తే ఆ వ్యక్తి మన మనసు ఎరిగి ప్రయత్నించచ్చు లేదా మన మనసు నొప్పించి, మన గుండెలమీద తన్ని బయటకు వెళ్ళిపోవచ్చు" అని ఒక్కక్షణం ఆగి తిరిగి అన్నాడు. "ఇదంతా మీకు తెలియదని కాదు. నా మనసులో మాట చెప్పాను. వెళ్ళొస్తాను" నమస్కరించి వెళ్ళిపోయాడు అహ్మద్.

విజేష్ మరోసారి మనసులో అనుకున్నాడు. "అహ్మద్! నువ్వు నిజంగా నాకు నచ్చావు" అని.

ఆ వయసులో అంత మెచూర్డ్‌గా మాట్లాడటం ఈ అబ్బాయికి ఎలా అలవడింది? ఈ మాట ఏ పదోసారో అతను అనుకుని ఉంటాడు.

ఒక మనిషిని చూడకుండానే నచ్చలేదని చెప్పడానికి, చూశాక, మాట్లాడాక నచ్చలేదని చెప్పడానికి చాలా తేడా వుంది. ఇప్పుడు విజేష్‌కి ఆ తేడా ఏమిటో స్పష్టంగా అర్థం అయ్యింది.



"అన్నా! ఈ విషయం తెలుసా?"

"ఏవిషయంరా?" చిరాకుపడ్డాడు వసంత్.

"అదేనన్నా! ఈ విషయం అంధరికీ తెలిసిందే. నీకు తెలీలేదా? ఎక్కడున్నావన్నా! మాటకి పదిసార్లు వాళ్ళిద్దర్నీ నాశనంచేస్తాను, వాళ్లిద్దర్నీ నాశనం చేస్తానని అంటావే"

"ఒరేయ్...! ముందు నిన్ను... నిన్ను నాశనం చేస్తాను" కోపంతో పళ్ళు కొరికాడు వసంత్.

"అన్నా! నేనేం చేశానన్నా... ఒక్కసారిగా నా నెత్తిన బండ పడేసినట్టుగా అంత మాట అనేశావు" ఒణికిపోయాడతను.

"లేదంటే... ఏమిటి నువ్వు మాట్లాడేది. చెప్పేదానికి ఓ అర్థం ఉండి ఏడవాలిగా! అదిలేకుండా 'నీకు ఈ విషయం తెలుసా! ఊరంతటికీ తెలుసు. ఇది తెలీని వాడివి వాళ్లనేం నాశనం చేస్తావ్?' అంటే ఏమని అర్థంచేసుకోవాలి?"

"క్షమించన్నా! నాది పొరపాటే..."

"సర్లే... అసలు సంగతి చెప్పి ఏడు"

"అదేనన్నా! ఆ విజేష్, నీరవ్‌షా కలిసిపోయారంట"

"ఏమిట్రా నువ్వనేది?" షాకయ్యాడు వసంత్.

"నిజమే చెప్తున్నానన్నా" భయంతో నోట మాట తడబడింది అతనికి.

"నీముఖం... నువ్వేదో కలగని ఉంటావు"

"అయ్యో! లేదన్నా! నేను చెప్పేది నిజం. నీమీద ఒట్టన్నా!"

"ఇదెలా సాధ్యం? ఏమాత్రం నమ్మశక్యంగా లేదే! నిన్నటివరకు ఒకరిమీద ఒకరు కత్తులు దూసుకున్నారు. నిన్ను నేను సర్వనాశనం చేస్తానని ఒకడు, నేను తల్చుకుంటే నీ శాల్తీ గల్లంతై పోతుందని మరొకరు ప్రతిజ్ఞలు చేశారు. అంతలోనే అసలు... ఎలా వాళ్లిద్దరూ కలిసిపోయార్రా?"

"అదంతా ఏమో తెలీదన్నా! మన కుర్రాడొకడు ఈ సంగతి చెప్పాడు" అని గొంతు కొంచెం తగ్గించాడు. "నీకు అసలు విషయం ఇంకా చెప్పలేదు. అది విన్నావనుకో ఇంకా షాకవుతావు" అన్నాడతను.





"ఏంట్రా... ఇవ్వాళ ఇలా షాకులుమీద షాకులిస్తున్నావ్?"

"విన్నా! షాకి ఒక కూతురుందని నీకు తెలుసుగా!"

"అవున్రా... కొంపదీసి షా తనకూతుర్ని విజేష్ కొడుక్కి ఇచ్చి పెళ్ళిచేస్తాడటనా... ఒరేయ్ అలా చేస్తే వరహీనం అవుతుం దిరా! విజేష్ కొడుకు చిన్న పిల్లాడు కదా!" అదేదో జోక్ అయినట్టు పగలబడి నవ్వాడు వసంత్.

"ఊరుకో అన్నా! అక్కడ కొంపలు ముని గిపోతుంటే నువ్వీ విషయాన్ని ఇంత తేలి కగా ఎలా తీసుకోగలుగుతున్నావ్?"

"ఏంట్రా నువ్వు చెప్పేది నిజమా!?"

వసంత్‌వైపు ఒకసారి సీరియస్‌గా చూసి అన్నాడు. "నిజమేనన్నా"

"ఎలారా! విజేష్ కొడుకు షా కూతురికన్నా చిన్నవాడు కదా!"

"అన్నా!" చిన్న నవ్వు నవ్వాడతను. "నువ్వు అంతవరకే ఆలోచిస్తున్నావు. ఇంకొంచెం ఆలోచిస్తే నీకీపాటికి విషయం అర్థమై ఉండేది. సర్లే... నేనే చెప్తాను విను. విజేష్‌కి ఒక చెల్లెలుంది"

"అవును... ఆవిడ పేరు మధుజైన్. అమెరికాలో ఉంటోంది. అయితే"

"అక్కడ ఉందన్నా అసలు విషయం. ఆవిడకు ఒక కొడుకున్నాడు"

"అంటే... నువ్వు చెప్పేది"

"కరెక్టుగా క్యాచ్ చేశావన్నా. ఆ నీరవ్‌షా కూతుర్ని విజేష్ చెల్లెలి కొడుక్కి ఇస్తున్నారు"

వసంత్ ముఖంలో చిరునవ్వు మాయమైంది. అంతలోనే మరో అనుమానం చోటుచేసుకుంది. "అవున్రా! చెల్లెలి కొడుకుకు తన కూతుర్నే ఇవ్వచ్చు కదా! విజేష్ ఎందుకిలాంటి పిచ్చి పని చేశాడు"

"ఇవ్వచ్చన్నా! అసలు చిన్నప్పటినుంచి అలా అనే అనుకున్నారు. కానీ విజేష్ కూతురు కాలేజీలో ఓ ముస్లింకుర్రాడిని ప్రేమించిందట. దాంతో ఈ విధంగా సంబంధం సెట్ అయ్యింది" విపులంగా చెప్పాడతను.

"థాంక్స్‌రా! మంచి సమాచారం అందించావు" అంటూ పర్స్‌లోంచి కొంత డబ్బు తీసి అతనికిచ్చాడు వసంత్.

"అన్నా! నేను అడిగింది" సన్నగా సణిగాడతను.

"గుర్తుందిరా... త్వరలోనే నిన్ను కూడా నా దగ్గర పర్మినెంటుగా పెట్టేసుకుంటాను. నా క్కొంచెం టైమ్ ఇవ్వు"

"సరేనన్నా!" వెళ్ళడానికి లేచాడతను.

"అది సరేరా ఈ విషయాలన్నీ నీకెలా తెలుసో చెప్పనేలేదు"

"సారీ అన్నా! వృత్తిధర్మం... దానికి ద్రోహంచేయలేను. మళ్ళీ ఏదైనా సమాచారం అందితే వచ్చి చెప్తాను. ఈ లోగా వాళ్ళిద్దరి మైత్రీబంధం ఎలా విచ్ఛిన్నం చేయాలో ఆలోచించు" అన్నాడు.

వసంత్ అలాగేనన్నట్లు తలూపాడు.

షా, విజేష్‌లు అలా గొడవలన్నీ మర్చిపోవడం అతనికెంతమాత్రం ఇష్టంలేదు. వాళ్ళిద్దరూ అలా కొట్టుకుంటూ ఉంటేనే తన లాంటి వాళ్ళు లబ్ధిపడతారని వసంత్‌కు బాగా తెలుసు. అందుకే వాళ్ళిద్దరి మధ్యన దూరం పెంచేందుకు చాలా పనులు చేశాడు. అయినా వాళ్ళిద్దరూ అవన్నీ మర్చిపోయి ఎలా కలిసిపోయారన్నది ప్రస్తుతం వసంత్‌ని వేధిస్తున్న మిలియన్ డాలర్ల ప్రశ్న.

ఇంతకుముందు చెప్పినట్టుగా వసంత్ ఎవ్వర్నీ నమ్మడు. తన నీడను తానే విశ్వసించని వాడు ఇతురులు చెప్పింది ఎలా నమ్ముతాడు. అయితే ఇంతకుముందు వచ్చిన వ్యక్తులులాంటి వాళ్ళు వసంత్ దగ్గర ఓ పది మంది దాకా ఉన్నారు. వాళ్ళంతా ఇదిగో ఇలాంటి సమాచారాలే సేకరిస్తుంటారు.

అతను వెళ్ళగానే వసంత్ విజేష్‌కి ఫోన్ చేశాడు. "మీరిద్దరూ కలిసిపోవడం చాలా ఆనందంగా వుందన్నా!" అన్నాడు. "నీది

చాలా పెద్ద మనసుకాబట్టే నీరవ్‌షా నీపట్ల ఎంతో దుర్మార్గంగా ప్రవర్తించినా అతన్ని క్షమించగలిగావు" అన్నాడు.

వసంత్ వేసిన బాణం సూటిగా తగలాల్సినచోటే తగిలింది. విజేష్ మాటల్నిబట్టి షా, విజేష్‌లిద్దరూ తమ మధ్య ఉన్న గోడ వలకు తెరదించేశారని అర్థం అయ్యింది. వాళ్లూ వాళ్లూ కలిసిపోతే తనేం చేయాలి? చూస్తూ ఊరుకోవాలా? ఊరుకోవచ్చు ఆరోజు రాంభాయ్ స్థలం విషయంలో తనని విజేష్ అవమానించాడు. అదెలా మర్చిపోగలడు? ఇక షా అతనికి తనంటే ఎంతమాత్రం గౌరవంలేదు. మరి వాళ్ళిద్దరినీ తనెలా క్షమిస్తాడు.

అంతే... వసంత్ మనసులో ఒక పథకం రూపుదిద్దుకుంది.

★ ★ ★

ఆరోజు స్మృతి అపార్ట్‌మెంట్స్ మొదటి టవర్, మొదటి అంతస్థుకు శ్లాబ్ వేస్తున్నారు.

ముందురోజే షా వెళ్ళి విషయం చెప్పాడు. ఎప్పుడూ తన కూతురు పూజా కార్యక్రమాలు నిర్వహిస్తుందనీ; ఈసారి శాంత ఊరిలో లేదు కాబట్టి సుశీలను పంపమని విజేష్‌ను కోరాడు. షా చెప్పిన దానికి విజేష్ అంగీకరించాడు. కూతురితో పాటు తల్లిని కూడా పంపాడు.

వాళ్ళిద్దరిలో మార్పు రావడం అటు చందూ, బిక్కు, దేశాయ్‌లకు ఇటు రాంభాయ్, వర్ధన్‌లకు కూడా చాలా ఆనందంగా ఉంది.

సుశీల, శారదమ్మ వెళ్లారు. శ్లాబ్ వేయడం మొదలుపెట్టేముందు పూజ చేశారు. ప్రసాదం అందరికీ పంచారు.

పని మొదలైంది.

ఆనంద్ స్వరూప్ దగ్గరుండి అందరికీ సూచనలు ఇస్తున్నాడు. ఎందువల్లనో అతను అంత ఉత్సాహంగా లేకపోవడం నీరవ్‌షా గమనించాడు. బహుశా పని ఒత్తిడివల్ల అలా కన్పిస్తున్నాడేమోననుకున్నాడే కానీ ఆ విషయానికి పెద్దగా ప్రాధాన్యత నివ్వలేదు.

నిజానికి ముందురోజు రాత్రి ఆనంద్ స్వరూప్‌కి విజేష్ నుంచి ఫోన్ వచ్చింది. శ్లాబ్ వేసిన కొద్దిరోజులలోనే అది కూలిపోవాలనీ లేదంటే అతన్ని, అతని కుటుంబాన్ని సర్వనాశనం చేస్తానని హెచ్చరించాడు. ఒక పక్క వృత్తి ధర్మం... మరొక పక్క కుటుంబం... ఎవ్వరికీ అన్యాయం చేయలేక మానసికంగా నలిగిపోయి చాలాసేపటి తర్వాత ఒక నిర్ణయానికి వచ్చాడతను.

★ ★ ★

శ్లాబ్ వేసిన సరిగ్గా ఇరవైరోజులకు స్మృతి కూలిపోయింది. ఆ సమయంలో అక్కడ పెద్దగా పని జరగకపోవడంవల్ల పెద్దగా ప్రాణనష్టం జరగలేదు. కానీ ఒకరిద్దరికి బాగా గాయాలు తగిలాయి. వారిని ఆస్పత్రిలో చేర్చి షాకు సమాచారం అందించారు.

ఊర్లో ఈ వార్త చాలా సంచలనమయ్యింది.

నీరవ్‌షాకు అంత ఆగ్రహం ఎప్పుడూ రాలేదు. వెంటనే ఆనంద్ స్వరూప్‌ను తీసుకురమ్మని మనుషుల్ని పంపాడు.

షా మనుషులు గోడకు కొట్టిన బంతిలా వెనక్కితిరిగి వచ్చారు. దాంతో షా మరీ ఇరిటేట్ అయ్యాడు.

"ఏరా! ఆనంద్...ఎక్కడ? " అరిచాడు షా.

"అన్నా! అతను" చందు నీళ్ళు నమిలాడు.

"చెప్పరా! ఏడి వాడు" ఇంకాస్త గట్టిగా అరిచాడు షా.

"అన్నా! అతను... అతను... ఆత్మహత్యా ప్రయత్నం చేశాడటన్నా"

"ఆత్మహత్యా..." షా... షాకయ్యాడు.

"అవునన్నా! ఇంట్లో ఎవ్వరూ లేరు...పక్కింటి వాళ్ళనడిగితే చెప్పారు. ఆస్పత్రికి




తీసుకువెళ్ళింద్రంట"

"ఇప్పుడెలా వుంది అతనికి"

"తెలీదన్నా... ఆస్పత్రికి పోదామనుకుని నీకు విషయం చెప్పాలని ఇటు వచ్చినాం" అన్నాడు చందు.

"పదండి... వెడదాం"

నీరవ్ షా ఆస్పత్రికి వెళ్ళేసరికి ఆనంద్ స్వరూప్‌ని ఐ.సి.యూలోకి తీసుకువెళ్లారు. బయట అతని భార్య, కూతురు, కొడుకు ఉన్నారు. వాళ్ళ దగ్గరికి వెళ్లాడు చందు.

"ఏమ్మా... మీరు..." అన్నాడు.

"ఆనంద్‌గారి భార్యను" అంది ఆవిడ.

ఎంత ఆపుకున్నా ఆవిడ దుఃఖం ఆగడం లేదు.

"ఈయన నీరవ్‌షా! బిల్డర్... ఈయన దగ్గరే మీవారు పని చేస్తున్నారు" చెప్పాడు చందు.

ఆవిడ రెండుచేతులు జోడించి నమస్కరించింది.

"చూడండమ్మా! మీవారికి ఏమీకాదు... మీరు ధైర్యం తెచ్చుకోండి. మీరే కృంగిపోతే పిల్లల్ని ఎవరు ఓదారుస్తారు?" అని పిల్లల వైపు తిరిగి చెప్పాడు షా. "మీ నాన్నగారికి ఏమీకాదు. ఎంత ఖర్చు అయినా నేను వైద్యం చేయిస్తాను. మీరు ధైర్యంగా ఉండండి"

ఆ మాటలకి ఆనంద్ స్వరూప్ కొడుకు "చాలా థాంక్సండీ" అన్నాడు.

అంతలో డాక్టరు బయటకి వచ్చాడు.

"డాక్టర్! నేను నీరవ్‌షా!" తననుతాను పరిచయం చేసుకున్నాడు.

"హల్లో! మీరు ఇక్కడ ఉన్నారేమిటి?" అడిగాడాయన.

"లోపల పేషంటు... ప్రస్తుతం నా దగ్గర పనిచేస్తున్నాడు"

"ఓ... అలాగా!"

"అతని పరిస్థితి ఇప్పుడెలా ఉంది డాక్టర్" ఎంతగా కంట్రోలు చేసుకునేందుకు ప్రయత్నించినా షా గొంతులో ఖంగారు ధ్వనించింది.

"ఇప్పుడే ఏం చెప్పలేం... ఐ.సి.యూలో ఉంచాము. ప్రస్తుతానికి బి.పి. అదీ కంట్రోలులోనే ఉంది. బట్ పురుగుల మందు ఎక్కువ డోసు తీసుకోవడంవల్ల కొంచెం పరిస్థితి సీరియస్‌గానే ఉందని చెప్పాలి. చూద్దాం... ఇరవైనాలుగు గంటలు గడిస్తే కానీ ఏం చెప్పలేం" చాలా కాజువల్‌గా చెప్పాడు.

"ఓ.కే. డాక్టర్... థాంక్యూ" అని తన విజిటింగ్ కార్డ్ తీసిచ్చాడు. "ఏదైనా అవసరం అయితే నాకు కాల్ చెయ్యండి. డబ్బు సంగతి వాళ్ళ ఫ్యామిలీకి చెప్పొద్దు. బిల్స్ అవీ నేనే పే చేస్తాను"

"దట్స్ రైట్" అని ఆయన వెళ్ళిపోయాడు.

పేషెంటుని జాయిన్ చేసుకునే ముందే కంప్లైంట్ ఇచ్చినట్టున్నారు పోలీసులు వచ్చారు.

ఆనంద్ స్వరూప్ భార్యను, పిల్లల్ని ఏవేవో ప్రశ్నలడిగారు. స్వరూప్ భార్య అంతవరకు తన కొంగులో కట్టిన ఉత్తరం తీసి ఇన్స్‌పెక్టర్‌కి ఇచ్చింది.

ఆ ఉత్తరం చదువుతుంటే ఆయన భృకుటి ముడిపడింది. "విజేష్‌గారు! ఇంత పని చేశారంటే నమ్మబుద్ధికావడంలేదే!" స్వగతంగా అనుకోబోయి పైకి అనేశాడు.

ఆ మాటలు నీరవ్‌షాకి వినిపించాయి.

"ఇన్స్‌పెక్టర్ మీరు చెప్పేది"

"అదే నాకూ అర్థంకావడంలేదు" అని షా వైపు తిరిగి అడిగాడు. "విజేష్, మీరు ఈమధ్య కలిసిపోయారు కదూ"

"అవును..."

"మరి... అతను... ఆనంద్‌ని బెదిరించడం. ఏంటో చాలా కన్‌ఫ్యూజింగ్‌గా ఉంది"

షాలో ఏదో అనుమానం చోటుచేసుకుంది. "దయచేసి వివరంగా చెప్తారా?" కొంచెం బిగ్గరగానే అన్నాడు షా.

"ఆనంద్ స్వరూప్ ఆత్మహత్య చేసుకునే ముందు ఓ సూసైడ్ నోట్ రాశాడు. అందులో స్మృతి అపార్ట్‌మెంట్స్ కాంట్రాక్ట్ తీసుకున్నప్పటినుంచి విజేష్ తనను బెదిరి స్తున్నాడని పేర్కొన్నాడు. స్మృతి కూలిపో వడం ద్వారా నీరవ్‌షాకు చెడ్డపేరు రావాలి. అతను ఈ రంగంలోంచి తప్పుకోవాలి. నేను ఈ రంగాన్ని ఏకఛత్రాధిపత్యంగా ఏలాలి అని విజేష్ తనదగ్గర తరచూ వ్యక్తంచేసేవాడు. ఆవిధంగా చేయకపోతే కుటుంబాన్ని నాశనం చేస్తాననే వాడట"

వింటుంటే షా దవడ కండరాలు బిగుసుకున్నాయి.

"మొన్నీమధ్యన వచ్చి స్మృతి మొదటి టవర్ మొదటి అంతస్థు శ్లాబ్ వెయ్యగానే కూలిపోవాలని చెప్పాడట. కుటుంబాన్ని రక్షించుకునేందుకు తాను విజేష్ చెప్పినట్టుగా చెయ్యక తప్పలేదని కానీ మనస్సాక్షి నిలదీస్తోందని... అందుకే ఆత్మహత్య చేసుకుంటున్నానని రాశాడు" ఇన్స్‌పెక్టర్ జరిగినదంతా చెప్పాడు.

నీరవ్‌షా అచేతనంగా నిలబడిపోయాడు. మనిద్దరిమధ్య గొడవలు లేవని ఓ పక్క చెప్తూ, మరో పక్క ఆనంద్ స్వరూప్‌ని బెదిరించాడన్నమాట.

ఓ పక్క తన కూతురు శాంతిని చెల్లెలి కొడుకు దినేష్‌కి చేసుకోవాలనుంది అంటూ సంబంధం మాట్లాడి మరోపక్క తన నాశనానికి ముహూర్తం పెట్టాడన్నమాట.

ఏమాత్రం అనుమానం రాకుండా ఎంత బాగా నటించాడు.

తనుమాత్రం విజేష్ చెప్పే మాటలకి తలాడించాడు. అతను పూర్తిగా మారిపోయాడని, తనకు తమ్ముడు దొరికాడని సంబరపడిపోయాడు. ఫూల్... తనో బిగ్ ఫూల్. ఇడియట్... తననుతాను తిట్టుకున్నాడు షా.

ఓ పావుగంట తర్వాత స్థిమితపడ్డాడు.

"ఇన్స్‌పెక్టర్! నేను కూడా కంప్లైట్ రాసిస్తాను. అతన్ని అరెస్ట్ చెయ్యండి" అన్నాడు షా.

"అన్నా..." వారించాడు చందు. "తొందరపడ్తున్నావేమోనన్నా"

"లేదురా... ఇప్పటికే ఆలస్యం చేశాను" అని వెనుతిరిగాడు.

పోలీసులు విజేష్‌ని ట్రేస్ చేసేందుకు బయలుదేరారు.



ఆ రోజు విజేష్ మనసు ఏదో తెలీని ఆందోళనకు లోనైంది. ఏదో కీడు జరగబోతోంది అని అతని మనసు శంకించసాగింది. బయలుదేరిన వాడే ఒక్కక్షణం తిరిగి ఇంటికి వెళ్ళిపోదామా అనుకున్నాడు. అంతలోనే ఆ ఆలోచన విరమించుకుని ముందుకి సాగిపోయాడు.

కారులో వెడుతూనే వర్ధన్‌కి ఫోన్ చేశాడు. అతని సెల్ ఆఫ్‌లో ఉన్నట్టుంది. కనీసం పక్కన ఎవరైనా ఉంటే బాగుండునన్పించింది అతనికి. రతీబెన్ గోవిందా సైట్ గురించి ప్లాన్ చేయడానికి ఇంజనీరు దగ్గరకు వెడ్తున్నాడతను. నిజానికి అహ్మద్ చాలా చక్కగా ప్లాన్ తయారుచేశాడు. దానినలాగే ఉంచి ఏవైనా చిన్న చిన్న మార్పులు చేయిస్తే సరిపోతుందని

విజేష్ ఉద్దేశ్యం.

ఎప్పుడూ వెళ్లేరూట్ కాకుండా దగ్గరి దారి లోంచి కారు పోనిచ్చాడు. తనవెనుక ఓ కారు ఫాలో అవుతోందని అతనికి తెలీదు.

సరిగ్గా ఇంకో వందగజాలలో ఇంజనీరు ఇల్లు వస్తుందనగా అప్పుడు జరిగింది ఆ సంఘటన. ఎవరో కారుకి అడ్డంగా వచ్చారు. ఎంత ప్రయత్నించినా సడన్‌బ్రేక్ పడకపోవడంతో ఆ వ్యక్తి కారుకింద పడిపోయాడు. కారు ఆపి విజేష్ కిందకు దిగాడు. అదృష్టవశాత్తు దెబ్బలేం తగల్లేదు. భయం వల్ల స్పృహకోల్పోయాడంతే.

'హమ్మయ్య' అని నిట్టూర్చబోయేంతలో... అప్పుడు పడింది ఒక దెబ్బ. తల పగిలిపోతుందేమోనన్న బాధతో "అమ్మా" అంటూ తల పట్టుకున్నాడు విజేష్. దెబ్బ తర్వాత దెబ్బ పడుతూనే ఉంది. విజేష్ అరుపులు, రోదనలు ఎవ్వరికీ విన్పించ లేదు. విన్పించిన వారు కసాయిలయ్యారు. రక్తపు మడుగులో అతన్ని అలాగే వదిలేసి వాళ్ళు వెళ్ళిపోయారు.

కళ్ళు మూసుకు పోతుండగా సెల్ చేతిలోకి తీసుకున్నాడు విజేష్.

వర్ధన్ నెంబర్ నొక్కాడు. దానికే ఎంతో కష్టపడాల్సి వచ్చింది. అవతలివైపునుంచి వర్ధన్ "అన్నా! అన్నా" అంటున్నా విజేష్ మాట్లాడలేకపోయాడు.

విజేష్ చేతిలోంచి సెల్ జారిపోయింది. అతనికి స్పృహతప్పింది.

★ ★ ★

పోలీసులు ముందుగా విజేష్ ఆఫీసుకి వెళ్ళారు.

"విజేష్ ఎక్కడ?" అన్నాడు ఇన్స్‌పెక్టర్.

"తెలీదు సార్! అన్న ఇప్పుడే ఫోన్‌చేశాడు. కానీ మాట్లాడలేదు"

"అహా! భలేకథలు చెప్తావే..." వెకిలిగా నవ్వాడతను.

అంతే వర్ధన్‌కి కోపంవచ్చింది. "ఏంటిసార్! మీరనేది, నేనెందుకు కథలు చెప్తాను"

"ఏమోలే... పోలీసులకి దొరికిపోకూడదని..."

"సర్... మీరు చెప్పేదేంటో"

"అర్థంకావటంలేదు అంటావు, అంతేగా. అవుతుంది... సెల్లో పడేసి బొక్కలిరగకొడితే అప్పుడు అంతా అర్థం అవుతుంది"

వర్ధన్ ఏదో అనబోతుంటే రాంభాయ్ అతన్ని ఆపుచేశాడు. "సర్! మీరు పెద్దోళ్ళు. పెద్ద పోస్టులో ఉన్నారు. మీరు ఇలా మాట్లాడొచ్చా" అన్నాడు.

"ఏరా! ఎవరితో ఎలా మాట్లాడాలో నీ దగ్గర నేర్చుకోమంటావా" రాంభాయ్ మీదకు వెళ్ళాడు ఇన్‌స్పెక్టర్.

అంతలో వర్ధన్ ఫోన్ రింగయింది.

వర్ధన్ మాట్లాడబోతుండగా ఇన్‌స్పెక్టర్ ఫోన్ లాక్కున్నాడు.

అవతల ఎవరు ఏం చెప్పారోగానీ ఫోన్ వర్ధన్ చేతికిచ్చాడు, "ఊ... మాట్లాడు" అన్నాడు.

"హలో" అన్నాడు వర్ధన్.

"బాబూ! నేను... శారదమ్మను మాట్లాడుతున్నాను" అన్నాడు. ఆవిడ కంఠం బాధతో ఒణుకుతోంది. ఎంతో కష్టంమీద ఏడుపును కంట్రోలు చేసుకుంటున్నట్లుగా ఉంది ఆవిడ స్వరం.

"అమ్మా! చెప్పండి... నేను వర్ధన్‌ని మాట్లాడుతున్నాను" అన్నాడు.

"బాబూ! మన విజేష్‌ని..." ఫోన్‌లోనే భోరుమంది శారదమ్మ.

వర్ధన్ మనసు ఏదో కీడుని శంకించింది.

"అమ్మా! చెప్పండి... అన్నకి ఏమైంది?"

ఆవిడ సమాధానం చెప్పకుండా వెక్కిళ్ళు పెట్టసాగారు.

వర్ధన్‌కి ఏం చేయాలో అర్థంకాలేదు.

"అమ్మా! దయచేసి బాధపడకండి... ముందు అన్నకేమైందో చెప్పండి" అర్థించాడు వర్ధన్.

"మన విజేష్‌తో స్నేహం చేసినట్టు

నటించి, మనల్నందర్నీ నమ్మించి చివరకు ఆ నీరవ్‌షా ఏం చేశాడో తెలుసా? "

"ఏం చేశాడు? "

"బాబుని కొట్టించాడట.. వాడిప్పుడు చావుబతుకుల్లో ఉన్నాడు" మళ్ళీ ఘొల్లు మంది ఆవిడ.

వర్ధన్ నిశ్చేష్టుడయ్యాడు

అతనికి నోటమాట రాలేదు.

నీరవ్‌షా అంత పని చేశాడా?

ఇంతకుముందు అన్న తనకు ఫోన్ చేసినప్పుడు ఈ విషయమేనా చెప్పాలనుకున్నది. అయితే విజేష్ ఇప్పుడెక్కడ ఉన్నాడు? అన్నీ ప్రశ్నలే.

"అమ్మా! అన్న ఇప్పుడు ఎక్కడున్నాడు? "

ఆవిడ ఆస్పత్రి పేరు చెప్పింది.

"మీరు వెంటనే బయలుదేరి అక్కడికి వచ్చేయండమ్మా, అన్నకేమీకాదు. మేమంతా ఉన్నాంకదా. మరేం దిగులుపడకండి" అని చెప్పి ఫోన్ ఆఫ్ చేశాడు.

"పదండి సర్! వెళ్ళి వెంటనే ఆ నీరవ్ షాను అరెస్ట్ చేయండి" కసిగాను, కోపంగానూ అన్నాడు వర్ధన్.

అంతే గోలీ సోడా కొట్టినట్టుగా నవ్వాడు ఇన్‌స్పెక్టర్. "బాగుందయ్యా! అతను కంప్లైంట్ ఇస్తేనే మీ అన్నను అరెస్ట్ చేయడానికి వచ్చాం. ఇక్కడేమో మీరు అతన్ని అరెస్ట్ చేయమంటున్నారే...!? "

"అన్న మీద కంప్లైంట్ ఇచ్చాడా? ఏం...? అన్నేం చేశాడని? " అడిగాడు రాంభాయ్.

అప్పుడు చెప్పాడు ఇన్‌స్పెక్టర్.

అంతా విని వర్ధన్, రాంభాయ్ విస్తుపోయారు.

"సర్! నిజంగా చెప్తున్నాను. అన్నకు ఆ ఆనంద్‌స్వరూప్ ఎవరో కూడా తెలీదు. అలాంటిది..."

"అది సరేనయ్యా! మీరు నిజం చెప్తున్నా నన్నా, ఒట్టేసినా మా డ్యూటీ మేం చెయ్యాలికదా. మాకు నోటిమాటకంటే ఆధారాలు ముఖ్యం... ఇంతకీ విజేష్ ఎక్కడ? "

"అన్నను ఆ నీరవ్‌షా తన మనుషుల్తో కొట్టించాడట. చావుబతుకుల్లో ఊగిసలాడుతూ ఆస్పత్రిలో పడున్నాడు..." చెప్పాడు వర్ధన్.

"ఏమిటయ్యా మీరు... అన్నింటికీ అంత తొందరైతే ఎలా? విజేష్‌మీద కంప్లైంట్ ఇచ్చాడుకదా! అంతలోనే ఈ విధంగా చెయ్యాలా! అయినా మీరూ మీరూ అలా చంపుకు చచ్చేటప్పుడు మా ప్రమేయం ఏం వుంది? అసలు మా దాకా రావడం ఎందుకు? అందర్నీ కలిసి సెల్లో పడేసి కాళ్ళూచేతులూ విరక్కొడితేకానీ మీకు బుద్ధి రాదు" చికాగ్గా అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"ఇంతకీ... ఏ హాస్పిటల్? "

వర్ధన్ పేరు చెప్పాడు.

"సరే పదండి" అన్నాడు ఇన్‌స్పెక్టరు.

వర్ధన్, రాంభాయ్‌లు కూడా అతనితో బయలుదేరారు.

★ ★ ★

నీరవ్‌షా విజేష్ ఆఫీసు దగ్గరకి వచ్చేసరికి అక్కడ ఎవరూలేరు. అటునుంచి అటే ఇంటికి వెళ్ళాడు. ఇంటికి తాళంవేసి ఉంది. 'అందరూ ఎక్కడికి వెళ్ళుంటారు? ' అనుకున్నాడు మనసులో.

విజేష్‌కోసం ఎక్కడ వెతకాలో షాకు అర్థంకాలేదు.

అంతలో అతని సెల్ రింగయ్యింది. ఆ నెంబరు ఎవరిదో షాకి అర్థంకాలేదు. అయినా సరే ఫోన్ అటెండయ్యాడు.

"హలో... నేను ఇన్‌స్పెక్టర్‌ని మాట్లాడుతున్నాను".

"చెప్పండి సర్. విజేష్ దొరికాడా? "

"అది సరేనయ్యా. మీరిద్దరికీ ఒకళ్ళమీద ఒకళ్ళకి ఇంత కక్షేమిటి? ఈమధ్యనేగా ఇద్దరూ అన్నీ మర్చిపోయి ఫ్రెండ్సయ్యారు. అంతలోనే ఏమొచ్చింది? చంపుతున్నారుకదయ్యా" చిరాకుపడ్డాడు ఇన్‌స్పెక్టరు.

"నేనేం చేశానండీ" కించిత్ ఆశ్చర్యపో





యాడు నీరవ్‌షా.

"అయ్యో! బాబూ, ఇప్పటికి చేసింది చాలు. ఇంకేం చేయకు. అయినా నువ్వు కంప్లైంట్ ఇచ్చావు. నేను కూడా యాక్షన్ తీసుకుంటానని చెప్పాను. అంతలో అంత తొందరైతే ఎలా? అయినా ఎంత కక్ష ఉంటే మాత్రం అంత దారుణంగా కొట్టిస్తావా ఆ మనిషి ఇప్పుడో, మరి కాసేపట్లోనో అన్నట్టు ఉన్నాడు. అతను కానీ హరీమన్నాడనుకో నీకు జీవిత ఖైదు తప్పదు"

"కొంచెం అర్థం అయ్యేలా చెప్తారా" అసహనంగా అన్నాడు షా.

"నేనేమైనా అమెరికన్, రష్యా భాషలు మాట్లాడానా అర్థంకాకపోవడానికి. సరే నీ ముచ్చట ఎందుకు కాదనాలి. అసలు విషయంలోకి వస్తాను. విజేష్‌ను ఎందుకు కొట్టించావు? "

"వాట్... నేనా? " అరిచినంత పనిచేశాడు నీరవ్‌షా.

"మరి నేనా... చాల్లేవయ్యా. జైల్లో ఖైదీల చేత నిజం చెప్పించేందుకు వారిని కొట్టి కొట్టి చేతులు నొప్పి పెట్టి ఛస్తుంటే ఆ విజేష్‌ని నేనెందుకు కొడతాను? అతనికీ నాకూ మధ్య ఏవైనా గొడవలుంటేకదా"

"కానీ... కానీ... నేనా పని చెయ్యలేదు"

"సరే... చెయ్యలేదనుకుందాం. మరింక భయమెందుకు. వెంటనే బయలుదేరి ఆస్పత్రికి రామ్మా... నేనక్కడే నీకోసం ఎదురు చూస్తుంటాను" అన్నాడు ఇన్‌స్పెక్టరు.

"ఇప్పుడే బయలుదేరి వస్తున్నాను. హాస్పిటల్ ఎక్కడో చెప్పండి" అన్నాడు షా.

ఇన్‌స్పెక్టరు ఆస్పత్రి పేరు తదితర వివరాలు చెప్పాడు.

సరిగ్గా అరగంట తర్వాత షా ఆస్పత్రిలోకి ఎంటరయ్యాడు. అతన్ని చూడగానే వర్ధన్, రాంభాయ్ ముఖం తిప్పుకున్నారు.

శారదమ్మగారు మాత్రం తన ఆవేశాన్ని కంట్రోలు చేసుకోలేకపోయారు. అందరి ముందూ షా షర్ట్ కాలర్ పట్టుకున్నారు. "నీ కళ్ళు ఇప్పుడు చల్లబడ్డాయా? నా కొడుకుతో వ్యాపారంలో పోటీపడలేక ఇలా దొంగతనంగా దెబ్బతీస్తావా? నువ్వు ఇంత నీచుడవని తెలియక వాడు మన గొడవలన్నీ మర్చిపోయి స్నేహితులుగా ఉందాం అన్నాడు. వాడితో మంచిగా మాట్లాడుతూనే మరో పక్కన వాడిని నాశనం చేసేందుకు ప్రయత్నించావు"

"అమ్మా! మీరు పొరబడుతున్నారు. దయచేసి..."

"వినను... ఇక నువ్వేం చెప్పినా నేను వినను" అని ఇన్‌స్పెక్టర్‌వైపు తిరిగి, "ఈ దుర్మార్గుడ్ని అరెస్ట్ చేయండి. వీడు... వీడు నా కొడుకుని చంపేశాడు" భోరుమన్నారావిడ.

"అమ్మా! ప్లీజ్... నేను చెప్పేది వినండి. విజేష్‌తో నాకెప్పుడూ ఎలాంటి శత్రుత్వమూ లేదు. అతడ్ని చంపాలని నేనెప్పుడూ అనుకోలేదు"

శారదమ్మగారు అతనివైపు ఈసడింపుగా చూసి ముఖం తిప్పుకున్నారు.

అందరూ తననలా దోషిగా చూడడం షా భరించలేకపోతున్నాడు. అయినా తను విజేష్‌ను కొట్టించడవేమిటి? అదే చేయాలనుకుంటే ఎప్పుడో ఆ పని చేసేవాడు. అతన్నేం చేయాలన్నా ఏదో తెలీని అనుబంధం అడ్డు వచ్చేది. అందుకే ఇన్నాళ్ళుగా అతన్ని క్షమిస్తూనే వచ్చాడు. ఇప్పుడు విజేష్‌తో తనకు ఎలాంటి గొడవలు లేవు. అయినా కూడా మనసులో ద్వేషం నింపుకుని పైకి స్నేహం నటిస్తూ స్మృతి కూలిపోవడానికి కారణం అయ్యాడు.

అంతలో ఐ.సి.యులోంచి డాక్టరు వచ్చాడు.

ఆయన్ని చూడగానే గభాల్న లేచి నుంచున్నారు శారదమ్మ. "డాక్టర్‌గారూ! నా బిడ్డకు ఎలా వుంది? ప్రమాదమేమీలేదుకదా!"

"కొంచెం ఓర్పుగా ఉండండమ్మా! మీ అబ్బాయిని కాపాడేందుకు మేము మా

శాయశక్తులా ప్రయత్నం చేస్తాం. ఆపైన ఆ భగవంతుడి దయ" అని రాఘవయ్యగారితో చెప్పాడు.

"సర్! రక్తం బాగా పోయింది. వెంటనే రక్తం ఎక్కించాలి. మీ అబ్బాయిది ఓ నెగిటివ్. ఆ గ్రూపువాళ్ళు ఎవరైనా ఉంటే రక్తం ఇవ్వండి... లేదా ఏదైనా బ్లడ్ బ్యాంక్ నుంచి కొనుక్కువచ్చినా సరే... బట్ ఏదైనా ఫాస్ట్‌గా చెయ్యండి. మనకు ఎక్కువ టైంలేదు" అని చెప్పి అక్కడ్నుంచి వెళ్ళిపోయాడు.

ఆ పరిస్థితిని చూస్తున్న నీరవ్‌షా మనసు ఎందుకో ద్రవించింది. కొడుకు చావుబతుకుల మధ్య కొట్టుమిట్టాడుతుంటే ఆ తల్లి పడే ఆవేదన షా మనసును ద్రవింపచేసింది. పైగా విజేష్ బతకాలి. అతన్ని నన్నెందుకు మోసం చేశావని తను నిలదీయాలి. జీవితాంతం తనను షా బతికించాడు అని విజేష్ కుళ్ళిపోవాలి. ఎస్. మనిషి మృత్యువు అంచుమీదనైనా మారాలి. ఆ మార్పుకు తన రక్తం కారణమైతే తను అందుకు సిద్ధంగా ఉన్నాడు.

"సిస్టర్! ఒక్కనిమిషం" అన్నాడు షా.

"చెప్పండి"

"నేను... నేను బ్లడ్ ఇస్తాను. నాదీ 'ఓ' నెగిటివే" అన్నాడు షా.

అందరూ షాకయినట్టుగా నిలబడిపోయారు.

వారి ఫీలింగ్స్‌తో సంబంధం లేకుండా సిస్టర్ వెంట నడిచాడు షా. ఇన్‌స్పెక్టర్‌కయితే జుట్టు పీక్కోవాలన్పించింది.

★ ★ ★

షా బ్లడ్ గ్రూప్‌ని పరీక్ష చేశారు.

విజేష్ గ్రూప్‌తో మ్యాచ్ అయ్యింది.

షా శరీరంలోంచి ఒక్కో రక్తం చుక్క విజేష్ బాడీలోకి ఎక్కుతుంటే ఎక్కడో కొట్టుమిట్టాడుతున్న ప్రాణం తిరిగి చైతన్యం అవుతున్న ఫీలింగ్. ఇక నీరవ్‌షా మదిలో ఎన్నో భావాలు... వీటన్నింటికీ రూపం ఇవ్వడం చాలా కష్టమైన పని.

రక్తం ఇచ్చి వెలుపలికి వచ్చాడు నీరవ్‌షా. అతనికెందుకో బాగా నీరసంగా అన్పించింది. అంతలో చందూనుంచి ఫోన్ వచ్చింది. "అన్నా! ఆస్పత్రినుంచి మాట్లాడుతున్నాను"

"చెప్పరా... ఆనంద్ ఎలా ఉన్నాడు?"

"బాడ్ న్యూసన్నా!"

"ఏంట్రా... ఏమైంది?"

"ఆనంద్ చనిపోయాడన్నా"

"ఓ గాడ్" నిట్టూర్చాడు షా. అంతలోనే తేరుకుని,

"నువ్వు అక్కడే ఉండు. నేను ఇప్పుడే వస్తున్నాను" అని సెల్ ఆఫ్ చేశాడు.

ఇన్‌స్పెక్టర్ దగ్గరకు వచ్చాడు.

"సర్! ఆనంద్ చనిపోయాడట" షా గొంతులో బాధ తొంగిచూసింది.

"ఓహ్! షిట్..." అనుకున్నాడు ఇన్‌స్పెక్టరు. అంతలోనే అతనికి తన బాధ్యత గుర్తుకువచ్చింది.

"పదండి వెడదాం" అని రాఘవయ్యగారి దగ్గరకు వచ్చాడు.

"సర్! మీరు స్టేషన్‌కి వచ్చి రిపోర్ట్ ఇవ్వండి" అన్నాడు.

"అవసరం లేదు బాబూ! మా అబ్బాయి బతికితేచాలు. ఎవరి పాపాన వాళ్ళు పోతారు" అన్నాడాయన.

నీరవ్‌షా రాఘవయ్యగారి చేతులు పట్టుకున్నాడు. "నేను నిజంగా చెప్తున్నాను. నేను నా ప్రాణంగా భావించే నా తల్లిమీద ప్రమాణంచేసి చెప్తున్నాను. విజేష్‌ని నేను కొట్టించలేదు. ఇప్పుడేకాదు ఎప్పుడూ కూడా అతన్ని చంపాలని నేను అనుకోలేదు. కానీ విజేష్ ఏం చేశాడో తెలుసా? నాతో ఒక పక్కన స్నేహం నటిస్తూనే మరోపక్క నన్ను నాశనం చేయడానికి ప్రయత్నించాడు. మా ఇంజనీరుని భయపెట్టి స్మృతి అపార్ట్‌మెంట్స్ కట్టగానే కూలిపోయేలా ప్లాన్ చేశాడు. మా ఇంజనీరు ఆ క్షోభ




తట్టుకోలేక ఇటు కుటుంబాన్ని పోగొట్టుకో లేక, అటు తన వృత్తికి అన్యాయం చేయ లేక పురుగులమందు తాగి చనిపోయాడు. అతని కుటుంబం ఇప్పుడు వీధినపడింది"

"నో... అన్నకి ఆ ఆనంద్‌స్వరూప్ ఎవరో కూడా తెలీదు" అరిచాడు వర్ధన్.

అప్పుడే అటుగా వచ్చిన సిస్టర్ చిరాకుప డింది "ఏంటండీ... కొంచెం డీసెంట్‌గా బిహేవ్ చేయడం మీకు తెలీదా? ఇది హాస్పిటల్. ఉంటే నిశ్శబ్దంగా ఉండండి. లేదా బయటకు వెళ్ళిపోండి. అంతేకానీ ఇక్కడమాత్రం గొడవలు పడద్దు"

షా మాటలకు శారదమ్మ, రాఘవయ్య గార్లు నిర్ఘాంతపోయారు.

శారదమ్మగారైతే మరీను.

నిజంగానే తన కొడుకు ఇంత దుర్మా ర్గుడా!

షాతో స్నేహంగానే ఉంటున్నట్టు నటించి అతనిని సర్వనాశనం చేయాలని ప్రయత్నిం చాడా?

తాను మారానని చెప్పడం అబద్ధమా!

ఆఖరకు తల్లిని కూడా నమ్మించి మోసం చేశాడా?

శారదమ్మగారు ఉన్నచోటునే కుప్పకూలి పోయారు. ఆవిడను కూడా అదే ఆస్పత్రిలో చేర్చాల్సివచ్చింది.

నీరవ్‌షా ఇన్‌స్పెక్టర్‌తో కలిసి బయటకు నడిచాడు.

★ ★ ★

ఆనంద్‌స్వరూప్ బాడీని పోస్ట్‌మార్టం చేశారు.

ఎక్కువ మోతాదులో పురుగులమందు పుచ్చుకోవడం మూలంగా ఆనంద్ చనిపో యాడని తేల్చారు.

ఇది పూర్తిగా ఆత్మహత్యేనని, అతనిని ఎవ్వరూ హత్య చేయలేదని రిపోర్ట్ వచ్చింది.

ఆ తర్వాత అతని బాడీని ఆనంద్ కుటుంబానికి అప్పగించారు. ఆనంద్‌స్వ రూప్ బంధువులకు కబురువెళ్ళింది. వాళ్ళు వచ్చి, శవాన్ని తీసుకెళ్ళేవరకూ షా, చందు, దేశాయ్, బిక్కు అంతా అక్కడే వున్నారు.

కార్యక్రమాలన్నీ పూర్తయ్యాక ఆనంద్ భార్యతో 'వారి కుటుంబావసరాలు తాను తీరుస్తానని' చెప్పాడు షా. 'కూతురి పెళ్ళి, కొడుకు చదువు బాధ్యత కూడా తనదే'నని చెప్పాడు.

కూతుర్ని, కొడుకుని విడిగా పిలిచి తల్లిని జాగ్రత్తగా చూసుకోమని, ఎవరిమీదైనా అనుమానం వస్తే వెంటనే తనను కాంటాక్ట్ చేయమని చెప్పాడు.

అప్పుడు చెప్పారు వాళ్ళు 'చంటి' గురించి.

చంటి గురించి అతని రూపం, స్వభావం గురించి వాళ్ళు చెప్తుంటే నీరవ్‌షాలో ఏదో అనుమానం చోటు చేసుకుంది. వెంటనే వర్ధన్‌కు ఫోన్ చేశాడు. వర్ధన్ కూడా అదే మాట చెప్పాడు.

"అన్నా! నిజంగా విజేషన్నకు ఆ ఆనంద్ స్వరూప్ ఎవరో కూడా తెలీదు. ఇదంతా ఎవరో కావాలని ఆడుతున్న నాటకం. అటు విజేషన్నని ఆ విధంగా ఇరికించారు. ఇటు అన్నని కొట్టిపడేసి ఆ పని నువ్వే చేయించా వని నీ పేరుచెప్తూ నిన్ను ఇరికించారు. ఆనంద్ చనిపోవడంతో విజేషన్న ఇరుక్కు పోయాడు. రేప్పొద్దున్న... అలా జరగదు. బట్ ఒకవేళ నిజంగా విజేషన్నకు ఏదైనా అయితే నువ్వీ కేసులోంచి బయటపడడం జరగదు. శారదమ్మగారు, రాఘవయ్యగారు కంప్లైంట్ ఇవ్వమని చెప్పినా వాళ్ళ అమ్మాయి ఊరుకోదు. సుశీలకి తండ్రి అంటే చాలా ఇష్టం. ఆ అమ్మాయి నీమీద తప్పకుండా కంప్లైంట్ ఇస్తుంది. అందుకే ఏదో ఒకటి చెయ్యాలన్నా. ఈ కేసుల్లో మీ ఇద్దరి ప్రమేయంలేదని, మిమ్మల్ని ఎవరో ఇరికించారని మనం ప్రూవ్ చెయ్యాలి. అందుకోసం నేను ఎంత కష్టాన్నైనా ఫేస్ చేస్తాను" ఉద్వేగంతో చెప్పాడు వర్ధన్.

"అయితే మనం వెంటనే ఓ పని చెయ్యాలి"

"చెప్పన్నా! విజేషన్నకు, ఆనంద్‌స్వరూప్ ఆత్మహత్యకు సంబంధం లేదని ప్రూవ్ చేయడానికి నేనేం చెయ్యడానికైనా సిద్ధమే" అన్నాడు వర్ధన్.

అతని స్వామిభక్తికి నీరవ్‌షా ఎంతో ఆనందపడ్డాడు.

"విజేష్ ఏం చేసినా మీకు చెప్తాడుకదూ!"

"చెప్తాడన్నా. అసలు అన్న మాకు చెప్ప కుండా ఏ పనీ చెయ్యడు. ఆయన మొదటి సారి మాకు చెప్పకుండా చేసింది ఒక్కటే నన్నా"

"ఏంటది? " ఆత్రుతగా అడిగాడు షా.

"నీకు ఫోన్ చేసి మనం మన గొడవలు మర్చిపోదాం అని చెప్పడం"

ఆ మాట విన్నాక షా ఎందుకోగానీ రిలీ ఫ్‌గా ఫీలయ్యాడు.

"అది సరే! విజేష్ అప్పాయింట్‌మెంట్స్ ఎవరు చూస్తారు? " అని, "ఎందుకు అడు గుతున్నానంటే స్మృతి మొదటి టవర్ ఫస్ట్ ఫ్లోర్‌కు శ్లాబ్ వేద్దామనుకున్న ముందురోజు విజేష్ తనను కలిసి బెదిరించాడని ఆనంద్ స్వరూప్ తను రాసిన లెటర్లో రాశాడు. ఆరోజు పొద్దున్నించీ సాయంత్రంవరకూ విజేష్ ఎక్కడెక్కడికి వెళ్ళాడో మనకు తెలి యాలి" వివరంగా చెప్పాడు షా.

"తప్పకుండా అన్నా! ఆ రోజంతా అన్నతో వాళ్ళ అల్లుడు కూడా ఉన్నాడు. అతన్ని అడిగితే మనకు తెలిసిపోతుంది" అన్నాడు వర్ధన్.

అన్నట్టుగానే షా, వర్ధన్ కలిసి అహ్మద్ ఇంటికి వెళ్ళారు.

అహ్మద్‌కు ఈ విషయాలేమీ తెలీవు.

అతను మామూలుగానే కాలేజీకి బయలు దేరుతున్నాడు. అతని ఇంట్లో ఫోన్ లేకపోవడంవలన సుశీల అతనికి సమా చారం అందించలేకపోయింది. జరిగింది విని అతను చాలా బాధపడ్డాడు. తన మావయ్యగారు అలాంటి వారుకాదని చెప్పాడు.

"అహ్మద్! నువ్వు నిన్నకాక మొన్న వచ్చావు. ఈ విషయం నీకే ఇంత బాధ కల్గిస్తుంటే మరి మా పరిస్థితి ఏమిటి? అన్న నిర్దోషి అని నమ్మే షా అన్న మనకు సహాయపడ్తున్నాడు. మనం ఎంతమంది నమ్మినా ఉపయోగంలేదు. బలమైన ఆధా రాలుకావాలి" ఓదార్పుగా అన్నాడు వర్ధన్.

"చెప్పండి. నన్నేం చేయమంటారో? మావయ్యగారిని కాపాడడంకోసం నేనేం చేయడానికైనా సిద్ధమే" చాలా ఎమోషనల్ అయ్యాడు అహ్మద్.

"ఏం లేదు ఆరోజు" అంటూ వివరంగా చెప్పి అన్నాడు వర్ధన్. "ఆరోజు అంతా అన్నతోపాటు నువ్వున్నావు. మీరు ఎక్కడె క్కడికి వెళ్ళారో వివరంగా చెప్పగలవా? "

"చెప్తాను" అని ఒకసారి బలంగా ఊపిరి తీసుకున్నాడు.

ఉదయం 9 గంటలకు: మామయ్యగారు మా ఇంటికి వచ్చారు. సుశీలతో నా పెళ్ళి గురించి అమ్మతో మాట్లాడారు.

ఉదయం 10 గంటలకు: మేం మా ఇంట్లోంచి బయలుదేరాం.

10.30 గం: అమ్మవారి గుడికి వెళ్ళాం. లోపలికి రావడం అభ్యంతరం అయితే నన్ను కారులోనే కూర్చోమన్నారు. అమ్మవా రిని దర్శించుకోవడానికి అభ్యంతరం ఏముంటుందని నేను కూడా మావయ్యగా రితో కలిసి లోపలికి వెళ్ళాను.

11 గంటలకు: గుడిపక్కన ఉన్న రెస్టా రెంట్లో ఇద్దరం టిఫిన్‌చేసి కాఫీ తాగాం.

11.30 గంటలకు: చైతన్య మెహతాను కలిసి మాట్లాడాం. అతను ఇంజనీరు. మావయ్యగారి నెక్ట్స్ ప్రాజెక్ట్ ఆయనకు అప్పగించాలని అనుకున్నారు.

12.30 గం.: ఆఫీసుకి వచ్చాం.

మధ్యాహ్నం ఒంటిగంటవరకూ: సమా చారం మొత్తం కంప్యూటర్లో ఫీడ్‌చేశాం.




1 గం. నుంచి 1.30 వరకు: ఏదో పిచ్చా పాటీ మాట్లాడుకున్నాం.

1.30 కు: వర్ధన్ ఫోన్ చేసి రాంభాయ్, తను సైట్ దగ్గర ఉన్నామని, భోజనం చెయ్యమని చెప్పాడు.

1.35 కు: లంచ్‌కు వెళ్ళాం.

2.30 కు: ఆఫీసుకి వచ్చాం. కేతన్ దూబే అనే ఇంజనీరు మావయ్యగారితో మాట్లాడ డానికి వచ్చాడు.

మధ్యాహ్నం 3.30కు: వర్ధన్, రాంభాయ్ వచ్చారు.

సాయంత్రం 4 గం. లకు: మావయ్యగారికి ఫోన్ వచ్చింది.

4 గంటల 10 ని. కు: ఇద్దరం బయటకు వెళ్ళాం.

4.30లకు: రెస్టారెంట్‌కు వెళ్ళాం. నన్ను అక్కడే కూర్చోమని పది నిమిషాల్లో చిన్న పనుంది, చూసుకుని వచ్చేస్తానని మావయ్య గారు వెళ్ళారు.

సాయంత్రం 5 గం. లకు: మావయ్యగారు వచ్చారు. ఇద్దరం కాఫీ తాగాం.

5.15 ని. కు: ఖాన్‌ను కలవడానికి వెళ్ళాం. ఆయన నేను, సుశీల త్వరలో ఆరంభించబోతున్న హ్యాండీక్రాఫ్ట్స్, బట్టలషా పుకు ఫైనాన్స్ చేస్తున్నారు. షాపు కూడా ఆయనే అరేంజ్ చేస్తున్నారు.

6.30 ని. కు: ఖాన్ ఆఫీస్‌నుంచి బయ టకు వచ్చాం. తిరిగి ఆఫీసుకి వచ్చేశాం.

దాదాపు రాత్రి 8 గం॥వరకూ ఆఫీసులో ఉన్నాం.

ఆరోజు జరిగిందంతా టైంతో సహా వివ రంగా చెప్పాడు అహ్మద్. షా ఆశ్చర్యపో యాడు. అతని ఆశ్చర్యం గమనించి అన్నాడు అహ్మద్. "ఆరోజే కాదండీ గత ఏడేళ్ళుగా ఏరోజు ఎన్నిగంటలకు నేను ఏంపని చేశానో అంత వివరంగా చెప్పగ లను..."

"గుడ్... నీ జ్ఞాపకశక్తి నిజంగా అమోఘం..."

వర్ధన్ మాటలకు అహ్మద్ నవ్వేశాడు.

"అది జ్ఞాపకశక్తి కాదు..."

"మరి..."

"నాకు గత పదేళ్ళుగా డైరీ రాసే అలవా టుంది..."

డైరీ అనగానే వర్ధన్ మైండ్‌లో ఆలోచన తళుక్కుమంది. "ఎస్! విజేష్ అన్నకు కూడా డైరీ రాసే అలవాటుంది. ఆ డైరీకానీ దొరి కితే బహుశ మన ప్రాబ్లం సాల్వ్ అయిపో తుంది"

ఆ విషయానికి షా పెద్దగా ప్రాముఖ్యం ఇవ్వలేదు. ఇలాంటి విషయాలు ఎవ్వరూ డైరీలో రాసుకోరని అతనికి తెలుసు.

"అదిసరే అహ్మద్! నువ్వు చెప్పినదంతా బానే ఉంది. కానీ మధ్యలో సాయంత్రం 4-30 నుంచి 5 గంటలవరకు మీ మావ గారు ఎక్కడికెళ్ళారు. అదేమైనా నీకు చెప్పారా?"

"లేదండీ!"

"నువ్వు అడగలేదా?"

"ఊహు... నాకు చెప్పాల్సినదైతే ఆయనే చెప్తారుకదా అని నేనూ అడగలేదు"

"ఓకే వదిలెయ్... కానీ నిన్ను ఓ రెస్టా రెంట్లో కూర్చోబెట్టి వెళ్ళారన్నావుకదూ!"

అవునన్నట్టు తలాడించాడు అహ్మద్.

"దాని పేరేమిటో చెప్పగలవా?"

ఆ రెస్టారెంట్ పేరేమిటో చెప్పాడు అహ్మద్.

ఆ పేరు వినగానే షా ఉలిక్కిపడ్డాడు.

"నువ్వు... నువ్వు చెప్పేది నిజమేనా? మరోసారి గుర్తు చేసుకో..." అన్నాడు షా.

"లేదండీ! నాకు బాగా గుర్తుంది..."

"ఏమైందన్నా!"

"వర్ధన్! మీ అన్న తన అల్లుడితో కలిసి ఏ రెస్టారెంటుకి వెళ్ళాడో తెలుసా?"

"అదే... అహ్మద్ ఇప్పుడు చెప్పాడుగా!" ఆ విషయానికి షా ఎందుకంత ప్రాధాన్యత నిస్తున్నాడో వర్ధన్‌కు అర్థం కాలేదు.

"ఆ రెస్టారెంటు ఎక్కడుందో తెలుసా?"

"తెలుసు. అయితే " తేలిగ్గా అన్నాడు వర్ధన్.

"ఆ పక్కనే ఆనంద్ స్వరూప్ ఇల్లుంది..."

వర్ధన్‌కు, అహ్మద్‌కు నోటమాట రాలేదు.

ఇద్దరిలోకి ముందుగా తేరుకుంది అహ్మద్.

"కానీ! ఆరోజు మేము ఖాన్‌గారిని కలిశాం. ఆయన్ని కలవడానికే అటు వెళ్ళాల్సివచ్చింది"

షాకు ఎందుకో నమ్మబుద్ధి కాలేదు. అహ్మద్ చెప్పేది నిజమేకావచ్చు కానీ ఆ అరగంట విజేష్ ఎక్కడికి వెళ్ళాడు? తాను ఎక్కడికి వెడుతున్నది అహ్మద్‌కు కూడా ఎందుకు చెప్పలేదు!

మొదటిసారి వర్ధన్‌లో కూడా అనుమానం చోటుచేసుకుంది. అన్న తమకి చెప్పకుండా నిజంగానే...

షా వెంటనే ఇన్‌స్పెక్టర్‌కి సమాచారం అందించాడు.

అతను అహ్మద్‌మీద ప్రశ్నలవర్షం కురిపించాడు. షాకు చెప్పిన జవాబే అతనికి కూడా చెప్పాడు. సాయంత్రం నాలుగు గంటల ముప్పైనిమిషాలనుంచి అయిదు గంటల మధ్య విజేష్ ఎక్కడికి వెళ్ళిందీ తనకు తెలియదని చెప్పాడు.

ఆ అర్థగంటలో ఖచ్చితంగా విజేష్ ఆనంద్ ఇంటికి వెళ్ళుంటాడని ఇన్‌స్పెక్టర్ కూడా అభిప్రాయపడ్డాడు. వెంటనే ఆనంద్ స్వరూప్ ఇంటికి ఫోన్ చేశాడు. విషయం చెప్పి ఎవరైనా వచ్చారా అని అడిగాడు. ఆయన ఆ సమయంలో భోజనానికి వచ్చారు. వెంట ఎవరో ఉన్నారు. ఎవరని అడిగితే విజేష్ అని చెప్పారు' అని చెప్పింది ఆనంద్ స్వరూప్ భార్య.

"సో! ఆనంద్‌ని బెదిరించి అతను ఆత్మహత్య చేసుకునేలా ప్రేరేపించింది, మీరు కట్టిన నిర్మాణం కూలిపోవడానికి కూడా కారణం విజేష్... అతను కోలుకోగానే అరెస్ట్ చేస్తాం..." అన్నాడు ఇన్‌స్పెక్టర్.

ఆ విషయం చెప్పకుండా ఉంటే బాగుండేది అనిపించింది అహ్మద్‌కు.

షా ఏదో సహాయపడతాడని నమ్మి నేనే కదా అన్నని కేసులో ఇరికించాను అని బాధపడ్డాడు వర్ధన్.

ప్రస్తుతం విజేష్ ఎప్పటికి కోలుకుంటాడన్నది సమస్య!



ఈ కేసు మాత్రం చాలా సంచలనమయ్యింది.

నీరవ్‌షా, విజేష్‌ల గురించి వారి ఎత్తులు, పైఎత్తులు, చివరకు గొడవలన్నీ మర్చిపోయి బంధువులు కావాలని అనుకోవడం అంతలోనే విజేష్ చేసిన మోసం అన్నింటి గురించి పత్రికలో వార్తలు వచ్చేశాయి.

శారదమ్మగారిని ఇంటికి తీసుకువచ్చారు. కొడుకు కళ్ళు తెరిచి అమ్మా అనేదాకా తను ఆస్పత్రి విడిచి వచ్చేదిలేదని ఆవిడ భీష్మించుకుని కూర్చున్నారు. ఆవిడకు ఎంతగానో నచ్చచెప్పాల్సి వచ్చింది.

అహ్మద్ సుశీలతో అసలు విషయం చెప్పాడు. మొదట సుశీల బాధపడినా అందులో అతని తప్పేంలేదని అర్థం చేసు





కుంది.

శారదమ్మగారు ఇంటికి వచ్చారేగాని ఆవిడ మనసు నిలవడంలేదు. చాలారోజుల తర్వాత పెట్టె తీస్తే విజేష్ చిన్నప్పుడు మెడలో వేసుకున్నా లాకెట్ కనిపించింది. బహుశా అందులో ఏదో మహత్తు ఉందని అందుకే కుటుంబం అంతా చనిపోయినా భూకంపం సమయంలో రాళ్ళు వచ్చి మీద పడినా విజేష్ బతికాడని ఆవిడ తరచూ అంటుండేది. అందుకే దానిని మాత్రం మెడలోంచి తీసేది కాదు. విజేష్ పెద్ద య్యాక నీదంతా పిచ్చినమ్మకమమ్మా! అని మెడలోంచి లాకెట్ తీసిపారేశాడు. ఆవి డకు దీనిని పారేయబుద్ధికాక అలాగే దాచి ఉంచింది. చివరకు ఇన్నాళ్ళికి మళ్ళీ దానితో ఆవిడకి అవసరం వచ్చింది. "ఒకవేళ ఈ తాడు కడితే నా కొడుకుకు వచ్చిన ఆపద తొలగిపోతుందేమో" అంతే ఆ ఆలోచన రావడం మరుక్షణం సుశీలని ఆస్పత్రికి వెడ దామంటూ తొందరపెట్టింది.

సుశీల, శారదమ్మ ఆస్పత్రికి వచ్చారు.

డాక్టరు అనుమతి తీసుకుని శారదమ్మ గారు ఐ.సి.యు.లోకి వెళ్లారు. కొడుకు మెడలో లాకెట్ ఉన్న గొలుసు వేశారు. ఎప్పుడో చిన్నప్పటి తాడు ఇప్పుడేం సరిపో తుంది? అందుకే ఆ లాకెట్‌ను గొలుసులో వేసి అది అతని మెడలో వేశారు.

ఇప్పుడు ఆవిడ మనసు ప్రశాంతంగా ఉంది. కొడుకు బతుకుతాడన్న ధైర్యం వచ్చింది.

ఒక్కోసారి మందులకన్నా నమ్మకమే మనిషికి ధైర్యాన్నిస్తుంది. అందులోనూ శార దమ్మగారికి దైవభక్తి ఎక్కువ కూడానూ.

★ ★ ★

దాదాపు పదిరోజులు గడిచాయి.

విజేష్ ఇప్పుడిప్పుడే కోలుకుంటున్నాడు.

వర్ధన్ జరిగిందంతా చెప్పాడు.

విజేష్ దిగ్భ్రాంతి చెందాడు. తను ఆనంద్ స్వరూప్ ఆత్మహత్య చేసుకునేం దుకు పురికొల్పాడా? ఆ వ్యక్తి ఎవరో కూడా తనకు తెలీదు.

వాళ్ళిద్దరూ మాట్లాడుకుంటూ ఉండగా ఇన్‌స్పెక్టరు వచ్చాడు.

డాక్టర్లు మాత్రం అతనింకా కోలుకోలేదని ఈ పరిస్థితిలో తమ పేషెంటుని అరెస్ట్ చేయడానికి తాము ఒప్పుకోమని చెప్తు న్నారు.

మరోపక్క రాఘవయ్యగారు ముందస్తు బెయిల్ కోసం ప్రయత్నిస్తున్నారు.

"ఎలా వున్నారు?" అంటూ వచ్చాడు ఇన్స్‌పెక్టరు.

"ఫర్వాలేదు..." లేచి కూర్చోబోయాడు.

"ఇట్సాల్‌రైట్.. మీరు రెస్ట్ తీసుకోండి" అంటూ అక్కడున్న స్టూలుమీద కూర్చు న్నాడు ఇన్‌స్పెక్టర్.

"చెప్పండి విజేష్! పదేపదే వచ్చి మిమ్మల్ని ఇబ్బంది పెట్టడం మాకూ ఇష్టం లేదు. మీరు నిజంచెప్తే మీకు శిక్ష తగ్గే అవ కాశం ఉంది"

"అంటే నేను చెయ్యనిది చేశానని ఒప్పుకో మంటారా?" ఇరిటేట్ అయ్యాడు విజేష్.

"ఓకే... ఓకే... ఆరోజు... బహుశా గురువారం అనుకుంటాను. ఆరోజు మీరు, మీకు కాబోయే అల్లుడు కలిసి బయటకు వెళ్లారని చెప్పాడు. ఆ రోజంతా మీరిద్దరూ కలిసే ఉన్నారని మధ్యలో సాయంత్రం నాలుగు గంటల ముప్పైనిమిషాలనుంచి అయిదు గంటల మధ్య ఓ అరగంటసేపు అహ్మద్‌ను రెస్టారెంట్లో కూర్చోబెట్టి మీరు బయటకు వెళ్ళారని అతను చెప్తున్నాడు. ఆ టైంలో మీరు ఎక్కడికి వెళ్ళారో చెప్పగ లరా?" సూటిగా అడిగాడు ఇన్‌స్పెక్టరు.

ఆ ప్రశ్నకు అహ్మద్‌వైపు ఇబ్బందిగా చూశాడు విజేష్.

"చెప్పండి మిస్టర్ విజేష్"

విజేష్ సమాధానం చెప్పకుండా మౌనం వహించాడు.

"మీరు చెప్పలేరు! ఆ సమయంలో అహ్మా

ద్‌ను రెస్టారెంట్లో కూర్చోబెట్టి మీరు మాత్రం ఆనంద్ స్వరూప్ ఇంటికి వెళ్ళారు. అతనిని బెదిరించారు. మీరు చెప్పినట్టుగానే శ్లాబ్ విషయంలో అవకతవకలు చేశాడు. తను ఆ ఆవేదనను తట్టుకోలేకపోయాడు. ఎప్పుడైతే వేసిన శ్లాబ్ కూలిపోయిందో తను చేసిన వృత్తిద్రోహానికి శిక్షగా ఆత్మ హత్య చేసుకున్నాడు"

"నో... మీరు... మీరు అనవసరంగా నామీద నింద వేస్తున్నారు. నేను చెయ్యని తప్పుకి నన్ను శిక్షించాలనుకుంటున్నారు"

"అయితే ఆరోజు... ఆ టైంలో ఎక్కడికి వెళ్ళారో చెప్పండి"

"ఆ ప్రశ్న తలెత్తినప్పుడల్లా విజేష్ అహ్మద్ వంక చూసి ఇబ్బంది పడుతు న్నాడు తప్ప సమాధానం మాత్రం చెప్పడం లేదు.

"ఓ. కే. మీరిలాగే మొండికేస్తే మా డ్యూటీ మేము చెయ్యాల్సివస్తుంది" అంటూ వెళ్ళడానికి లేచాడు ఇన్‌స్పెక్టరు.

విజేష్ మౌనం వహించాడు.

ఆ తర్వాత వర్ధన్, అహ్మద్ ఎంత చెప్పినా ఆ సమయంలో తను ఎక్కడికి వెళ్ళిందో చెప్పలేదతను.

అక్కడే వుంది. కేసు తాలుకు కీలక మంతా.

★ ★ ★

మరో నాలుగు రోజుల తర్వాత విజేష్‌ను అరెస్ట్ చేశారు.

అంతకుముందే శారదమ్మ, రాఘవయ్యలు వెళ్ళి నీరవ్‌షాను కేసు విత్‌డ్రా చేసుకోమని అడిగారు. తాను ఒప్పుకున్నా ఆనంద్ స్వరూప్ భార్య ఒప్పుకోవడంలేదని షా చెప్పాడు. వాళ్ళిద్దరూ ఆనంద్ ఇంటికి వెళ్ళారు. ఎంతగా నచ్చచెప్పినా, డబ్బాశ చూపినా కూడా ఆవిడ ఒప్పుకోలేదు. విజేష్‌కు శిక్ష పడితీరాలన్న పట్టుదలలో ఉంది ఆవిడ. దాంతో విజేష్ అరెస్ట్ కాకుండా ఉండేందుకు చేసిన ఏ ప్రయత్నమూ ఫలించలేదు.

చంటి ఎవరనేది పోలీసులు ట్రేస్ చేయ లేకపోయారు.

విజేష్ అరెస్ట్ అయ్యాడన్న వార్త ప్రముఖ పత్రికలన్నింటిలోను వచ్చింది. అతన్ని ఎన్ని రకాలుగా అడిగినా ఆ అర్ధగంటా అతను ఎక్కడికి వెళ్ళాడన్న సంగతి మాత్రం చెప్ప డంలేదు.

అయితే ఆనంద్‌స్వరూప్ భార్య చేసిన ఫోను కేసును మరో మలుపు తిప్పింది. పేపర్లో విజేష్ ఫొటో చూడగానే ఆవిడ ఇన్ స్పెక్టరుకి ఫోన్‌చేసింది.

"ఇన్‌స్పెక్టరుగారూ! నేను ఆనంద్‌స్వరూప్ భార్యని మాట్లాడుతున్నాను" అంది ఆవిడ.

"చెప్పండమ్మా!"

"ఈరోజు పేపర్లో విజేష్ అరెస్ట్ అయ్యా డన్న వార్త వచ్చింది"

"అవునమ్మా!"

"కానీ ఆరోజు మా ఇంటికి వచ్చింది ఆయన కాదు"

కుర్చీలోనే ముందుకి తూలాడు ఇన్‌స్పె క్టరు.

"మీరు చెప్పేది నిజమేనా?"

"అవునండీ! నాకు బాగా గుర్తుంది. అతన్ని చూడగానే ఓ రౌడీలా అన్పిస్తుంది ఆరోజున మావారు పరిచయం చేయగానే ఇదేంటి ఈ వ్యక్తి పేరుకీ, మనిషికీ అసలు సంబంధమే లేదే అనుకున్నాను".

"అతను ఎలా ఉంటాడు" గభాల్న అడి గాడు ఇన్‌స్పెక్టరు.

"పొట్టిగా, కొంచెం లావుగా ఉంటాడు. బట్టతల... అసలు అతనికి, మీరు అరెస్ట్‌చే సిన అతనికి ఏమాత్రం పోలికలులేవు. అన వసరంగా మీరు ఎవరినో అరెస్ట్‌చేసి అతన్ని బాధపెడ్తున్నారు. ఇప్పటికైనా అసలు నేర స్థుడ్ని పట్టుకోండి" అని ఫోన్ పెట్టేసింది ఆవిడ.

ఇన్‌స్పెక్టరు ఆలోచనలో పడ్డాడు.

విషయం తెలుసుకుని శారదమ్మ, రాఘవ య్యగార్లెంతో ఆనందపడ్డారు.




వర్ధన్ అసలు వ్యక్తిని పట్టుకునేందుకు ప్రయత్నాలు చేస్తున్నాడు.



కేశూభాయ్ ఖత్రీని వసంత్ అడిగిన టైం పూర్తయ్యింది. ఈసారి కచ్చితంగా ఇల్లు ఖాళీచేస్తానని చెప్పడంతో ఆయన బాగా నమ్మకంతో ఉన్నారు.

"మొత్తానికి ఏం ప్లాను వేసినావన్నా! గొడవలన్నీ మర్చిపోయి రాసుకుపూసుకుని తిరిగిన వాళ్ళు మళ్ళీ బద్ధశత్రువులైపోయారు. కొట్టుకుఛస్తున్నారు"

వసంత్ పెద్దగా నవ్వాడు.

బాటిల్ ఎత్తి గటగట తాగేశాడు.

"ఆరోజు... ఏదో డబ్బుకి కక్కుర్తిపడి రాంభాయ్‌కి ఇస్తానన్న స్థలం ఇవ్వనన్నానే అనుకో. దానికి అందరిలో పట్టుకుని నన్ను కొడతాడా! ఇప్పుడేమైంది ఆ విజేష్‌గాడు జైలుపాలయ్యాడు" క్రూరంగా నవ్వాడు వసంత్.

"అన్నా నాదో సందేహం" అన్నాడు చంటి.

"ఏంట్రా"

"నిజంగా ఈ పనులన్నీ నువ్వే చేయించావా? "

"అవున్రా...! రతీబెన్ గోవిందా దగ్గరకు మనిషిని పంపి నేను విజేష్ దగ్గరినుంచి వస్తున్నాను. అని చెప్పించి స్థలం అవసరం లేదని చెప్పమన్నాను. వాడు అలాగే చెప్పాడు. దాంతో ఆవిడ స్థలం అగ్రిమెంట్ చేయించుకుందామని విజేష్ వాళ్ళు వెళ్ళినప్పుడు స్థలం ఇవ్వనని చెప్పింది. ఆ తర్వాత షాను సంప్రదించి మీకు సైట్ అమ్ముదామనుకుంటున్నాను అని చెప్పింది. ఏ ప్రయత్నం లేకుండా తనకు రతీబెన్ గోవిందా తన స్థలం అమ్ముతాననేసరికి షా అంగీకరించాడు. ఈ విషయాన్ని విజేష్‌కి చెప్పాను. షా మనిషిని పంపి నీ దగ్గర నుంచి వస్తున్నట్టు చెప్పమని నిన్ను మోసం చేశాడు అని చెప్పాను. విజేష్ బాగా ఇరిటేట్ అయ్యాడు. వెంటనే తను నీరవ్‌షానని ఆవిడకు ఫోన్ చేశాడు. తాను వేరే సైట్ చూసుకున్నానని, తనకు సైట్ అవసరం లేదని చెప్పాడు"

అసంకల్పితంగా ఆ మాటలు ఖత్రీ చెవిన పడ్డాయి.

విజేష్, షాల గురించి ఆయన రెగ్యులర్‌గా పేపర్లో చదువుతున్నారు.

"ఎప్పుడైతే విజేష్ ఇలా చేశాడని తెలిసిందో షాకు కోపం వచ్చింది. అఫ్‌కోర్స్ ఈ సంగతి కూడా నేనే షాకు ఫోన్ చేసి చెప్పాను. దాంతో మంట రాజుకుంది. షా షరాసరి విజేష్ ఇంటికి వెళ్ళి బెదిరించాడు. మన మనుషుల్ని అక్కడుంచాను. ఆ రాత్రి విజేష్ ఒంటరిగా బయలుదేరుతున్నాడని తెలిసి మనవాళ్లను ఎటాక్ చెయ్యమన్నాను. వాళ్లు చేశారు. అదృష్టవశాత్తు విజేష్ తప్పించుకున్నాడు. ఇదంతా నీరవ్‌షా పనేనని విజేష్ వాళ్లు అనుకున్నారు. ఆ తర్వాత రతీబెన్‌గోవిందా స్థలంలో అమ్మవారి నాటకం ఆడాను. అది కూడా విజేష్ తెలివిగా పరిష్కరించుకున్నాడు. అప్పుడు ఆనంద్ స్వరూప్‌ని కలిశాను. నా పేరు విజేష్ అని చెప్పాను. అంతా బానే జరుగుతోంది అని

# ఏరిన ముత్యాలు

* వాస్తవిక జీవితంలో ప్రతి గొప్ప సాహసకార్యం నమ్మకంతో మనం వేసే మొదటి అడుగుతోనే ప్రారంభం అవుతుంది.

-స్కెలిగల్

* ఏపని చేయడానికీ మీ వద్ద సమయం ఎప్పుడూ ఉండదు. మీకు సమయం కావాలంటే దాన్ని తయారుచేసుకోవాలి.

-చార్లెస్ బక్స్టన్

* ఎవరు తనను ఎంత గొప్పవాడిగా తలచుకుంటాడో అంతగా అణగదొక్కబడతాడు. ఎవరు ఎంత వినయంగా ఉంటాడో అంత గొప్ప వాడౌతాడు.

-బైబిల్

* సంపద చాలా తక్కువ ఉన్నవాడు కాదు, ఇంకా ఇంకా కావాలని అర్రులు చాచేవాడే పేదవాడు.

-సెనెకా,

* విరగడం కంటే వంగడం మంచిది.

-స్కాటిష్ సామెత;

* స్నేహానికి క్రమం తప్పకుండా నిరంతరం మరమ్మతు చేస్తూ ఉండాలి.

-డా॥జాన్సన్

* సలహాను ఇచ్చినంత ఉచితంగా, ఉదారంగా మనం మరేదీ ఇవ్వలేం.

-లారోబె ఫొకాల్డ్

* ఆపదలు అనే మూసలో స్నేహం పరీక్షింపబడుతుంది.

-గాంధీజీ

* పురుషునియొక్క మెదడు, మగువ యొక్క హృదయం, శిశువు యొక్క తాజాదనం ఉన్నవాడే గొప్పవాడు.

-సి.బి.పటేల్

* వీలైనన్నిసార్లు నవ్వగలగడమే అనారోగ్యానికి అతి చవకైన మందు. నవ్వు ఒక వేదాంతం వంటిది.

-ఒక సూక్తి

* మీకు అనవసరం అయిన దాన్ని ఇవ్వడం దానం అనిపించుకోదు.

-మదర్ థెరిస్సా,

సేకరణ: వాకాడ శ్రీనివాసరావు

అనుకుంటుండగా ఇద్దరూ కలిసిపోయారు. అసలు మొదటినుంచి సీరవ్‌షా ఎందువల్లనో విజేష్‌ని ఉపేక్షిస్తుండేవాడు. అతను ఎన్ని చేసినా ఆవేశపడే వాడుకాదు. అదే నాకో పెద్ద సమస్య అయ్యింది"

ఒక్కక్షణం ఆగాడు వసంత్. తిరిగి కొనసాగించాడు.

"ఇక్కడ ఆనంద్‌స్వరూప్‌ని బెదిరించాను. అతను ఆత్మహత్య చేసుకోవడం నేను ఊహించని టచ్. అదీ మంచిదే అయ్యింది. విజేష్ పూర్తిగా కూరుకుపోయాడు. ఇక సీరవ్‌షా మిగిలాడుగా! విజేష్ మీద ఎటాక్ చేయించి షాను ఇరికించేశాను"

"కానీ విజేష్ వాళ్లు షామీద కేసుపెట్టలేదు కదన్నా!"

"నిజమేరా! వాళ్ల అబ్బాయికి రక్తం ఇచ్చి ప్రాణం కాపాడాడని వాళ్లు షా మీద కేసు పెట్టలేదు. అప్పుడప్పుడు మనం ఊహించనివి కూడా జరుగుతుంటాయి. మొత్తంమీద విజేష్ అయితే ఫినిష్ కదా!" అదేదో జోక్ అయినట్టుగా నవ్వాడు వసంత్.

వాళ్లల్లో ఒకడు అప్పుడు చూశాడు ఖత్రీని.

అంతే ముసలాయన అని కూడా చూడకుండా ఆయనని కొట్టి రోడ్డుమీద పాడేశారు వసంత్ మనుషులు. ఖత్రీ చనిపోయివుంటాడనే వారు భావించారు.

ఆయన ప్రాణం పోయుంటే విజేష్‌ని ఎవ్వరూ రక్షించలేకపోయేవాళ్లు. కానీ ఆయన ప్రాణం గట్టిది కాబట్టే సమయానికి అటు వెళ్లిన వ్యక్తి కేశూభాయ్ ఖత్రీని ఆస్పత్రిలో చేర్పించాడు.

★ ★ ★

"డాక్టరుగారూ! ఆయనకెలా వుంది? " ఆత్రుతగా అడిగాడు అహ్మద్.

"ముందిది చెప్పండి. ఆయనకు మీరేమవుతారు"

"నాకు, ఆయనకూ ఏలాంటి సంబంధమూ లేదు" చెప్పాడు అహ్మద్.

"ఆయనకు ప్రమాదం తప్పింది. మిమ్మల్ని చూడాలనుకుంటున్నారు. వెళ్లండి" అన్నాడు డాక్టరు.

అహ్మద్ ఖత్రీ ఉన్న రూంలోకి వెళ్లాడు.

అహ్మద్‌ని చూడగానే ఆయన కృతజ్ఞతా సూచకంగా తన రెండు చేతులూ జోడించి నమస్కరించాడు.

"అయ్యో! మీరు పెద్దవారు. నన్ను ఆశీర్వదించాలేకానీ నాకు నమస్కరించకూడదు" వారించాడు అహ్మద్.

"బాబూ! నీకొక విషయం చెప్పాలి" అతి కష్టంమీద మాట్లాడుతున్నాడు కేశూభాయ్ ఖత్రీ.

"ముందు మీ ఇంటి అడ్రస్ చెప్తే మీ వాళ్లకు కబురు చేస్తాను. మీకు బాగా విశ్రాంతి అవసరం. ఆ తర్వాత మాట్లాడుకుందాం" అన్నాడు అహ్మద్.

ఆయన వినిపించుకోలేదు.

"లేదు బాబూ! ఆ దుర్మార్గుడి మూలంగా విజేష్‌గారు శిక్ష అనుభవిస్తున్నారు. నేను తప్పకుండా చెప్పి తీరాలి" ఆయాసంతో ఆగారాయన.

"మీరు... మీరంటున్నది ఐమీన్ మీరు చెప్పాలనుకుంటున్నది మా మావగారి గురించా? "

"ఆయన మీ మావగారా? "

"అవునండీ"

"విజేష్ నిరపరాధి, ఇదంతా చేసింది ఎవరోకాదు ఆ వసంత్"

అహ్మద్ దవడ కండరాలు కోపంతో బిగుసుకున్నాయి.

కేశూభాయ్‌ఖత్రీ తాను విన్నదంతా చెప్పాడు. ఆయన చెప్పడం ముగించేసరికి అహ్మద్ కళ్లు ఆగ్రహంతో ఎర్రబడ్డాయి. అలాగే వెళ్లి వాళ్లని నరికెయ్యాలన్నంత కోపం కూడా వచ్చింది.

ఈ సంగతి ముందుగా వర్ధన్‌కి చెప్తే ఉహూ.. అతను ఆవేశపరుడు. ఎస్... షాకి చెప్పాలి. ఆయనైతేనే బ్యాలెన్స్‌డ్‌గా వ్యవహ

రిస్తారు. అంతే కేశూభాయ్‌ని విశ్రాంతి తీసుకోమని చెప్పి ముందు ఆయన కుటుంబ సభ్యులకు ఈ విషయం చెప్పాడు. ఆ తర్వాత నీరవ్‌షాను కలిశాడు. షా అహ్మద్ చెప్పింది విని నివ్వెరపోయాడు.

★ ★ ★

ఇన్‌స్పెక్టరు వసంత్‌ని, చంటిని అరెస్ట్ చేశారు.

కేశూభాయ్ ఖత్రీ దగ్గర కూడా సాక్ష్యం తీసుకున్నారు.

ఫార్మాలిటీస్ అన్నీ పూర్తయ్యాక విజేష్ విడుదలయ్యాడు.

ఇన్‌స్పెక్టరు మనసులో మాత్రం ఓ సందేహం అలాగే ఉండిపోయింది.

"విజేష్‌గారూ! ఇప్పటికైనా ఆరోజు మీరు ఎక్కడికి వెళ్లిందీ చెప్తారా? " విజేష్ అహ్మద్ వంక ఇబ్బందిగా చూశాడు.

"మీకు అభ్యంతరం లేకపోతే నేను చెప్తాను" అన్నాడు అహ్మద్.

అందరూ ఆశ్చర్యపోయారు.

"ఇంతకుముందు ఎంత అడిగినా తెలీదన్నావు" అన్నాడు వర్ధన్.

"నాకు కూడా ఇందాకే తెలిసింది. ఆ రోజు మావయ్యగారికి వసంత్ మనిషి ఓ ఫ్రాడ్‌కాల్ చేశాడు. మీరు అల్లుడ్ని చేసుకోవాలనుకుంటున్న అతనికి ఆల్రెడీ పెళ్లయ్యింది. కావాలంటే ఈ అడ్రస్‌కి వెళ్లండి అని ఆ కాలర్ చెప్పాడు. మావయ్యగారు నన్ను అడగలేక ఆ ఫోన్ కాల్ నిజమో కాదో తెలీక నన్ను రెస్టారెంట్లో కూర్చోబెట్టి ఆయన మాత్రం కాలర్ చెప్పిన అడ్రస్ వెతుక్కుంటూ వెళ్లాడు. ఆ టైంలోనే వసంత్ ఆనంద్‌స్వరూప్ ఇంటికి వెళ్లాడు. ఆనంద్ స్వరూప్‌కి అతను వసంత్ అని విజేష్ కాదని తెలీదు. ఆనంద్ భార్య అతన్ని చూసి విజేష్ అనుకుంది. అందుకే ఆ టైంలో మీ ఇంటికి విజేష్ వచ్చాడా అని పోలీసులు అడిగితే ఆవిడ అవునని చెప్పింది"

విజేష్ అవునన్నట్టు తలాడించాడు. "తీరా నేను అక్కడికి వెళ్లేసరికి మళ్లీ అతనే సరదాగా అన్నాను 'నిన్ను ఫూల్‌ని చేశాను' అని ఫోన్ చేశాడు. ఈ విషయం చెప్తే నా అల్లుడు తనను సందేహించినందుకు ఫీలవుతాడు. అది జీవితాంతం అలాగే ఉండిపోతుందని నేనామాట చెప్పలేకపోయాను"

నీరవ్‌షా విజేష్‌ని క్షమాపణ అడిగాడు.

అందరూ విజేష్ ఇంటికి వచ్చారు.

శారదమ్మగారికి ఆనందంతో గుండె బరువెక్కింది.

వాళ్లతో మాట్లాడుతూనే విజేష్ అప్రయత్నంగా మెడలోంచి గొలుసుతీశాడు. "అమ్మా! ఇప్పుడు నేను క్షేమంగానే ఉన్నానుకదా! ఈ గొలుసు, లాకెట్ భద్రంగా దాచమ్మా! మళ్లీ ఎప్పుడైనా అవసరం వచ్చినప్పుడు నా మెడలో వేద్దువుగానీ" అని నవ్వాడు.

శారదమ్మగారు గొలుసు అందుకున్నారు. "నువ్వెన్నైనా చెప్పరా! ఈ లాకెట్ నిన్ను రక్షించిందనే నా నమ్మకం" అన్నారావిడ.

ఆ లాకెట్ చూస్తుంటే షా మనసులో ఏవో అనుభూతులు, జ్ఞాపకాలు కదలాడాయి.

"అమ్మా! నేనొక్కసారి ఆ లాకెట్ చూడచ్చా" అడిగాడు షా.

శారదమ్మగారు గొలుసు షా చేతికి ఇచ్చారు.

ఆ లాకెట్ చూడగానే షా కళ్లల్లో నీళ్లు తిరిగాయి.

తన మెడలో ఉన్న గొలుసు తీశాడు. దానికి కూడా సరిగ్గా అలాంటి లాకెట్ ఉంది.

"అమ్మా! నేను ఓ ప్రశ్న అడిగితే మీరేం అనుకోరుగా" సందిగ్ధంగా అన్నాడు షా.

"అడుగు బాబూ!"

"ఇది ఈ లాకెట్‌కు ఇంతకు ముందు





నల్లటి తాడు ఉండేది కదూ!"

"అవును" విస్తుబోతూ అన్నారు శారదమ్మ.

ఒక్క ఉదుటున కూర్చున్న చోటునుంచి లేచాడు షా. శారదమ్మగారి చేతులు పట్టుకున్నాడు. "అమ్మా! మీకు... మీకు ఈ లాకెట్ ఎక్కడ దొరికింది?"

అతను ఎందుకు అంత ఉద్వేగానికి లోనయ్యాడో రాఘవయ్యగారికి మినహా ఎవ్వరికీ అర్థంకాలేదు.

"చెప్పండమ్మా!" అని "ఇదిగో ఈ లాకెట్ చూడండి. సరిగ్గా నా మెడలో కూడా ఇలాంటిదే ఉంది. అమ్మ నాకూ, నా తమ్ముడికి ఒకేలాంటి లాకెట్ చేయించింది. మేమిద్దరం రామలక్ష్మణుల్లా ఎప్పుడూ కలిసే ఉండాలని ఆవిడ కోరిక. అందుకే..." అంటూ లాకెట్ ఓపెన్ చేశాడు. "ఇదిగో చూడండి... ఇందులో నాది, నా తమ్ముడిది ఫొటోలున్నాయి"

శారదమ్మగారు లాకెట్ అందుకుని చూశారు. షా చెప్పింది నిజమే. రెండూ ఒకే విధంగా ఉన్నాయి. రెంటింటిలోనూ ఫొటోలున్నాయి.

"అమ్మా! ఈ లాకెట్..." మళ్లీ అడిగాడు షా.

శారదమ్మగారు రాఘవయ్యగారివైపు చూశారు.

ఆయన తలపంకించారు "అది మా విజేష్‌ది బాబూ!" అన్నారాయన.

"అంటే విజేష్... విజేష్..." ఆనందంతో షాకు నోటి మాటరాలేదు.

"విజేష్ మా సొంత కొడుకు కాదు బాబూ! నువ్వు పోగొట్టుకున్న నీ తమ్ముడు"

రాఘవయ్యగారి మాట పూర్తికాకముందే నీరవ్‌షా విజేష్‌ని బలంగా దగ్గరకు లాక్కున్నాడు.

ఇద్దరూ చాలాసేపు గాఢ పరిష్వంగనలో ఉండిపోయారు.

ఏదో గుర్తుకు వచ్చినవాడిలా నీరవ్‌షా విజేష్ కుడి చేతివైపు షర్ట్ కొద్దిగా పైకి తొలగించాడు.

అక్కడ రూపాయి నాణెం అంత సైజులో ఓ మచ్చ కన్పించింది.

"అమ్మా! ఇది... ఇది చూశారా నా తమ్ముడు పుట్టినప్పటినుంచి ఈ మచ్చ ఉంది. అంటే నేను... నేను అనాథను కాదు. నాకు తమ్ముడు వున్నాడు" భావోద్వేగంతో అన్నాడు నీరవ్‌షా.

ఆ అపురూప దృశ్యాన్ని అందరూ అబ్బురంగా చూస్తున్నారు.

"విజేష్‌ను చూసినప్పుడల్లా నా మనసు ఏదో తెలీని ఉద్వేగానికి లోనయ్యేది. మిగతా వారితో ప్రవర్తించిన విధంగా విజేష్‌తో ప్రవర్తించలేకపోయేవాడిని. రక్తసంబంధం ఎక్కడ ఉన్నా మనసుని స్పందింపచేస్తుందనడానికి ఇంతకన్నా ఉదాహరణ ఏం కావాలి?"

"అన్నట్టు మీ ఇంట్లో ఉన్న ఫొటోనే మా ఇంట్లో కూడా ఉంది బాబూ!" అన్నారు శారదమ్మ.

అనటం కాదు వెంటనే లోపల ఎక్కడో దాచిన ఫొటో తీసుకొచ్చారు.

"మీ ఇంట్లో చూసినప్పుడు ఎక్కడో చూశానని అనుకున్నానే కానీ ఎక్కడన్నది గుర్తుకు రాలేదు. ఇన్నాళ్లికి మీ అన్నాతమ్ముళ్ళి చూశాక గుర్తుకొచ్చింది" అంటూ ఫొటో షా చేతికిచ్చారు శారదమ్మ.

షా ఆ ఫొటో అందుకుని విజేష్‌కి ఇచ్చాడు.

"ఆ రోజు నన్ను కాపాడారు. నా తమ్ముడ్ని కాపాడటమేకాదు మీ కన్నబిడ్డలా పెంచారు. మీకు ఎలా కృతజ్ఞతలు చెప్పుకోవాలో అర్థం కావడంలేదు" రాఘవయ్యగారి చేతులు పట్టుకున్నాడు షా.

"విజేష్‌ను మేము కన్నబిడ్డగానే భావించాం బాబూ! నువ్వు అనాథవు కాదని చెప్పేందుకే నీకీ విషయం చెప్పాను. ఈ

రోజునుంచి నువ్వు మా పెద్ద కొడుకువి. ఇంకెప్పుడూ మీరు మాకు పరాయి వాళ్లన్న భావన కల్గించద్దు. మీరిద్దరినీ నేను కోరేది ఒక్కటే. డబ్బు, ఆస్తి, అంతస్థులు కన్నా మంచి, మానవత్వం ముఖ్యం. ఆ రెంటికి మీరు ప్రతిరూపంగా నిలబడాలన్నది నా కోరిక" అన్నారు రాఘవయ్య.

"నాన్నగారూ! మీరు నడిచిన బాటలోనే నడుస్తామని వాగ్దానం చేస్తున్నాం" ఆయన చేతిలో చెయ్యి వేశాడు విజేష్.

"నాదీ మా తమ్ముడి బాటే" అన్నాడు నీరవ్‌షా.

ఆ తర్వాత షా, విజేష్‌లలో చాలా మార్పు వచ్చింది.



తిరిగి స్మృతి అపార్ట్‌మెంట్స్ పని ఆరంభమయ్యింది.

అన్నదమ్ములిద్దరూ కలిసి కేవలం పేద వారికి, మధ్యతరగతి వారికి అందుబాటులో ఉండే విధంగా ఇళ్లు నిర్మించేందుకు ఓ ప్రాజెక్ట్ మొదలు పెట్టారు.

శాంతి, దినేష్‌ల వివాహమైపోయింది.

అహ్మద్, సుశీల కలిసి హ్యాండీక్రాఫ్ట్స్, డిజైనర్ డ్రస్సుల షాపు ఆరంభించారు.

ఇప్పుడు శారదమ్మగారి మనసు ప్రశాంతంగా ఉంది.

రాఘవయ్యగారు కొడుకులిద్దరినీ చూసుకుని గర్విస్తున్నారు.

సరిగ్గా సంవత్సరం తర్వాత సుశీల, అహ్మద్‌లకు వివాహమైంది.

ఇప్పుడు వారి కుటుంబాలలో కులం లేదు, మతం లేదు, ఆస్తి, అంతస్థు ఏమీ లేవు. ఉన్నదంతా మంచి, మానవత్వమే.

మంచితనం ఆ ఇండ్ల సింహద్వారం

మానవత్వం ఆ ఇండ్ల పైకప్పు.

వారిలోని ప్రేమ, అభిమానం, ఆదరణ, ఆప్యాయతలనే పిల్లర్స్ మీదే ఆ ఇళ్లు నిలబడి ఉన్నాయి.

నిజంగా వారంతా అందరికీ ఆదర్శప్రాయులే.

వారినలా ముందుకి నడిపిస్తున్నది రాఘవయ్య, శారదమ్మగారు, వారి ఆదర్శాలు... ప్రతివారు వారిలా ఉండగలిగితే...

ప్రతి తల్లీతండ్రి తమ పిల్లలకు చివరకు మిగిలేది మంచి, మానవత్వం అని చెప్పగలిగితే.

ప్రతి వ్యక్తీ సొంతలాభం కొంత మానుకుని పొరుగువాడి కోసం పాటుపడగలిగితే?

ఈ దేశంలో కరువు ఉండదు. ఈ దేశంలో అన్యాయం, అక్రమం, స్వార్థం, కష్టాలు, కన్నీళ్లు, ఆకలి చావులు ఉండవు.

మరి ఆ రోజు వస్తుందా? వస్తే ఎప్పుడు వస్తుందో?



**అంకితం**

చిన్నతనం నుంచీ నన్నెంతగానో
ప్రోత్సహించిన తాతగారు
కీ.శే. విద్వాన్ కల్లూరి వెంకట
సుబ్రహ్మణ్య దీక్షితులు గారికి
అభిమానంతో

– కల్లూరి శైలబాల





# చతుర కతలు

## తిక్క కుదిరింది

"పోస్ట్"!

పాత పత్రికలు తిరగేస్తూ కొత్తకథను తయారు చేస్తున్న యువ రచయిత జె. కె. ఇంట్లోనుండి హడావుడిగా బయటకు వచ్చాడు. జె. కె అసలు పేరు జయకృష్ణ. కవరొకటి ఇచ్చి వెళ్లిపోయాడు పోస్ట్‌మేన్.

ఆతృతగా కవరు చింపాడు జె. కె.




యువ రచయిత జె. కె గారికి!

జాతీయ సమైక్యతను కోరుతూ మేము నిర్వహించిన మినీకథల పోటీకి మీరు పంపిన కథ 'తిక్కకుదిరింది'కి ప్రథమ బహుమతి లభించిందని తెలియజేయుటకు సంతోషిస్తున్నాము. ఆగస్టు 15న భారత్, పాకిస్తాన్ సరిహద్దులలో జరగబోవు బహిరంగసభలో ముషారఫ్ చేతుల మీదుగా మీకు షీల్డ్ బహుమతి ఎమౌంట్ ఇరవై ఐదు వేలు బహూకరించబడును. తప్పక విచ్చేయవలసిందిగా కోరుతూ...

లెటర్ చదివిన ఆనందంలో ఒళ్లు తెలియ లేదు. అంతలోనే 'తిక్కకుదిరింది' కథను నేనెపుడు పోటీకి పంపాను? అనే అనుమానం కలిగింది. అడ్రస్ మరోసారి చూశాడు చాలా క్లియర్‌గా వుంది. 'ఎపుడో పంపించే వుంటాను' అని సర్ది చెప్పుకుని గబగబా డ్రెస్ వేసుకుని ఆ లెటర్ తీసుకుని మిత్రబృందం దగ్గరకు పరుగెత్తాడు తన

ఆనందాన్ని వాళ్లతో పంచుకోవటానికి.

రకరకాల కలంపేర్లతో పోటీలకు, పత్రికలకు కథలు, కవితలు పంపే జె.కె ఏ పత్రికలోనైనా కథ పడితే చాలు ఓటర్ల లిస్టు దగ్గర పెట్టుకుని ఆ కథ చాలా బాగుందంటూ ఆ పత్రికకు తనే ఉత్తరాలు రాసేస్తుంటాడు. ఏదైనా కథ చదివినపుడు ఈ కథ ఇదివరకెపుడో చదివినట్టుందే అనే భావం పాఠకునికి కలిగిందంటే ఆ కథా రచయిత తప్పకుండా జె.కె. అయివుంటాడని వేరే చెప్పనక్కరలేదు. ఇన్ని సుగుణాలున్న జె.కె.కు కాస్త పబ్లిసిటీ పిచ్చి కూడా ఎక్కువే. ఈమధ్య ఓ దిక్కుమాలిన పత్రికకు విలేకరిగా మారాడు.

మొహమాటం జర్నలిస్టులతో స్నేహం పెంచుకుని "నీ గురించి గొప్పగా నేను భజన చేస్తాను నా గురించి నీవు చేయి" అంటూ కాంట్రాక్టులు కూడా పెట్టుకున్నాడు. ఇవన్నీ కాకుండా "షామియానా ఖర్చులు, దండల ఖర్చులు నావే! మీరొచ్చి నా మెళ్లో దండ వేస్తే చాలు" అంటూ ప్రభుత్వం కళ్లుగప్పే ప్రముఖులతో సన్మానాలు కూడా చేయించుకున్నాడు.

★ ★ ★

జె.కె. చూపించిన లెటర్ చూసి మిత్రబృందం చప్పట్లు కొట్టి అభినందించారు. "ఒరేయ్! జేకే! నీ ఖ్యాతి మనదేశ సరిహద్దులు దాటేస్తోంది. ముషారఫ్ చేతులమీదుగా బహుమానం తీసుకోవటమంటే మాటలా? ఈ శుభ సందర్భంలో నీవు అప్పుజేసైనాసరే మకారద్వయంతో మాకు పార్టీ ఇవ్వవలసిందే" అన్నాడు మిత్రబృందంలో ఒకడైన మారుతి.

మంగళవారం పుట్టాడని వాడికి వాళ్ల నాన్న ఏ క్షణాన మారుతి అని పేరు పెట్టాడోగాని వాడికి తోకే తక్కువ.

"పార్టీ ఇస్తానుగాని ఈ పోటీకి కథ ఎప్పుడు పంపానో గుర్తు రావటంలేదు" అన్నాడు జె.కె. సంశయిస్తూ.

"ఎప్పుడో పంపేవుంటావు బావా ఏదో కలం పేరుతో. లేకపోతే అంత క్లియర్‌గా నీకు లెటర్ ఎలా వస్తుంది" అంటూ సపోర్ట్ చేశాడు మారుతి.

పాతిక వేలు వచ్చేటపుడు పార్టీ ఇస్తే నష్టమేమిటిలే అనుకుని పార్టీకి డేట్ ఫిక్స్ చేశాడు జె.కె.

★ ★ ★

మందు, మాంసం వగైరాలతో హోటల్ బృందావన్‌లో పార్టీ గ్రాండ్‌గా జరిగింది. మిత్రబృందం ఆనందానికి అవధుల్లేవు. బిల్లు మొత్తం ఐదు వేలు పైనే తేలింది.

★ ★ ★

సిగరెట్ దమ్ములాగుతూ కొత్త కథకు శ్రీకారం చుడుతున్నాడు జె.కె. "నిన్న మీకో ఉత్తరం వచ్చింది ఇవ్వటం మరిచాను" అంటూ లెటర్ తీసుకొచ్చింది జె.కె శ్రీమతి.

ఆ లెటర్ చదువుతున్నంతసేపూ జె.కె ముఖంలో రంగులు మారిపోసాగాయి. సరిగ్గా అదే సమయంలో ఆలయ ప్రాంగణంలో మారుతి చెబుతున్న మాటలు వింటూ పగలబడి నవ్వుకుంటున్నారు మిత్రబృందం.

"ఉద్యోగం వచ్చినపుడు పార్టీ ఇవ్వలేదు. పెళ్లయినపుడూ పార్టీ ఇవ్వలేదు. కనీసం కొడుకు పుట్టినప్పుడైనా పార్టీ ఇవ్వటంలేదు. ఆ జె.కె.గాడి తిక్కకుదర్చాలని నేనే చిన్న ట్రిక్ చేశాను. ఢిల్లీలో వున్న మా మేనమామ కొడుకుతో ఫస్ట్ ప్రైజ్ వచ్చినట్లు లెటర్ రాయించాను. మళ్లీ అనవసరంగా ఆగస్టు 15కి బోర్డర్‌కి ప్రయాణం కడతాడేమోనని అది క్యాన్సిల్ అని లెటర్ రాసేశాను" అని ఆ లెటర్ గురించి వివరించసాగాడు మారుతి.

సరిగ్గా అదే సమయంలో తనకొచ్చిన దుర్వార్తను మిత్రులకు చెప్పటానికి వచ్చిన జె.కె. "ఒరేయ్! మారుతీ మిత్రద్రోహీ" అంటూ పెట్టిన కేక ఆ ఆలయ ప్రాంగణంలో ప్రతిధ్వనించింది. ఒక్క ఉదుటున గోడ దూకాడు మారుతి.

– హైమవతీసత్య




# ఏర్పాటు

పరంధామం, పాండురంగం చిన్ననాటి స్నేహితులు. పరంధామం ఏదో గవర్నమెంటాఫీసులో పనిచేసి ఉద్యోగ విరమణానంతరం ఫించను అందుకుంటున్నాడు. పాండురంగం పల్లెపట్టునే వుండి పొలాల సేద్యం చూసుకుంటూ కాలక్షేపం చేస్తున్నాడు. ఉద్యోగ బాధ్యతలతో దూరాభారాలు తిరుగుతూ ఉండడంతో స్నేహితులిద్దరూ చాలా కాలంగా కలుసుకోలేదు. ఓరోజు సాయంత్రం బజారునుండి వస్తున్న పరంధామానికి ఎదురుగా నడచి వస్తున్న పాండురంగం కన్పించాడు అంతే. "ఒరేయ్ పాండూ..." అంటూ అరిచి, పిలిచి నడిరోడ్డుమీదే కౌగలించేసుకున్నాడు. అంతే ఉద్వేగంగా పాండురంగమూ అతని బాహువుల్లో ఒదిగిపోయాడు.

రోడ్డు మధ్యగా కావలించుకున్న మిత్రులిద్దర్నీ చూసి ట్రాఫిక్ అయిలెండ్ మీద నుండి ఒక్క దూకిదూకి విజిలేసుకుంటూ పరుగు పరుగున వచ్చేశాడు ట్రాఫిక్ కానిస్టేబుల్. వచ్చే ఒగుర్పు నాపుకుంటూ "బాబూ... ఇదేమన్నా మీ యిల్లనుకున్నారా...? పబ్లిక్ పార్కనుకుంటున్నారా...? పక్కకెళ్ళి పరాచికాలాడుకోండి" అంటూ ఇద్దర్నీ జబ్బలట్టుకొని పక్కకి లాగేశాడు పోలీసాయన. ఆ తర్వాత ఆ అరనిమిషం భాగ్యానికి అరగంట పట్టింది స్థంభించిన రద్దీని సర్దేసరికి పాపం ఆ పోలీసెంకటసామికి!

అదేమీ పట్టించుకోకుండా మిత్రులిద్దరూ పిచ్చాపాటీ మాట్లాడుకుంటూ ఇంటికి చేరుకున్నారు. పరిచయాలు, పలకరింపులు, కుశలప్రశ్నలు అయిన తర్వాత చిన్ననాటి కబుర్లు చెప్పుకోవడంలో మునిగిపోయారు. "ఫలానా వాడెక్కడున్నాడు, ఫలానా వాడేంచేస్తున్నాడు" అంటూ.

"అయినా ఆరోజులు మళ్ళీ రావురా. వెన్నెల రోజుల్లో సైకిళ్ళమీద భీమవరం సినిమాకి వెళ్ళి అర్ధరాత్రిపూట ఆ వెన్నెల్లో తడిసొస్తుంటే ఎంత హాయిగా ఉండేది. ఆ ప్రశాంత వాతావరణంలో మన లంకా సూర్యనారాయణ రాయబారం పద్యాలు ఎంత బాగా పాడేవాడు" పరంధామం అన్నాడు పాతరోజుల్ని గుర్తుచేసుకుంటూ.

"మన వేణుమాధవంగాడు మాత్రం కరుణశ్రీ పద్యాల్ని ఎంత శ్రావ్యంగా పలికించేవాడు వాడి గొంతులో. అవునొరే. ఆ కడియం పంతులి తిండియావ ఏమన్నా తగ్గిందా? ఈ వయసులోనూ అదే పనిగా లాగించేస్తున్నాడంటావా" అన్నాడు పాండురంగం.

"ఆ... ఎక్కడ తగ్గుతుందీ. నాతో తిని మళ్ళీ పదినిమిషాలు కాకుండానే నీతో యధావిధిగా ఇడ్లీ, ఉప్మా, పెసరట్టు కలేసి సునాయాసంగా ఆరగించేవాడు. ఆ మధ్య నేదో ఫంక్షన్‌లో కలిశాడు. తర్వాత వాడి జాడే లేదు" పరంధామం అన్నాడు.

"వడ్డించాను రండి" అని వంటింట్లోంచి పరంధామం భార్య పిలవడంతో స్నేహితులిద్దరూ పాదప్రక్షాళన కావించి భోజన కార్యక్రమానికి ఉపక్రమించారు. "అబ్బ... చెల్లెమ్మా నీ చేతివంట తిని ఎన్నాళ్ళయిందమ్మా. నీ వంటల రుచి మరెవరి చేతిలోనూ రాదనుకో" మామిడి కాయ పప్పులో వంకాయ ఉల్లికారం కూర నంచుకుంటూ అన్నాడు పాండురంగం.

"ఏదో... మీ అభిమానం కానీ, మా వదినగారు మాత్రం వంటల్లో ఏం తక్కువ" చిన్నగా సిగ్గుపడుతూ అంది పరంధామం భార్య. కొత్తావకాయ, గోంగూర పచ్చళ్ళ రుచులు చూసి, ఆపై గుమ్మడి కాయ దప్పళంతో అప్పళించి

కమ్మటి పెరుగుతో భోజనం పూర్తిచేసి లేచారు స్నేహితులిద్దరూ.

ప్రత్యేకంగా తయారుచేసిన వక్కపొడి నములుతూ పడకగదిని చేరారు. ఉతికిన దుప్పట్లు పరిచి, మెత్తని తలగడలు అమర్చిన ఒకటే పడక ఉంది ఆ గదిలో ఆ మంచానికి పక్కనే ఒక టేబుల్ దాని వెనుక గాడ్రెజ్ కుర్చీ, బల్లపైన లావుపాటి లెడ్జర్ బైండు పుస్తకాలు ఉన్నాయి. ఇద్దరూ మంచంమీద కూర్చొని మరి కాస్సేపు చిన్ననాటి కబుర్లాడుకున్నారు.

నువ్వో" అంటు మరో మంచం లేదన్నట్టు ప్రశ్నార్థకం ముఖంపెట్టాడు పాండు రంగం.

"ఇదుగో... నా పక్క" అంటూ పక్కనే ఉన్న టేబుల్ని చూపించాడు పరంధామం.

"ఇదా..." అంటూ ఈ సారి ఆశ్చర్యార్థ కంలోకి మార్చాడు ముఖాన్ని పాండు రంగం.

"అవున్రా. ఏమిటో పగలంతా ఆ ఆఫీసు ఫైళ్ళ మధ్య తలపెట్టి నిద్రపోయి... పోయి... ఇంటి దగ్గర కూడా ఆ టేబులూ

ఆవలింతలు మొదలుకావడంతో "సరేరా... పాండురంగం! ఈ కబుర్లు ఇప్పట్లో తెములుతాయా. ఏమన్నానా? పడుకో యిలా" అంటూ మంచంమీద నుండి లేచాడు పరంధామం. "మరి

పుస్తకాలూ లేకపోతే కంటిమీదకి కునుకు రాదనుకో. అందుకే ఇలా ఏర్పాటు చేశాను" అన్నాడు పరంధామం.

"ఒర్నీ... ఇదా... ఇన్నాళ్ళూ నువ్వు వెలగబెట్టిన గవర్నమెంటు ఉద్యోగం" బోల్డు హా...శ్చర్యపోయాడు పాండురంగం.

– సూరిపండు






# 'ఫ్యామిలీ హిస్టరీకార్డ్' పై సమీక్షలు

అక్టోబర్ చతురలో ప్రచురితమైన కొలపల్లి ఈశ్వర్ నవల 'ఫ్యామిలీ హిస్టరీకార్డ్' పై మాకందిన ఉత్తమ సమీక్షలు

## సుదీర్ఘ చర్చ



*(మొదటి బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)*

మానవాభ్యుదయానికి, మానవ వికాసానికి విశేషంగా తోడ్పడే వైజ్ఞానిక శాస్త్ర విషయంలో ఓ వ్యక్తికి ఏర్పడిన విచిత్ర ధోరణి ఫలితంగా అతని చుట్టూ ఉన్న వ్యక్తులు, సంబంధీకుల మధ్య చెలరేగిన సంచలనాలు, సంఘర్షణలను సుదీర్ఘంగా చర్చించిన నవల 'ఫ్యామిలీ హిస్టరీ కార్డ్'. యూజెనిక్స్‌పట్ల ప్రగాఢ విశ్వాసమూ నమ్మకమూ ఉన్న డాక్టర్ దిలీప్ తను నమ్మిన సిద్ధాంతం కోసం తనకు అన్ని విధాలా నచ్చి, తన మనసు ఎంతగానో కావాలని అభిలషిస్తున్న అజంతను సహితం వదలుకోవడానికి సిద్ధపడతాడు. రకరకాల రుగ్మతలతో, వ్యాధులతో నిర్వీర్యమైపోతున్న మానవజాతిని పునరుద్ధరించి, దాని స్థానంలో ఒక ఆరోగ్యవంతమైన సమాజ సృష్టికి పూనుకోవడం యూజెనిక్స్ ముఖ్యోద్దేశం.

అయితే మానవ ప్రకృతి ఎంతో వైవిధ్యభరితమూ, విలక్షణమూ అయినది. అది ఏ తాత్వికతకు, ఏ సిద్ధాంతానికి లొంగనిది, అంతుపట్టనిది. అదే దానిలోని అందం. అటువంటి సంక్లిష్టమూ, వైవిధ్యభరితమూ అయిన మానవ ప్రకృతిని యూజెనిక్స్‌కి కాని, మరే సిద్ధాంతానికి కాని అనుగుణంగా నిబద్ధీకరించాలనుకొన్నప్పుడు అది దానిలోని సహజ సిద్ధమైన అందాన్ని కోల్పోయి అసహజంగా తయారవుతుంది. ఏ సిద్ధాంతం అయినా శాస్త్రరీత్యా సరి అయినదే అయినా, ఆచరణలో నూటికి నూరు పాళ్లూ అసాధ్యం అని ప్రధాన పాత్రలైన అజంత, శిల్పలద్వారా తెలియజేస్తారు రచయిత.

కథా కల్పన దృష్ట్యా అజంత కథానాయిక అయినా నవల మొత్తానికి సూత్రధారిణి

శిల్ప. ఉత్తర దక్షిణ ధృవాలుగా సాగిపోతున్న అజంత, దిలీప్‌లను ఏకం చేయడానికి చిత్రవిచిత్రమైన ఊహలు, కల్పనలతో కథను నడిపి చివరకు ఇద్దరినీ సూత్రబద్ధులను కావించడంలో కృత కృత్యురాలవుతుంది శిల్ప.

ఎక్కడా అతి అన్నదిలేకుండా కొద్దిపాటి పాత్రలతో తను చెప్పాలనుకున్నది సూటిగా చెప్పడంలో సఫలీకృతులయ్యారు రచయిత కోలపల్లి ఈశ్వర్. అయితే అజంతను పెళ్ళికి ఒప్పించేందుకు దిలీప్ తల్లి మెలాంకొలియా అనే మానసిక వ్యాధితో బాధపడుతున్నట్టుగా కల్పించిన సన్నివేశాన్ని చివరలో నాటకంగా తేల్చివేయడం ఈ నవల ఉదాత్తతని దెబ్బతీసేదిగా ఉంది. అలా నాటకంగా, తేల్చివేయకుండా అలాగే నవలని సాగించి దిలీప్ తన ఆలోచనలలోని అసంబద్ధతని గ్రహించుకున్నట్టుగా ముగించి ఉంటే నవల ఇంకా గొప్పగా ఉండేది అనిపిస్తుంది. ఏమైనా ఒక చక్కని విషయం తీసుకుని హృద్యంగా మలిచిన రచయిత బహుధా ప్రశంసనీయుడు.

– పి. లక్ష్మి
హైదరాబాద్-44

## కలుపు మొక్కలు

*(రెండవ బహుమతి రూ. 75/– పొందిన సమీక్ష)*

సాహిత్యంలో సునిశిత హాస్యం కరువైన ప్రస్తుత తరుణంలో చక్కని మెలోడ్రామాతో ఆసాంతం చదివింపజేసిన నవల 'ఫ్యామిలీ హిస్టరీకార్డ్'.

ప్రేమకు హద్దులు-కొలబద్దలు ఉండవనీ, నిర్దిష్ట ప్రమాణాల మధ్య అది ఇమడదనీ, సైన్సూ-జీన్సూ ఎంత అభివృద్ధి చెందినా మనసు పొరలను మాత్రం స్పృశించలేవనీ, నిగూఢమైన ప్రేమ, భావుకత ముందు వినూత్న సాంకేతిక పరిజ్ఞానం దిగదుడుపేననీ ఒక కొత్తకోణంలో చూపి కృతార్థులయ్యారు రచయిత.

కానీ మెడిసిన్ పూర్తిచేసి, బాధ్యతాయుత వైద్యవృత్తిలో కొనసాగుతున్న దిలీప్‌లాంటి యువకుడు 'ఫ్యామిలీ హెల్త్ కార్డ్' నిర్ణయాన్ని తీసుకోవడం పాఠకులను కొంత సంశయానికి గురిచేస్తుంది. 'పుర్రెకో బుద్ధి- జిహ్వాకో రుచి' అనే నానుడితో సరిపెట్టుకుంటే... మరి అతనిలో జీర్ణించుకుపోయిన భావాలు కలుపుమొక్కలతో సమానమనీ, తొలగించకపోతే మరో నలుగురికి అంటుకునే ప్రమాదముందనీ మొదట్లో భావించిన అజంత, ఆమె స్నేహితురాలు శిల్పతో కలిసి మొదలెట్టిన అసైన్‌మెంట్ చప్పగానే తోస్తుంది. పైపెచ్చు ప్లాన్ ఫేరుతో కొనసాగిన ప్రహసనం అతనిలో మార్పు తీసుకురానట్లే కనిపిస్తుంది. అయితే శిల్ప చొరవతోనే కథ మలుపు తిరిగిందని చివర్లో చెప్పడం కొసమెరుపు. ఈలోపు అతనిలో మార్పుకోసం ఆరాటపడుతూ, అంతర్లీనంగా అతనిపై ఆరాధన పెంచుకొని, ముక్తాయింపులో మనసు మార్చుకొన్న అజంత ఆత్మాభిమానంగల యువతిగా నిలుస్తుంది. దిలీప్ తల్లి హైమవతికి 'మెలాంకొలియా' వ్యాధి, అజంత పేరును కలువరిస్తున్న (సైకో ఎనలిస్ట్ ప్రవీణ్ రికార్డు చేసిన) మాటలు పాఠకులకు ప్రశ్నార్థకాలైనా, అవి అంతర్‌నాటకంలో భాగాలని చివరికి తెలిసి రిలీఫ్‌నిస్తాయి.

పాత్రోచితంగా ఇంగ్లీష్ ప్రొఫెసర్ విల్సన్‌ని వదిలేస్తే మిగిలిన పాత్రలన్నీ మామూలుగా ఉపయోగించే తెలుగు పదాలు, వాక్యాలు ఆంగ్లంలో ఉపయోగించడం చదవడానికి కొంత ఇబ్బందిని కలిగిస్తాయి. కారణం 'చతుర' పాఠకుల్లో అధికులు సాధారణ గృహిణులే కాబట్టి!





మళ్ళీ మొదటికి వస్తే హృదయాంతరాలలో జనించిన 'ప్రేమ' అనే మొక్కకు మొగ్గలు తొడిగించి, ఆపై పూవులు పూయించి, ఆ సౌరభాన్ని పాఠకులు నచ్చేలా, మెచ్చేలా అందించడం బావుంది. యాంత్రిక జీవనంలో హాస్యానికి దూరమౌతున్న వారికి హాయినిచ్చింది!

– ఎం. శ్రీనివాసరాజా
కరీంనగర్-505 001.

## కొత్త నిర్వచనం

*(మూడవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)*

కోలపల్లి ఈశ్వర్ 'ఫ్యామిలీ హిస్టరీ కార్డ్' ఓ రకమైన ప్రేమ కథలా అనిపించినా, కొన్ని జీవిత సత్యాలను (మరుగుపడిన అంటే బాగుంటుందేమో) మనోహరంగా మలిచాడు.

పెళ్ళిచూపులు, పిల్ల చూడగానే నచ్చడం, నచ్చకపోవడం, కట్నకానుకలు, ఇచ్చిపుచ్చుకోవడాలు, చేయవలసిన మర్యాదలు, జాతకాలు సరిపోవడం లాంటివే కాకుండా ఈ ఇరవైఒకటో సెంచరీలో ఆడపిల్లలు మరో ఇబ్బందికర విషయాన్ని 'ఫేస్' చేయవలసిన రావచ్చు అని ఊహాత్మకంగా చేసిన ఒక ప్రయోగం.

ఇంతకాలం కులమతాలను, ఆస్తి అంతస్థులను ఎదిరించి నేనున్నా అంటూ చెప్పుకొనే 'ప్రేమ' తత్వం, సైన్స్ అండ్ టెక్నాలజిని సహితం ధిక్కరించి 'ప్రేమ' అనే రెండక్షరాలకు కొత్త నిర్వచనం చెప్పింది.

యాంత్రిక జీవనం గడుపుతున్న ఈ రోజుల్లో జీవితపు విలువలు తెరమరుగవుతుంటే రాబోయే కాలం 'అంత్రాక్స్' కంటే భయంకర వాతావరణాన్ని సృష్టిస్తుంది అని పరోక్షంగా చెప్పి, దానికి నివారణ మార్గం ఒక్కటే అని చెప్పగలిగిన రచన.

తను ప్రేమించే వ్యక్తికంటే, తనను ప్రేమించ గలిగిన వాడే నిజమైన ప్రేమికుడు అనేది ఓ సూక్తి. అర్థంచేసుకొంటే ఈరోజుల్లో జరిగే ఆత్మహత్యలు, హత్యలకు ముగింపు చెప్పవచ్చుననే ఓ అర్థవంతమైన కథ.

– యస్. హరనాథబాబు
హైదరాబాద్-500 044.

## హెల్దీ సొసైటీ

*(నాలుగవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)*

అక్టోబరు చతుర నవల 'ఫ్యామిలీ హిస్టరీ కార్డ్' పేరులోనే కాకుండా ఇతివృత్తంలో కూడా నవ్యతను సాధించి కొత్త ఆలోచనలను రేకెత్తించింది. ఇప్పటివరకూ వధూవరుల జాతకాలు చూసి పెళ్ళిసంబంధాలు సెటిల్ చేసుకోవడం మనం చూస్తున్నాం. ఇకముందు రాబోయేకాలంలో 'ఫ్యామిలీ హిస్టరీ కార్డ్'ల ప్రకారం పెళ్ళిసంబంధాలు కుదుర్చుకుంటారేమోననిపిస్తున్నది.

సమాజం ఆరోగ్యవంతంగా ఉండాలనుకోవడంలో తప్పులేదు. అందుకు కృషి చెయ్యడం కూడా అవసరమే. అయితే హెరిడిటరీ జబ్బులున్నవాళ్ళు పెళ్ళి చేసుకోకూడదు- ఒకవేళ పెళ్ళి చేసుకున్నా పిల్లల్ని కనకూడదనటం ఎంతవరకూ సబబైన విషయమో ఆలోచించాలి. వాళ్ళ పిల్లల్ని కనే హక్కులేదంటే, వాళ్ళ జీవితకాలంలో పొందాల్సిన అనుభూతుల్ని, జీవన మాధుర్యాన్ని కోల్పోయినట్లేగదా! పిల్లల్ని కని, పెంచి, మంచి పౌరులుగా తీర్చిదిద్దే ఆనందం మరెక్కడ లభిస్తుంది? ఇంకో అడుగు ముందుకేస్తే దృఢకాయులు, మేధావులు మాత్రమే పిల్లల్ని కనాలనే వాదన రాదనేముంది?

'ఫ్యూచర్ సొసైటీలో ఉండకూడనిది డిసీ

జ్డ్ పర్సన్స్‌కాదు. ప్రేమించే హృదయం లేనివాళ్ళూ, జాలీ, దయా మర్చిపోయిన వాళ్ళు. వీళ్ళూ వుండకూడనిది. ఇలాంటి మెటీరియలిస్టిక్ మనుషులవల్లే కమింగ్ వరల్డ్ సిక్ యూనిట్‌గా మారబోతోంది' అన్న శిల్ప మాటలు ఎంతో అర్థవంతంగా వున్నాయి. ప్రొఫెసర్‌గారి ఇంటిని మినీ ఇండియాగా భావించడం బాగుంది. వాళ్ళ చర్చలో 'మానవతా విలువల్ని అర్థం చేసుకోవడానికి ప్రయత్నిస్తే, ఫ్యూచర్ సొసైటీ చాలా హెల్దీగా వుంటుంది' అనుకోవడం సమంజసంగానే ఉంది.

చివరకు ఎలాగైతేనేం అందరూ కలిసి డ్రామా ఆడి మెటీరియలిస్టిక్ దృక్పథంతో వున్న డాక్టర్ దిలీప్‌లో మార్పు తెచ్చి, యూజెనిక్స్ కంటే ప్రేమానుగారాలదే గెలుపని చాటి చెప్పిన నవల ఇది.

– సూజోరా
మైలవరం

## హిస్టరీలో మిస్టరీ!

*(అయిదవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

**'యూజెనిక్స్'** విభాగం వైద్య, విజ్ఞాన శాస్త్ర అధ్యయనంలో ఒక విశిష్టమైన ఆవిష్కరణ. ప్రతీ ఆవిష్కరణ వెనుకా ఒక ప్రబలమైన అవసరం ఉంటుంది. దురదృష్టవశాత్తూ ఆ అవసరం ఎందుకు కల్గిందో మనమెవ్వరం పట్టించుకోవడంలేదు.

నిర్వీర్యమైన భావితరాన్ని తయారుచేయడం ఒక సామాజిక నేరమని, దానికి మనం అందరం బాధ్యులం అంటూ, ఒక వినూత్నమయిన ఇతివృత్తంతో కోలపల్లి ఈశ్వర్‌గారు తమ నవలద్వారా ఒక సామాజిక స్పృహని ఉత్తేజభరితంగా 'దిలీప్' ద్వారా ప్రస్తావించడం హర్షించదగ్గ విషయం.

అయితే 'కుటుంబ నియంత్రణ - దేశభవిష్యత్తు' అన్న అతి సాధారణమైన, కానీ అతి ముఖ్యమైన సందేశాన్ని మనం ప్రజలకి అందించడంలోనే దారుణంగా విఫలమైన నేపథ్యంలో, 'యూజెనిక్స్' విశిష్టత, తద్వారా భావితరాలకి రక్షణ కవచం ఏర్పాటుకై మన తక్షణ కర్తవ్యం వంటి అతి నాజూకైన సందేశాన్ని 'దిలీప్' ద్వారా ప్రబోధింపచేయడంలో సఫలీకృతులు కాలేకపోయారు రచయిత.

ర్యాగింగ్ టైమ్‌లో రాయించిన ప్రేమలేఖ ఆ దిలీప్‌కే చేరడం, ఏక్సిడెంట్ విక్టిమ్ హైమావతి అవడం, ప్రొఫెసర్ విల్సన్ మోహన్‌గా నటించడం, పరాకాష్ఠగా హైమావతి అందరి సహకారంతో అమోఘంగా నటించడం, ఇన్ని అభూతకల్పనల వలయంలో రచయిత చిక్కుకొనిపోయి, తప్పించుకోలేక చివరికి ఆ దిలీప్‌నే బలిచేసి తద్వారా యూజెనిక్స్ అన్న పదాన్ని ఒక జోక్‌గా మలిచి పరోక్షంగా సామాజిక నేరం చేశారు. ఆఖరికి 'ఫ్యామిలీ హిస్టరీ కార్డ్'లో కెమిస్ట్రీ ఒక మిస్టరీగా మిగిలిపోయింది.

*– మంగళంపల్లి వెంకటసీతారామయ్య*
హైదరాబాద్-43

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 3730328.
Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad.
Tel: Hyderabad: 3318181, 3398787; Chennai: 8270434, 8251044; Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75757; Anantapur: 33777; Rajahmundry: 79170; Karimnagar: 23216; Suryapet: 21146; Guntur: 512149; Nellore: 338734; Kurnool: 52122; Srikakulam: 26060; Cuddapah: 70011; Tadepalli gudem: 28881; Warangal: 59933. Khammam: 55661; Ongole: 56777; Nizamabad: 45661; Mahabubnagar:77438; Mumbai: 022- 4703700; Chennai: 044- 2314980; Bangalore: 080- 3503498

CHATURA Telugu Monthly Hyderabad-500 082 Regd. No. H/HD/965- RN1/32186/78